ఆగస్టు 2007

వెల రూ. 7/-

# చతుర




మూడో
బహుమతి పొందిన
శ్రీ ఉదయిని
నవల

**జీవన శోధన**

## సంతానం కలిగి, అన్యోన్య దాంపత్య జీవితం ఉండి, విశాలహృదయం కలిగిన 22-35 మధ్య వయసులోని మహిళావలంటీర్లు "సరొగేట్ మదర్" గా వ్యవహరించటానికి కావాలి !



పెళ్లి జరిగి, సంతానం కనగల వయసులో ఉండి, సంతానం కావాలని కోరుకున్నా పిల్లలు పుట్టని దంపతులు జనాభాలో పదిశాతం ఉన్నారు. అన్ని రకాల వైద్య సహాయం అందించినా కూడా వీరిలో కొందరు గర్భం ధరించలేక పోవటమో, ధరించినా నిలుపుకోలేక పోవటమో జరుగుతుంటుంది. అటువంటి వారికి టెస్ట్ ట్యూబ్ బేబీ విధానం ద్వారా శరీరం బయట అండాన్నీ - వీర్యకణాలనీ కలిపి ప్రయోగశాలలోనే "ఎంబ్రియో"ని రూపొందించడం జరుగుతుంది. అలాంటి సూక్ష్మమైన ఎంబ్రియోని తమ గర్భాశయం లోనికి ప్రవేశపెడితే జరిగే గర్భధారణని నిలుపుకొని, నవమాసాలు మోసి, పుట్టిన సంతానాన్ని అసలు తలిదండ్రులకు అందచేయడాన్ని **సరొగేట్ మదర్ హుడ్** (Surrogate Motherhood) **అంటాం.**

స్వయంగా ఈ ప్రకృతి కార్యాన్ని నిర్వహించుకోలేని దంపతులకు ఆధునిక వైద్యశాస్త్రం అందిస్తున్న సౌకర్యమే సరొగేట్ మదర్‌హుడ్. ఇలాంటి పవిత్ర కార్యాన్నీ, పుణ్యకార్యాన్నీ విశాల హృదయంతో అంగీకరించి, బాధ్యతాయుతంగా పని పూర్తి చేసి, బిడ్డని కని అసలు తలిదండ్రులకు అందించటానికి సిద్ధంగా ఉన్న ఉత్తమ స్త్రీలకీ / దంపతులకీ, సహాయం పొందే దంపతులు తమ ఆర్థిక సామర్థ్యాన్ని బట్టి మంచి ప్రతిఫలాన్ని కృతజ్ఞతా పూర్వకంగా అందించడానికి సిద్ధంగా ఉన్నారు. ఇటువంటి ఉన్నతమైన, సంస్కారవంతమైన దానకార్యాన్ని ఆనందంగా అమలు చేద్దామని కోరుకుంటున్నవారు **92463 30020/040-6646 7744** నంబరుకు ఫోన్ చేసి సంప్రదించవలసినదిగా కోరుతున్నాం.

**మానవసేవే - మాధవసేవ**

నవ్య నవలా వేదిక

సంపుటి - 30
సంచిక - 7
ఆగస్టు 2007
355వ సంచిక

# చతుర





'చతుర' ప్రతిష్ఠాత్మకంగా నిర్వహించిన నవలల పోటీలో తృతీయ బహుమతి రూ.10,000లు పొందిన **శ్రీ ఉదయిని** నవల

## జీవన శోధన

.... 10వ పేజీలో

బొమ్మలు : ఆనంద్

ముఖచిత్రం : **తమన్నా** (మోడల్)
ఫొటో : **జయకృష్ణ**

కాలాతీతం

# ది బ్రదర్స్ కరమజోవ్

(1880)




ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయవేదిక

**(గత సంచిక తరువాయి)** ఈ మహాను భావుడు డబ్బంతా ఎక్కడో దాచివుంటాడు గదా! మూడువేల రూబుళ్లు తీసుకుని గ్రూషెంకాతో ఎక్కడికైనా లేచిపోతాడు" అన్నాడు స్మెర్డ్యాకోవ్.

"నన్నేం చెయ్యమంటావు మరి? "

"ముసలాయన చెప్పినట్టు చెయ్యి. రేపు చెర్మాష్న్యా వెళ్లిపో. ఆల్యోషా ఎట్లాగూ మోనాస్టరీ నుండి రాడు. గ్రూషెంకా వచ్చే సమయానికి మీరిక్కడ ఉండగూడదు".

"కానీ... నువ్వూ, గ్రెగొరీ కలిసి మిత్యాను అడ్డగించగలరా? "

"నా ఉద్దేశం అది కాదు. గ్రెగొరీ గొడ్డులా నిద్రపోతాడు. కడుపునొప్పి వచ్చిందని నేను గదిలోంచి కదలను"

"మరి నాన్నను రక్షించేదెవరు? "

"అసలు విషయం తెలియక నువ్విలా మాట్లాడుతున్నావు ఇవాన్. గ్రూషెంకాను పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాడు ఈ పెద్ద మనిషి. అదే జరిగితే మనకేమీ మిగలదు. పెళ్లికి ముందే ఆయన చస్తే నలభైవేల రూబుళ్లు అందరం పంచుకోవచ్చు"

"ఓహో, అన్నీ ఆలోచించావన్నమాట"

"మరి చెర్మాష్న్యా వెళతావా? "

"ఆలోచిస్తాను" అన్నాడు గాని ఇవాన్, తండ్రి కోరికను నెరవేర్చడమే అందరికీ శ్రేయస్కరమని అతడికీ తెలుసు.

★ ★ ★

చర్చి దగ్గిర, ఒక చిన్న ఇంట్లో వుంటుంది గ్రూషెంకా. ఆమె పనిమనిషి ఫోన్యా. ఒక సాయంత్రం ఆమె ఏదో కుట్టుకుంటూ కూర్చున్నప్పుడు మిత్యా వచ్చి "గ్రూషెంకా ఎక్కడ? " అంటూ అల్లరి చేశాడు. తర్వాత తనే "ఫోన్యా, నా గ్రూషెంకా ఎక్కడుందో చెప్పు. లేకపోతే నేనిక్కడే చచ్చిపోతాను" అంటూ తల గోడకేసి బాదుకున్నాడు.

"ఆమె ఎక్కడికెళ్లిందో నిజంగా నాకు తెలియదు" అంది ఫోన్యా భయంగా.

"లేదు. అబద్ధమాడుతున్నావు" అంటూ అక్కడే పడివున్న యిత్తడి గుండ్రాయి తీసుకుని వీధిలోకి పరుగెత్తాడు మిత్యా.

రోడ్డు నిర్మానుష్యంగా వుంది. ఒక చౌరస్తా దాటి, బ్రిడ్జిపైన నిల్చుని కాసేపు ఆలోచించి తండ్రి యింటి సందుకు చేరుకున్నాడతను. ముందర ఉన్న పెద్ద తోటకు కంచె గేటువేసి ఉన్నది. ఒక

గెంతులో అది దాటి, మెత్తటి గడ్డిమీద నెమ్మదిగా నడిచాడు. తండ్రి పడగ్గదిలో లైటు వెలుగుతున్నది. ఇదే అదను. గది తలుపుతట్టి, చీకట్లో దాక్కున్నాడు.

అతి నిశ్శబ్దంగా తలుపు తెరిచాడు ఫ్యోదొర్. చారల సిల్కుగౌను వేసుకుని, షేవ్ చేసుకుని, ఒంటికి సుగంధ ద్రవ్యాలు రాసుకుని బంగారు బొత్తాలున్న షర్టుతో పూలరంగడిలా ఉన్నాడతడు. అటూ, యిటూ చూసి, "గ్రూషెంకా, నువ్వేనా? త్వరగా రా" అంటూ పిలిచాడు. ఎక్కడా అలికిడి లేదు.

"రావే నా బంగారు బొమ్మా. రావే నా పంచదార చిలకా" అంటూ ముద్దుముద్దుగా ప్రేయసిని మళ్లీ ఆహ్వానించాడు.

"ఓహో! ఈ మాటల అర్థం మూడువేల రూబుళ్లు ఇస్తానని కాబోలు" అనుకున్నాడు మిత్యా. ఆ డబ్బు తనకంతకంటే ఎక్కువ అవసరం.

"రావే. నా ఖజానా అంతా నీదే"

చేతికందినంత దూరంలోనే ఉన్నాడు ఫ్యోదొర్. ఇత్తడి గుండ్రాయిని చేతిలోకి తీసుకున్నాడు మిత్యా...

ఆ తర్వాత కళ్లు తిరిగినట్టయింది. గడ్డిలో పరుగెడుతుంటే, 'హత్య... హత్యా!' అని అరుస్తూ ఎవరో కాలు పట్టి లాగారు. గుండ్రాయితో ఒక్కదెబ్బ వేశాడు మిత్యా. అంతే. ముసలి పనిమనిషి నేలకూలాడు.

గ్రెగొరీ తల చితికింది. ఇది అనుకోని హత్య. ఇక తనకథ ముగియటానికెక్కువ సమయం పట్టదు. చివరిసారిగా గ్రూషెంకాను చూడాలనుకున్నాడు మిత్యా. ఫోన్యా తన బామ్మతో కబుర్లు చెబుతున్నప్పుడు సుడిగాలిలా ప్రవేశించిన మిత్యా.

'ఎక్కడ? అదెక్కడ?' అంటూ ఆమె గొంతునొక్కి చంపినంత పనిచేస్తే ఫోన్యా యజమానురాలి గుట్టు విప్పింది.

'అమ్మగారు ఆఫీసరుకోసం వెళ్లింది. ఆయన మాక్రోలో వుంటారు. ఆమె కోసం వెదుకుతున్నారేం, చంపుతారా?"

మిత్యా వినిపించుకోకుండా గుర్రాల చావిడి వద్దకు వచ్చి బండి సిద్ధం చేసుకున్నాడు.

'నాకు మూడు డజన్ల షాంపేను బాటిల్సు కావాలి. అర్ధరాత్రికి మాక్రో చేరిస్తే ఇరవై రూబుళ్లు బహుమానమిస్తా' అన్నాడు బండివాడితో. పిచ్చిగా అరుస్తూ, త్వరగా పోనిమ్మని అతన్ని బూతులు తిట్టాడు.

మాక్రోలో గ్రూషెంకా వున్న హోటల్ గదిలోకి దూసుకెళ్లాడతను. పోలిష్ ఆఫీసర్, మరో యిద్దరు మిత్రులూ అక్కడ పార్టీ చేసుకుంటున్నారు.

'మీ ఆనందంలో నేనూ పాలు పంచుకుంటా. కావలసినంత షాంపేను తెచ్చా. డబ్బు కూడా ఉంది' అంటూ పోలిష్ ఆఫీసర్ను పక్కగదిలోకి తీసికెళ్లి 'మూడు వేల రూబుళ్లు తీసుకుని నా ప్రేయసిని వదిలిపెట్టు. తనులేకుండా బతకలేను' అంటూ కన్నీరు పెట్టుకున్నాడు మిత్యా.

ఆఫీసర్ గ్రూషెంకా ముందే అతన్ని తిట్టాడు. మిత్యా అంటే ఆమెకు యింకా యిష్టమే. నీలాంటి ముసలాడి కన్నా తీసిపోయాడా మిత్యా! అతడ్నే పెళ్లి చేసుకుంటాను' అంటూ తెగేసి చెప్పింది.

సరిగ్గా, అప్పుడే తలుపు చప్పుడైంది.

పోలీసు ఇన్స్పెక్టర్ లోపలికి వచ్చి 'మిత్యా! నీ తండ్రిని హత్య చేసినందుకు అరెస్టు చేస్తున్నాను'



# ఫ్యోదొర్ దొస్తొయేవ్‌స్కీ (1821-1881)

**(గత సంచిక తరువాయి)** తన రచనలనిప్పుడు పత్రికలు అంగీకరిస్తాయని నమ్మకంలేదు. స్వయంగా ఒక సాహిత్య పత్రిక ప్రారంభించి అందులో, "ది హౌజ్ ఆఫ్ ది డెడ్" "ది ఇన్సల్టెడ్ అండ్ హ్యూమిలియేటెడ్" సీరియల్‌గా ప్రచురించాడు. పాఠకులకీ రెండు పుస్తకాలూ నచ్చాయి. పరిస్థితి కాస్త మెరుగు పడింది. దొస్తోయేవ్‌స్కీ యూరోపు పర్యటనకు బయద్దేరాడు. ఒకటి రెండు ప్రేమ వ్యవహారాల తర్వాత, తిరిగి వచ్చే సరికి పత్రిక అప్పుల్లో వుంది. జూదమాడి సంపాదిస్తే తప్ప ఇవి తీర్చలేడు. మరికొన్ని అప్పులు చేసి 1865లో దివాళా తీసినట్లుగా ప్రకటించుకున్నాడు. పత్రిక ఆగిపోయింది. భార్య మరణించింది. అకాల వృద్ధాప్యం వచ్చింది. మూర్ఛరోగం తిరగబెట్టింది.

రచయితగా గౌరవించినవాళ్లు కూడా ఈ దిగజారిన మనిషిని అసహ్యించుకున్నారు. అప్పుడు రాసిన నవలే "క్రైం అండ్ పనిష్మెంట్". తర్వాత అదే పబ్లిషర్ మరో నవల కావాలన్నాడు. ఒక స్టెనోగ్రాఫర్‌ను పిలిచి "ది గాంబ్లర్" డిక్టేట్ చేశాడు దొస్తోయేవ్‌స్కీ. ఆమె పేరు అన్నాగ్రెగొరియెన్నా. వయస్సు ఇరవై. మరో రెండేళ్లకు అన్నాను పెళ్లి చేసుకున్నాడు దొస్తొయేవ్‌స్కీ. అప్పటి దాకా దొస్తొయేవ్‌స్కీ సంపాదన మీద ఆధారపడిన అతని తమ్ముడి భార్యా, పిల్లలూ ఆమె అడ్డు తొలగించుకోవటానికి ప్రయత్నించారు. అన్నా భర్తను కొన్నాళ్ల యూరోపు పర్యటన పంపింది. ఒంటరితనాన్ని భరించలేని దొస్తొయేవ్‌స్కీకి మూర్ఛరోగం తిరగపెట్టింది. జూదమాడి వున్నదంతా పోగొట్టుకున్నాడు. అన్నా తనకు తోడుగా వచ్చిన తర్వాత కూడా అలవాట్లు మారలేదు. ఇద్దరు పిల్లలు పుట్టారు 'ఇడియట్' నవల ప్రారంభించారు. డబ్బు సరిపోక మరో నవల 'ది పొసెస్డ్'కు అడ్వాన్సు తీసుకున్నాడు. ఉన్నవన్నీ, చివరికి భార్య దుస్తులు, అండర్‌వేర్లు కూడా తాకట్టు పెట్టిన 'గాంబ్లర్' దొస్తొయేవ్‌స్కీ. గొప్ప రచయితగా పేరు వచ్చింది. ఎంత సంపాదిస్తేనేం? చిల్లుకుండలో నీళ్లే! 1871నాటికి దొస్తొయేవ్‌కి యాభై నిండాయి. 'పొసెస్డ్'లో రాడికల్స్‌ను, సంస్కరణవాదులను దుయ్యబట్టిన తీరు ప్రభుత్వాధికారులకు నచ్చింది. మంచి

అంటూ సమన్లు చూపించాడు.

★ ★ ★

'మిత్యా నిర్దోషి' అన్నాడు అల్యోషా.

'నీకెలా తెలుసు? ' - ఇవాన్

'నాన్న మరణించిన విషయం కూడా తనకి తెలియదు. గ్రిగరీని చూసి పోలీసులు అతడే నాన్న అనుకుని వుంటారు.'

'స్మెర్ద్యాకోవ్ ఎలా వున్నాడు? '

'తెల్లారిందాకా మూర్ఛనుండి తేరుకోలేదు. ఇప్పుడు బాగానే వున్నాడు. ఇక్కడ చూసే వాళ్లెవరూ లేరని మారియా యింటికి పంపాను'

ఇవాన్‌కు వెంటనే స్మెర్ద్యాకోవ్‌ను చూడాలనిపించింది. మారియా యింటికెళ్లాడు. అక్కడ, సోఫా మీద డ్రెసింగ్ గౌనులో పడుకున్నాడు స్మెర్ద్యాకోవ్. మొహం పీక్కు పోయినట్టుగా వుంది.

ఇవాన్‌ను చూస్తునే లేచి కూర్చుని,

జీతంతో 'ది సిటిజన్' పత్రికకు సంపాదకత్వం అప్పగించారు. ఏడాది తిరక్కముందే తన మీద తనకే అసహ్యంవేసి ఆ ఉద్యోగం వదిలేశాడతను. ఆర్జన కోసం భర్త పుస్తకాలన్నీ స్వయంగా ప్రచురించి చాలా డబ్బు సంపాదించింది అన్నా. ప్రపంచ మానవాళికి మార్గదర్శనం చేయగల దేశం రష్యా అన్నాడు దొస్తొయేవ్. పాఠకులు అతడ్ని ఒక ప్రవక్తగా చూశారు.

'ఎ రా యూత్' పేరిట మరొక నవల ప్రచురించాడు. రష్యన్లే కాక, యూరోపియన్‌లూ బ్రహ్మరథం పట్టిన చివరి దశలో 'బ్రదర్స్ కరమజోవ్' (1880) రాశాడు. షేక్స్‌పియర్, సెర్వాంటెస్, గెటే, డాంటెలతో సరితూగగల నలుగురు రష్యన్లలో దొస్తొయేవ్ ఒకడు. మిగతా ముగ్గురు గొగోల్, తుర్గెనీవ్, తొలస్తోయ్.

'బ్రదర్స్ కరమజోవ్'లో 'థ్రిల్లర్' ప్రక్రియలో తాత్విక విషయాలను చర్చించిన తొలి రచయిత దొస్తొయేవ్స్కీ. సామాజిక విషయాలే కథను నడిపించినా, ఆధ్యాత్మికాన్వేషణ దీని ప్రధానోద్దేశం.

'నీకేమైంది! చేతులెందుకు వణుకుతున్నాయి? భయపడకు. నీకేం కాదులే' అన్నాడు.

'అదేమిటి? నాకేం భయం? భలే వాడివే!' అన్నాడు ఇవాన్ ఆశ్చర్యంగా.

'నీ గురించేమీ చెప్పనని మాటిస్తున్నాను.'

ఇవాన్‌కు చిర్రెత్తుకొచ్చింది 'ఏమిట్రా వాగుతున్నావు అసలేం జరిగిందో చెప్పు!' అంటూ గద్దించాడు. చెర్మాష్న్యా వెళ్లట మేనా తను చేసిన నేరం?

'ఎంతకాలం యిలా ఒకర్నొకరం మోసం చేసుకుందాం! తప్పంతా నాదేనంటావా ఏమిటి! అసలు హంతకుడివి నువ్వు. నీ చేతిలోని ఆయుధాన్ని మాత్రమే నేను'

'ఏం చేశావురా బాబూ!' అంటూ అడిగాడు ఇవాన్ ఆదుర్దాగా.

'ఏముంది? నీకోరిక మేరకు తలకాయ పచ్చడి చేశాను' అంటూ నోట్ల కట్టలు తీసి టేబుల్ మీదికి విసిరేశాడు స్మెర్డ్యాకోవ్.

'నిజమా? ఎలా చేశావు? '

'రాత్రి ఎనిమిదింటికి మెట్ల మీద జారిపడ్డాను. అది చూసి మూర్ఛని నన్ను మంచం మీదకి చేర్చాడు. మరికాసేపటికే 'గ్రిగొరీని చంపేశాడు మిత్యా' అంటూ ముసలాయన అరుపులు వినిపించాయి. మిత్యా ఒక హత్య చేశాడు. రెండోది కూడా అతడే చేశాడని అందరూ నమ్ముతారు. ఆయన గది వద్దకెళ్లి 'గ్రూషెంకా వచ్చింది' అంటూ తలుపు తట్టాను. 'ఎక్కడుంది? 'అంటూ అడిగాడు లోపల్నుంచే. తోటలో వుందని చెప్పాను. అతడు కిటికీలోంచి బైటికి చూశాడు. వెనకగా వెళ్లి ఇనుప పేపర్ వెయిట్స్‌తో తలమీద బలంగా కొట్టాను. మొదటి దెబ్బతో ప్రాణం పోలేదనిపించింది. మరోసారి కొట్టాను. పేపర్ వెయిట్స్‌ను శుభ్రంగా కడిగి దాచిపెట్టాను. విగ్రహం వెనకనుండి డబ్బు పాకెట్ తీసుకున్నాను. నోట్లు జేబులో పెట్టుకుని పాకెట్ పారేశాను. పోలీసులకు మిత్యామీదే అనుమానం వస్తుంది'

'దుర్మార్గుడా నోట్లు పోలీసుల కిస్తాను. జరిగింది చెప్పేస్తాను' అన్నాడు ఇవాన్.

'భయపడకు. నోట్ల నెంబర్లెవరికీ తెలియవు. పైగా, నేనే హత్య చేశాననటానికి సాక్ష్యమేమీ లేదు' అన్నాడు స్మెర్డ్యాకోవ్.

–ఎం.వసంత (ముగింపు వచ్చే సంచికలో...)

# జీవన శోధన

పసివారిలో ఉండే స్వచ్ఛత, కల్లాకపటం తెలియని తనం, పరోపకార గుణం, గొప్ప తెలివితేటలు ఆ యువకుడి సొంతం. తల్లిలేనివాడని అత్యంత ప్రేమగా పెంచిన తండ్రే చివరికి అతనిపట్ల వైముఖ్యం ప్రదర్శించాడు. తన కొడుకును ప్రేమించి, కొడుకుచే ప్రేమింపబడిన ఓ యువతి పెళ్లికి అనుమతి కోరగా 'నీ జీవితాన్ని ఎందుకు చెడగొట్టుకుంటావు? వాడు నాకొడుకే అయినా చెబుతున్నాను వాడితో జీవితం పంచుకోవడం సులభం కాదు..' అని హితబోధ చేస్తాడా తండ్రి. పెళ్లికి సైతం వెళ్లడు. పైగా కొడుకూ కోడలు ఇంటికి రాగానే ఇల్లు వారికి అప్పగించి కాశీకి వెళ్లిపోతాడు. తండ్రి కనుమరుగయ్యాక కుమిలికుమిలి ఏడవడం ఆ యువకుడి వంతవుతుంది. ఎంత నిర్లిప్తంగా ఉన్నా మనిషిలోని సహజమైన మమతలకు ఎవరూ అతీతులుకారనే వాస్తవాన్ని కళ్లకు కట్టించిన **శ్రీ ఉదయిని** నవల **'జీవనశోధన'** ఈనెల చతుర సమర్పణ.

చతుర నవలల పోటీలో **తృతీయబహుమతి రూ.10,000** పొందిన ఈ రచన ఆద్యంతం విభిన్న అనుభవాల.. జీవితాల సంగమం..



గీతకి మెలకువ వచ్చింది కాని కళ్ళు తెరవకుండా బద్ధకంగా పడుకుంది. రాత్రి పన్నెండున్నర వరకూ రాస్తూ ఉండిపోయింది ఆమె. ఆ తరువాత పక్కపైకి చేరినా ఓ పట్టాన నిద్ర రాలేదు. ఇంకా చేయవలసిన ఎక్స్‌పెరిమెంట్లు, రాయాల్సిన ఛాప్టర్లు, సేకరించాల్సిన సమాచారం గురించిన ఆలోచనలు ఆమెని చుట్టుముట్టి సతాయించాయి. ఇక నిద్రలో కలలో కూడా అవే సంగతులు... ఏవేవో ఈక్వేషన్స్, ఇంకెన్నో అవరోధాలు, విఫలమయిన ప్రయోగాలు కలగాపులగంగా కలలో ఆమెని భయపెట్టాయి కూడా. ఎంతో జాగ్రత్తగా రాసి ప్రొఫెసర్‌కి కాయితాలు అందిస్తే ఆయన వాటి వంక చూసిచూడకుండానే 'ఏమిటీ చెత్త?' అంటూ పరపరా చింపెయ్యటం అసంగతంగా సాగిన స్వప్నంలో క్లైమాక్స్!

గీత కెమిస్ట్రీలో పిహెచ్‌డి మొదలు పెట్టి అప్పటికే మూడు సంవత్సరాలు దాటింది. ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా థీసిస్ రాసి ఏదన్నా ఉద్యోగంలో చేరాలని ఆరాటంగా ఉంది ఆమెకి. కలలో ప్రొఫెసర్‌కి అంతగా నచ్చని విధంగా ఏం రాసి ఉంటానా అన్న ఊహని నివృత్తి చేసుకోవటం కోసం అన్నట్లు గజిబిజిగా ఆలోచించడం మొదలు పెట్టింది. కలని నిజం అనుకోవటంకాని, భవితలో జరిగే ఏదో విషయానికి సంకేతం అని భావించటం కాని మూర్ఖత్వం అని గీతకి తెలుసు. కానీ కెకులే అనే శాస్త్రజ్ఞుడు కల ఆధారంగానే ఆర్గానిక్ కెమిస్ట్రీలో అంతవరకూ కొరుకుడు పడని ఓ క్లిష్టమైన సమస్యకి పరిష్కారాన్ని కనుక్కున్నాడని అంటారు కదా. అలాగే ఇప్పటి కలలో తనకి పనికి వచ్చే అంశమేదయినా ఉందా అని ఆలోచిస్తూ పక్క మీద అటుపక్కగా తిరిగింది గీత. అన్నీ అసందర్భమయినవి, హాస్యాస్పదమైనవే అని నిర్ణయించుకుని అతి కష్టంమీద కళ్ళు విప్పింది గీత.

అదే సమయానికి వంటింట్లో కుకర్ ఆవిరి చేస్తున్న శబ్దం వినబడింది. గీత టక్కున నిలబడింది. అమ్మ అప్పటికే లేచి పని మొదలు పెట్టిందన్నమాట! తల్లికి సాయం చేయాలని గీత ఎంతగా అనుకున్నా ఎప్పుడూ సాధ్యపడటం లేదు. బాత్‌రూమ్‌లోకి పరుగెత్తింది గీత.

★ ★ ★

హడావిడిగా టవల్‌తో మొహం తుడుచుకుంటూ వంటింట్లోకి అడుగు పెట్టింది గీత. ఆమె తల్లి జయ గోధుమ పిండి డబ్బా మూత తీస్తోంది. గీత ఆ డబ్బా అందుకుని 'చపాతి పిండి నేను కలుపుతాను... నువ్వు నాతో పాటు కాఫీ తాగుతావా అమ్మా?' అని అడిగింది.

అప్పటికే లోలోపల ఏదో స్తోత్రాన్ని పఠిస్తున్న జయ సరే అన్నట్లు తల ఊపింది. ఫిల్టర్ తీస్తే తెలిసింది, జయ ఇంకా కాఫీ కూడా తాగలేదు!

రేపైనా ఇంకా ముందుగా లేవాలి, అమ్మకి సాయం చేయాలి అని గట్టిగా అనుకుంది గీత. గబగబా కాఫీ కలిపి తల్లికి ఓ కప్ అందించింది. రాత్రంతా ఆమెని సతాయించిన పిహెచ్‌డి ఆలోచనలు ఎక్కడికి పారిపోయాయో కాని ఇప్పుడు ఆమెకి తల్లి ఎదుర్కొన్న కష్టాలు గుర్తుకి వచ్చాయి. ఎంత ధైర్యంగా పరిస్థితులని ఎదుర్కొని పోరాడింది తల్లి! జయ వంక చూస్తూ కాఫీ తాగసాగింది.

★ ★ ★

రాఘవ గీత తండ్రి. ఆయన బీఏ పూర్తి చేశాక ఒక కేంద్ర ప్రభుత్వ పరిశోధనా సంస్థలో చేరాడు. అక్కడ ఉన్న వాతావరణం అతణ్ణి బాగా ప్రభావితం చేసింది. ఆ సంస్థ లైబ్రరీలో ఉన్న ఎన్నో పుస్తకాలు కూడా అతని దృక్పథాన్ని క్రమంగా మార్చ

సాగాయి. సైన్స్ గురించి, సైంటిఫిక్ టెంపర్ గురించి అతనికి అవగాహన ఏర్ప డింది అక్కడే...! మెల్లగా ఆ అవగాహన అతణ్ణి హేతువాదం వేపు నడిపించింది.

సైన్స్ చదవలేదే అన్న పశ్చాత్తాపం అత ణ్ణి ఆవరించిందేమో తెలియదు కానీ త్రిక రణశుద్ధిగా రేషనలిజాన్ని నమ్మసాగాడు. చివరికి పెళ్ళి కూడా మంత్రాలు, మంగళ వాయిద్యాలు, పురోహితులు లేకుండా చాలా సాదాసీదాగా జరగాలని అతను షరతులు పెట్టడంతో పిల్లని ఇద్దాం అని వచ్చిన వాళ్ళెందరో వెనక్కి తిరిగారు. కట్నం తీసుకోవటానికి కూడా అతను వ్యతిరేకి అని గ్రహించిన జయ తండ్రి భేషజాలకి పోకుండా దండల మార్పిడి పెళ్ళికి ఒప్పుకున్నాడు. అయితే జయతో ముఖాముఖీ ఏకాంతంగా మాట్లాడాల న్నాడు రాఘవ.

జయ ఇంటర్ వరకు చదివింది. ఆ తరువాత తండ్రికి సాయంగా ఉండాలని ఓ స్కూల్‌లో టీచర్‌గా చేరింది. పూజా పునస్కారాలు, తప్పకుండా గుడికి వెళ్లడం అలవాటున్న కుటుంబం వారిది.

రాఘవ తన ఆశయాలు జయకి చెప్పాడు. దేవుడు, విగ్రహారాధన పైన తనకి అసలు నమ్మకం లేదని రేపు పిల్లలు పుట్టాక వాళ్లనికూడా తనలాగానే రేషనలిస్టులుగా తయారుచేయాలని ఆశ అన్నాడు.

లెక్కకు అందని నక్షత్రాలు, కొన్ని గ్రహాలు, సూర్యచంద్రులు, ఇంత విశాల మైన భూమి, దాని పైన చీమ నుండి ఏనుగు వరకూ ఎన్నెన్నో ప్రాణులు, వాటి ఆకలి దప్పులు తీర్చడానికి అన్నట్లు రకర కాల ఫలాలని, ఆహారాన్ని అందించే వృక్ష రాశులు ఇవన్నీ కళ్ల ఎదురుగా కనబడుతు న్నాయి కదా... అలాంటిది ఈయనేమిటీ అసలు దేవుడు లేడంటున్నాడు అన్న సంభ్రమం జయకి కలిగింది. కాని కట్నం ఇచ్చి నీకు పెళ్లి చేయలేను అని తండ్రి చేసిన హెచ్చరిక గుర్తుకి వచ్చింది ఆమెకి. అందుకనే జయ రాఘవ అన్న ప్రతి విష యానికి తల ఊపింది. భగవదారాధనలో తనకి అంతులేని ఆనందం, ధైర్యం లభి స్తాయి అన్న సంగతి అతనితో చెప్పడానికి ఆమె భయపడింది. ఇంత సౌమ్యంగా ఉన్న వ్యక్తి పెళ్ళి అయ్యాక పూజా పున స్కారాలకి అడ్డు చెప్పేంత దుర్మార్గం చేయ డులే అనుకుంది.

జయ కాపురానికి వస్తూ దేవుడి పటాలు తీసుకువచ్చింది. ఇల్లు అంతా సర్దుకోవటం అయ్యాక అడిగింది. 'ఏమం డీ! వంటిల్లు మరీ ఇరుకుగా ఉంది... హాల్‌లో ఈ పక్కన దేవుడి ఫొటోలు పెట్టుకోనా? '

రాఘవ అదిరిపడ్డాడు- 'అవన్నీ నాకు ఇష్టం లేదని అన్నాను... అయినా ఇందు గలడందు లేడని సందేహము వలదని పాపం చిన్నపిల్లాడైన ప్రహ్లాదుడే చెప్పాడు కదా...నిరాకారుడు, నిరంజనుడు అయిన మీ దేవుడికి ఇలా ఫొటోలలో బందీ అవటం, ప్రతిరోజూ ఒకే రకమైన స్తోత్ర పాఠాలు వినటం ఇబ్బందిగా ఉంటుం దేమో ఆలోచించు' అన్నాడు వ్యంగ్యంగా.

ఏమిటి ఈయన ఇంత వితండంగా మాట్లాడుతున్నాడు అనుకున్న జయ చిన్న పాత్రం తీసుకుని హాల్‌లో ఓ మూల మేకులు కొట్టసాగింది.

రాఘవకి ఒక్క క్షణం పాటు ఏం చేయాలో పాలుపోలేదు. తన జీవితంలోకి కొన్ని గంటలక్రితం అడుగుపెట్టిన భార్య తో వాదన పెట్టుకోవటం సరికాదన్న ఆలో చనవల్లనో, తన ఉద్దేశాలని ఆమెపైన బల వంతాన రుద్దటం సబబు కాదన్న విజ్ఞత వల్లనో అతను మౌనంగా ఉండిపోయాడు.

మిగిలిన అన్ని విషయాలలో వాళ్లిద్దరికీ ఏవిధమయిన సమస్యలు ఉత్పన్నం అవ

లేదు... ఘర్షణా కలగలేదు. దేవుడు అనే సంగతిని విస్మరిస్తే ఇద్దరూ ఎంతో అన్యోన్యంగా ఉన్నట్లే లెక్క. అయితే ఆ విషయం కనబడని ముల్లులాగా ఇద్దరినీ అప్పుడప్పుడూ గుచ్చుతూనే ఉంది.

గీతకి తమ్ముడు పుట్టినప్పుడు గ్రహశాంతులు, జపాలు చేయించాలని తెలుసుకుని జయ రాఘవతో ఆ సంగతి చెప్పింది.

'జయా! ఎన్నిసార్లు చెప్పాలి. అలాంటివన్నీ మూఢనమ్మకాలు... నువ్వు అంటున్న ఆ రాహువు అన్న గ్రహమే లేదు... లేని గ్రహానికి శాంతి చేయటం ఎలా సాధ్యపడుతుంది చెప్పు..? అయినా భవితలు ఒకలానే ఉంటాయని అనుకోవటం ఎంత హాస్యాస్పదమో, ఇలా జపతపాల వల్ల వీళ్లకి మంచి జరుగుతుందని ఆశించడంకూడా పెద్ద పొరపాటు...' అని పెద్ద ఉపన్యాసమే ఇచ్చాడు రాఘవ.

అతను చెప్పిన వాటితో ఏకీభవించేందుకు జయ తయారుగా లేదుకాని శాంతులు, జపాలు మాత్రం కుదరవు అని గ్రహించి ఓ నిట్టూర్పు విడిచి ఊరుకుంది. ప్రపంచంలో ఈయన కన్నా బాగా చదువుకున్న వాళ్ళకి అందరికీ సహజంగా ఉన్న నమ్మకాలు ఈయనగారికి ఎందుకు అబ్బలేదో జయకి మళ్లీ అర్థంకాని ప్రశ్నగానే

## తిరుగులేని జంట



**చా**లా రోజులక్రితం కె.వి.యల్.యన్ ప్రకాశ్, కె.శ్రీఉదయిని ప్రకాష్ అనే పేర్లతో విడివిడిగా రచనలు వచ్చినా ఈ జంట ఇటీవల శ్రీ ఉదయిని అన్న పేరుతోనే కలిసి రాస్తున్నారు. ప్రేమ సమీరం, కలలు కాజేయకు, ఆకాశం ఇద్దరిదీ నవలలు పలు పత్రికలలో బహుమతులు పొందాయి. ఆ వరుసలో జీవన శోధన నాలుగోది. సారే జహాసే అచ్ఛా, ఆకాశం అందినవేళ, విజయం నాదే, దాగుడు మూతలు, ఇద్దరు ప్లస్ ముగ్గురు నవలలు కూడా లోగడ బహుమతులు అందుకున్నాయి. అనిల్ అవార్డు, ఆర్.యస్ కృష్ణమూర్తి అవార్డుతో పాటు వివిధ పత్రికలు నిర్వహించిన పోటీలలో ఇరవైకి పైగా కథలు బహుమతులు పొందాయి.

చిరునామా: **కె. శ్రీఉదయిని,** ఫ్లాట్ నెంబర్ జి- 3, విద్యారణ్య రెసిడెన్సీ, సి- 55, మధురానగర్, సంజీవరెడ్డి నగర్ (పోస్టు), హైదరాబాద్ - 500038.

ఓ గ్రహాన్ని ప్రసన్నం చేసుకోవటం కోసం అని కొన్ని వేలసార్లు ఓ సంస్కృత శ్లోకాన్ని పఠించి జపాలు చేశామని అనటం ఏమిటి...? ఈ దేశంలో సరిగ్గా అదే సమయానికి కొన్ని వేలమంది పుట్టి ఉంటారు. ప్రపంచవ్యాప్తంగా లక్షలమంది పుట్టి ఉంటారు... వీళ్లందరి జాతకాలు, మిగిలిపోయింది.

ఇద్దరు పిల్లలని సమంగానే ప్రేమించినా గీతను ఇంకాస్త ముద్దుచేసేవాడు రాఘవ.

సౌర కుటుంబం గురించి పాఠం గీత నేర్చుకున్నప్పుడు రాఘవ ఉపన్యాసం తరహాలో ఆమెకి చాలా విషయాలు బోధించాడు. 'ఈ నెలని మనం

కార్తీకమాసం అంటాం.. అంటే ఈ మాసంలో పౌర్ణమి చంద్రుడికి దగ్గరగా కృత్తికా నక్షత్రం ఉంటుందన్న మాట... అలాగే విశాఖ నక్షత్రం అయితే వైశాఖ మాసం అంటాం. ఇక్కడ తమాషా ఏమిటంటే దగ్గరగా ఉండటం అంటే మన భారతదేశం నుంచి చూస్తే చంద్రుడికి దగ్గరగా కనబడటం. అంతేకాని ఆ నక్షత్రం ఎప్పటిలాగానే చంద్రుడికి చాలా దూరంగానే ఉంటుంది. అదే అమెరికాలో చూస్తే ఇంకో విధంగా కనబడుతుంది... ఇక ఆస్ట్రేలియాకి వెళ్లి చూస్తే ఆకాశం ఇంకోలాగా కనబడుతుంది. అంతేకాదు మనకి వేసవికాలం అయినప్పుడు ఆస్ట్రేలియాలో చలికాలం అవుతుంది. అయినా మనదేశం నుండి అమెరికా, ఆస్ట్రేలియా వెళ్ళిన వారు మనం ఎప్పుడు పండగలు చేసుకుంటామో అప్పుడే పండుగలు చేసుకుంటారు... అంటే ఇవన్నీ ఆచరించే ఆచారాలు అని వీటికి ఓ నిబద్ధత, ప్రామాణికత లేవని తెలిసిపోతున్నది కదా...'

విశ్వంలో ఉన్న కోట్లాది గెలాక్సీల గురించి ఒక్కొక్క గెలాక్సీలో ఉన్న వందల కోట్ల నక్షత్రాల సమూహాల గురించి అతను తన కూతురికి వివరించడం విన్న జయకి రాఘవ మొండితనంపై చెప్పలేనంత కోపం ముంచుకు వచ్చింది. ఈ విశ్వంలో కోట్ల కోట్ల నక్షత్రాలు ఉన్నాయని ఒప్పుకుంటున్న ఈ పెద్దమనిషి అవన్నీ ఎక్కడ నుంచి వచ్చాయని అనుకుంటున్నాడు? ఏ శక్తి వాటిని పుట్టించిందని భావిస్తున్నాడు? క్రమం తప్పకుండా అవి చలించడానికి ఏ శక్తి కారణం అని ఈయన అనుకుంటున్నాడు...? చదువుకుంటే జ్ఞానం పెరుగుతుంది అంటారు... ఈయనగారు అన్నేసి పుస్తకాలు తిరగేసి సాధించింది అజ్ఞానం కాక ఇంకా ఏమిటి? ఆయన చెడిపోయిందికాక ఇప్పుడు కూతురిని కూడా తన లాగానే పెడదోవ నడిపించడానికి తయారయ్యాడు అని అక్కసుగా అనుకుంది. అయితే ఈ విషయంలో బాహాటంగా భర్తతో విభేదించడానికి భయపడింది.



**ఆయన చెడిపోయింది కాక ఇప్పుడు కూతురిని కూడా తన లాగానే పెడదోవ నడిపించడానికి తయారయ్యాడు అని అక్కసుగా అనుకుంది.**



రాఘవ లేనప్పుడు గీతని పిలిచి "గీతా! నీ వయస్సులో నాకు విష్ణు సహస్రనామాలు కంఠతా వచ్చేవి తెలుసా? నీకు ఒక స్తోత్రం కూడా నోటికి రాదు... ఇదేం బాగాలేదు..." అని మందలించింది జయ.

గీత తల్లిపక్కన కూర్చొని సహస్రనామాల పుస్తకం అందుకుంది. "అమ్మా! నువ్వు ఎలా చదవాలో వినిపించు. నేను పుస్తకంలోచూస్తూ ఫాలో అవుతాను" అంది.

రెండు మూడుసార్లు తల్లి దగ్గర కూర్చుని ఉచ్చారణ నేర్చుకుంది గీత. వారం రోజులలో ఆమెకి మొత్తం సహస్రనామాలు కంఠతా వచ్చాయి. జయ పొంగిపోయింది... కూతురికి తండ్రి బుద్ధులు అబ్బలేదు!

కొత్తగా తనకి అలవడిన క్లిష్టమయిన సంస్కృత నామావళిని తండ్రి ఎదురుగా ఓ సాయంకాలం ప్రదర్శించింది గీత.

భర్త రియాక్షన్ ఎలా ఉంటుందా అని అదురుతున్న గుండెతో ఎదురుచూసింది జయ.

భార్యకి ఉన్న ప్రవృత్తులు బాగా తెలిసిన రాఘవ ఆచితూచి వ్యవహరించాలనుకున్నాడు. అయినా చిన్నప్పటి నుంచి హేతువాదబద్ధంగా ఆలోచించటం అలవర్చటమే తను చేయాల్సింది... దేవుణ్ణి నమ్మటం,



నమ్మక పోవటం అన్నది కూతురి విచక్షణకే వదిలేయటం సరైన పని అని అతను ఎప్పుడో అనుకున్నాడు. అందుకనే "చాలా బాగా నేర్చుకున్నావే! ఇలా నోటితో చెబితే సరిపోదు... సంస్కృత లిపి అంటే నువ్వు నేర్చుకుంటున్న హిందీ లాగానే ఉంటుంది. చక్కగా రాయటం కూడా నేర్చుకుంటే నీకు ఉపయోగంగా ఉంటుంది..." అన్నాడు.

గీత ఉత్సాహంగా రాయటం ప్రాక్టీస్ చేయసాగింది.

జయ పొంగిపోయింది. ఆమె సంతోషం త్వరగానే ఆవిరైంది.. ఓ రోజున "గీతా! రా ఇద్దరం కలిసి పూజ చేద్దాం" అని కూతురిని పిలిచింది.

"లేని దేవుడ్ని ప్రార్థిస్తే నీకు ఏం మన



శ్శాంతి వస్తుందమ్మా" అడిగింది గీత.

"దేవుడు లేడా? మరి... మరి... అవన్నీ ఎందుకు నేర్చుకున్నావు? " కోపంలో జయ మాటలు తడబడ్డాయి.

గీత నవ్వింది. "నువ్వు ఛాలెంజ్ చేశావు కదా! అందుకనే నేర్చుకున్నాను... నాన్న చెప్పేది రైట్... మన ఊహకే అందనంత పెద్దదైన ఈ విశ్వాన్ని నడిపించేది నువ్వు అనుకున్న దేవుడే అయితే ఆయన మననుంచి ఆశించేది అక్షింతలు, పూలు, నైవేద్యాలు కావు... మంచిగా ఉండటం... పక్క వాళ్లకి సాయపడటం".

క్రితం నెల పన్నెండో పుట్టినరోజు జరుపుకున్న కూతురి నోటినుండి వచ్చిన ఆ మాటలకి జయ నిర్ఘాంతపోయింది. వేలెడంత లేవు నువ్వు, ఆరిందాలాగా మాట్లాడుతావా? ఈ పూజలు చేసే వాళ్ళంతా పిచ్చివాళ్లనా నీ అభిప్రాయం అని తప్ప, లాజికల్ గా కూతురికి సమాధానం ఇవ్వలేనని ఆమెకి తెలుసు. అందుకనే కూతురిని పట్టించుకోవటం మానేసింది. కొడుకు అయినా ఇలా ఉలిపికట్టెలాగా తయారవకుండా జాగ్రత్త పడాలని అనుకుంది.

తండ్రికి చాలా విషయాలు తెలుసు అని చిన్నప్పటినుండి గమనిస్తున్న గీతకి తండ్రి పెద్ద హీరో... ఏ సందేహాన్నికైనా ఆయన దగ్గర సమాధానం తయారుగా ఉండేది. ప్రశ్నించటం, సందేహ నివృత్తి చేసుకోవటంలో ఉన్న థ్రిల్ తండ్రి ద్వారా గీతకి బాగా అలవడింది. తనకి తెలిసిన వాళ్లందరూ సర్వశక్తిమంతుడు అని నమ్మిన భగవంతుణ్ణి తండ్రి ఖాతరు చేయకపోవటం గీతకి మొదట్లో అబ్బురంగా ఉండేది. తరువాత తరువాత అది సహజమైన, సబబైన ఆలోచనా విధానంగా తోచేది. ఆ విధంగా ఆమెకి సైన్స్ అంటే ఆసక్తి పెరిగింది.

గీత ఎనిమిదో క్లాసు చదువుతున్నప్పుడు ఆ కుటుంబానికి పెద్ద దెబ్బ తగిలింది. సైకిల్ నేర్చుకుంటున్న గణేష్‌ని ఓ లారీ వెనకనుండి ఢీ కొట్టడంతో అతను అక్కడికక్కడే మరణించాడు.

ఊహించని ఆ విషాద పరిణామానికి దంపతులు ఇద్దరూ బాగా చలించినా చిన్న వయసులో కొడుకు మరణించటం జయని ఇంకా బాగా కలవరపరిచింది.

ఆమె మానసికంగా బాగా కుంగిపోయింది... నిరంతరం దైవ ధ్యానంలో గడపసాగింది. ఆమె పైకి చెప్పలేదు కానీ కూతురు, భర్త అన్యాపదేశంగా చేస్తున్న దైవదూషణ వల్లనే దేవుడి ఆగ్రహంతో ఇంత విపరీతం జరిగిందన్న అనుమానం ఆమెలో బలంగా పాతుకుపోసాగింది.

రాఘవ బయట పడలేదు... బింకంగా కనబడ్డాడు కాని అతను కూడా తీవ్రమయిన మానసిక వేదనకి గురి అయ్యాడు. జీవితం అంతా యాదృచ్ఛికంగా జరిగే సంఘటనల సమాహారం అని గాఢంగా ఉన్న నమ్మకం మాత్రం సడలలేదు. జయ అతణ్ణి పూర్తిగా విస్మరించడం మొదలు పెట్టాక అతను తట్టుకోలేకపోయాడు.

ఎలా మొదలయ్యిందో కాని అతనికి ఆ సమయంలోనే గుర్రపు పందాలు అలవాటయ్యాయి. పుత్ర శోకాన్ని, భార్య తిరస్కా

రాన్ని మరవటానికి రేసులు బాగానే ఉప కరించాయి. జూదరితనం బహుశా అంత ర్లీనంగా దాగి ఉందేమో... అది మెల్లగా జూలు విదిలించుకోసాగింది. డబ్బులు పోయినకొద్దీ పట్టుదల పెరగసాగింది. లెక్కలు కట్టి గెలుపు గుర్రాల్ని పసికట్టలేక పోవటం అవమానకరంగా తోచి రేసు పుస్తకాలని క్షుణ్ణంగా అధ్యయనం చేసే వాడు... అయినా ఫలితంలో మార్పు ఉండేది కాదు. రేసుకోర్సులో కొత్త స్నేహాలు, కొత్త అలవాట్లు అయ్యాయి... అందిన చోటనుండి అప్పులు తీసి రేసు లకి ధారపోసేవాడు. రేసులో వంద గెలిస్తే వెయ్యి ఖర్చు చేసి బార్‌లో పార్టీ ఇచ్చేవాడు. వేలు పోగొట్టుకుంటే వంద ఖర్చు చేసి తప్ప తాగి ఇంటికి చేరేవాడు.

తండ్రి ప్రవర్తన గీతకి కొరుకుడు పడేది కాదు. ఒకప్పుడు సాయంకాలం అయ్యేస రికి తండ్రి ఇంటికి వచ్చేవాడు. స్కూల్‌లో గీత నేర్చుకున్న పాఠాల గురించి తెలుసు కునేవాడు. ల్యాబ్ లైబ్రరీ నుండి ఏదన్నా కొత్త పుస్తకం తీసుకు వస్తే ఆమెకి వివ రిస్తూ గడిపేవాడు... అలాంటిది ఇప్పుడు రాత్రి ఎప్పుడు వస్తున్నాడో ఆమెకి తెలి యదు. పొద్దున ఆమె స్కూల్‌కి వెళ్ళిన చాలా సేపటికి గాని అతను నిద్ర మంచం దిగేవాడు కాదు.

ఠంచన్‌గా ఐదో తారీఖుకి స్కూల్ ఫీజు కట్టటం తెలిసిన గీతకి మెల్లగా రెండు నెలలకి ఒకసారి కట్టటం అలవాట వసాగింది.

ఆమెకి తెలియదు కాని ఇక్కడ ఇల్లు నడవటానికి జయ కష్టపడసాగింది. ఎందుకంటే ఒక్కోనెల రాఘవ ఒక్క రూపాయి కూడా ఇచ్చేవాడు కాదు. కిరాణా కొట్లో, పాలవాడి దగ్గర, ఇంటి ఓనరుకి, ఇలా ఎక్కడ చూసినా అప్పులే... బాకీలే...

స్తబ్దుగా ఉన్న జయ ఆ తరువాత చురు కుగా స్పందించింది. రాఘవ తండ్రిని, తన తండ్రిని కలిసింది. వాళ్ళు ఇచ్చిన డబ్బు లతో రాఘవ చేసిన కొన్ని అప్పులు తీర్చింది. జీతం అంతా తన చేతికి అందే టట్లు ఏర్పాటు చేసుకుంది. కాలనీలో ఉన్న ఓ స్కూల్‌లో తక్కువ జీతానిక యినా సరే టీచర్‌గా చేరటానికి సిద్ధప డింది. క్షణం తీరిక లేకపోయినా శ్రమ అనుకోకుండా ఓపికగా ఏదో ఒక పని చేస్తూ ఉండేది జయ.

ఆరు నెలలు గడిచేసరికి పరిస్థితులలో అనూహ్యమయిన మార్పులు వచ్చాయి. ఇప్పుడు డబ్బుల కోసం తడుముకోవాల్సిన అవసరం లేకుండా పోయింది. అయితే రాఘవ పరిస్థితి మాత్రం ఇంకా దిగజా రింది. భార్య వల్ల అందరి ఎదుటా తనకి తీరని అవమానం జరిగిందని భావించాడు అతను. తనకి ముట్టిన కొద్దిపాటి మొత్తాన్ని తాగుడుకే ధారపోసేవాడు. కొంతవరకూ మెరుగేమిటంటే ఆఫీసులో మాత్రం కొత్తగా ఏ విధమయిన సమ స్యలూ తెచ్చుకునేవాడు కాదు.

ఆ సమయంలోనే గీతకి తండ్రిమీద ఉన్న ఆరాధనాభావం కాస్త తుడిచిపె ట్టుకు పోయింది. అప్పటికే ఆమెకి కొన్ని నమ్మకాలు చాలా బలంగా కలిగాయి. వాటన్నిటికీ తండ్రి చేసిన బోధలే కారణం... ఆ నమ్మకాలు వీగిపోలేదు, కాని వాటిని బాహాటంగా ప్రదర్శించటం మానుకుంది గీత. అంతవరకూ తల్లి పూజలంటే, 'ఏమిటమ్మా చాదస్తాలు' అని కొట్టిపారేస్తూ వచ్చిన గీత తల్లితో పాటు గుడికి వెళ్లడం మొదలు పెట్టింది. తండ్రిపైన కక్ష తీర్చుకోవటంలో అది కూడా ఒక భాగం అని నమ్మింది. ఇంట్లో

తల్లి పూజలు చేస్తుంటే సాధ్యమైనంత వరకూ సాయం చేసేది. గీతలో వస్తున్న మార్పుని రాఘవ మౌనంగా గమనించి బాగా నొచ్చుకున్నాడు. అయితే ఆ ఇంట్లో అతనితో మనస్సు విప్పి మాట్లాడే వ్యక్తులు ఎవరూ లేరు. 'మీరు ఆ దరిద్రపు అలవాటు మానిన రోజునే నేను మీతో మాట్లాడేది...' అని జయ స్పష్టంగా చెప్పింది. పైకి చెప్పకపోయినా గీత ఆ మార్గాన్నే నడుస్తోంది... అవసరం ఉంటే తప్ప తండ్రితో మాట్లాడదు ఆమె.

అయితే ఈ సమస్యలన్నీ తాగుడు వల్ల ఉత్పన్నమయ్యాయన్న సంగతిని రాఘవ విస్మరించి ఇంకా ఇంకా కుమిలిపోయే వాడు. ఆల్కహాలుని వదిలేయటం అతనికి ఇంకా ఇంకా కష్టం అవసాగింది. ఓ కుర్చీ, ఓ టేబుల్ లాగానే అతను కూడా ఆ ఇంట్లో ఉంటాడు. ఎంతో అవసరమైతే తప్ప అతనితో ఎవరూ మాట్లాడరు.

తను డిగ్రీ చదవటం గానీ ఆ తరువాత పీజీ చేస్తూ ఆర్థికంగా ఏ విధమైన ఇబ్బంది పడకుండా ఉండటంకాని అంతా తల్లి చలవ వలనే అని గీతకి తెలుసు. సంసారాన్ని సజావుగా నడపాల్సిన వ్యక్తి బాధ్యతా రాహిత్యంగా మారినా అధైర్యపడకుండా నడుంబిగించి పోరాడిన తల్లిని అందుకనే గీత బాగా గౌరవిస్తుంది.

★ ★ ★

"కాఫీ బాగుంది..." అంది జయ కప్పు టేబుల్ పైన పెట్టి.

గీత ఆలోచనల్లోంచి బయట పడింది. "నువ్వు వేసిన డికాషన్ కదా అమ్మా! అందుకనే బాగుంది..." అంది నవ్వుతూ.

"ఇక నేను చపాతీలు చేస్తాను... నువ్వు కాసేపు రెస్ట్ తీసుకో..." అంది.

చపాతీలు చేసి తల్లికి బాక్స్‌లో పెట్టి ఇచ్చింది గీత. జయ స్కూలుకి వెళ్లగానే తను కూడా కాలేజీకి వెళ్లటానికి తయారవసాగింది.

తండ్రికి కూడా బాక్స్ రెడీ చేసి టేబుల్ పైన ఉంచింది. "నాన్నా! నీ బాక్స్ టేబుల్ పైన ఉంది..." రాఘవకి ఎదురుగా నిలబడ్డా, అతని మొహంలోకి చూడకుండా అంది గీత.

రాఘవ న్యూస్‌పేపర్ చదువుతున్నాడు. అతనికి వార్తాపత్రిక చదవటం దాదాపుగా ఒక వ్యసనం. ఇంటి నిర్వహణా బాధ్యతని తన భుజాలపైన వేసుకున్నప్పుడు జయ పొదుపులో భాగంగా పేపర్ తెప్పించటం మానేసింది. రాఘవ అల్లల్లాడాడు. చివరికి తాగుడు తగ్గించి పేపర్ తెప్పించుకునేవాడు. ఇప్పటికీ పేపర్‌కి డబ్బులు అతనే ఇస్తాడు. ఆ సంగతి గుర్తుకి వచ్చినప్పుడల్లా గీతకి బాధగా ఉంటుంది. ఈ మనిషి ఎక్కడ దారి తప్పాడు?

న్యూస్ పేపర్ పక్కకి పెట్టి రాఘవ కూతురి వంక చూశాడు... ఎవరో తెలియని అపరిచితుడితో అది కూడా మాట్లాడటం ఇష్టం లేదన్నట్లు కూతురు సాగిస్తున్న సంభాషణ తరహా ఎప్పటికి మారుతుంది? ఆహ్వానం లేని అతిథిలాగా స్వంత ఇంట్లో కాలం గడపటం ఎంత విషాదం! రాఘవ నిట్టూర్చి పేపర్ వంక తల తిప్పాడు. ఆ క్రితం రోజు రామర్ పిళ్లై హైదరాబాద్‌లో మూలికా పెట్రోలు ప్రదర్శన ఇచ్చాడు. సహజంగానే ఆ వార్త మొదటి పేజీలో ప్రముఖంగా కనబడుతోంది. గత పది పదిహేను రోజులుగా రామర్ చేస్తున్న ప్రయోగాల గురించి చదువుతూ రకరకాల సందేహాలతో సతమతమవుతున్న రాఘవ కొన్ని క్షణాలు అడగాలా వద్దా అని మధనపడి చివరికి గొంతు విప్పాడు. "గీతా! ఈ రామర్ చేస్తున్న ప్రయోగాల గురించి నీ అభిప్రాయం ఏమిటి? ఏవేవో వనమూలికలని

ఉపయోగించి నీటిని నిజంగా పెట్రోల్‌గా మార్చటం సాధ్యమేనా? "

చిన్నప్పటి నుంచి అలాంటి ప్రశ్నలని ఎన్నో వేసి తనలో సైన్స్ పట్ల అభిరుచి కలిగించినది ఈయనే. కుతూహలాన్ని పెంచుకోవటమే నేర్చుకోవటానికి మొదటి మెట్టు అని బోధించిన తొలి గురువు ఈయనే. లాజికల్‌గా ఆలోచించటం నేర్పించినవాడు కూడా ఈయనే. అయినా అలాంటి తండ్రి వంక చూడకుండానే గీత సమాధానం ఇచ్చింది-

"నాన్నా! నాకు టైమ్ లేదు... ఈ రోజు మా ప్రొఫెసర్ త్వరగా రమ్మన్నాడు..." గిరుక్కున వెనక్కి తిరిగి ఇంట్లోకి వెళ్లింది.

రాఘవ దెబ్బ తిన్నాడు. అతనికి తెలియదు...కానీ ఆ రకంగా సమాధానం ఇచ్చి గీత కూడా బాధపడుతోంది. కంట్లో ఉబికి వస్తున్న నీరు తండ్రి కంట పడకూడదని ఆమె గిరుక్కున తిరిగిందని కూడా అతనికి తెలియదు. సజావుగా సాగుతున్న సంసారాన్ని రోడ్డుపాలు చేయటానికి సంకోచించని వ్యక్తి ఆయన... తన వ్యసనం తప్ప మిగిలిన విషయాలు పట్టించుకోని స్వార్థపరుడు ఆయన... పెళ్ళాం పిల్లల పైన ప్రేమ ఉన్నా దాన్ని విస్మరించి తన దోవన తాను పోవాలనుకున్న మొండివాడు ఆయన... అలాంటి వాడు ఏదో అడిగితే జవాబు చెప్పాలా అనుకుంది గీత. అయినా ఈమధ్య ప్రపంచంలో ఏం జరుగుతున్నదో పట్టించుకునే తీరిక లేకుండా పోయింది. ఆ రామర్ గురించి ఏదో చూచాయగా తెలుసు. కాని లోతుగా తెలియనే తెలియదు. అలాంటప్పుడు తండ్రి అడిగిన ప్రశ్నకి జవాబు ఇవ్వడం ఎలా సాధ్యం అనుకుని సమాధానపడినా ఆమె కంట నీరు ఆగలేదు.

2



ప్రొఫెసర్ త్వరగా రమ్మనమని అనటం నిజమే కాని గీత తండ్రితో చెప్పినంత త్వరగా కాదు.

యూనివర్సిటీలో బస్సు దిగి డిపార్ట్‌మెంట్‌వేపు నడుస్తున్న గీతకి తండ్రి ప్రశ్న, దానికి కటువుగా తను ఇచ్చిన జవాబు కాని జవాబు గుర్తుకి వచ్చాయి. తప్పు చేశానా అన్న భావన మళ్లీ తలెత్తింది. ఆ ఇబ్బందికర ఆలోచన నుంచి దూరం వెళ్ళాలి అన్నట్లు నడక వేగం పెంచింది గీత. డిపార్ట్‌మెంట్ దగ్గరికి వచ్చేసరికి ప్రొఫెసర్ కారు ఆమెని దాటుకుంటూ వెళ్లి పార్కింగ్ ప్లేస్‌లో ఆగింది. ప్రొఫెసర్ కారు దిగి లాక్‌చేస్తూ గీతని చూసి నవ్వాడు. గీత ఆయనని సమీపించి నవ్వుతూ 'గుడ్‌మార్నింగ్ సర్!' అంటూ ఆయన చేతిలోని కాయితాలు అందుకుంది.

ఆ పక్క ఉన్న రాళ్లమీద గుంపుగా కూర్చున్న విద్యార్థులలో కదలిక వచ్చింది. "రండిరా... ఆయన వచ్చాడు" అన్నాడు ఒకతను లేచి.

అందరూ లేచారు. యోగి మాత్రం సిగరెట్ తాగుతూ ఉండిపోయాడు.

"ఏరా నాన్నా! కదలవా? ఆయనని నిలదీయాలి అని అందరినీ కూడదీసి ఇప్పుడు చిద్విలాసంగా సిగరెట్ తాగుతున్నావా? !" ఓ స్నేహితుడు అడిగాడు.

యోగి నవ్వాడు. "యాదవ్‌గాడి దగ్గర

అప్పు తీసుకుని కొన్న సిగరెట్ ఇది. వాడు ఇంకోసారి అప్పు ఇవ్వడు. అందు కనే ఈ సిగరెట్ పారెయ్యి బుద్ధి కావటం లేదు" అన్నాడు. రెండు దమ్ములు గబ గబా తాగి "సరే! పదండి... మళ్లీ గురుడు లోపలికి వెళతాడేమో!? " అన్నాడు.

గీతకి ఆ సంభాషణ అంతా వినబడు తూనే ఉంది. ప్రొఫెసర్ అయితే ఏమీ వినబడనట్లే గీతని ప్రశ్నలు అడుగుతూ మెట్లు ఎక్కసాగాడు.

హడావిడిగా, ముందు యోగి నడుస్తుం డగా అందరూ ప్రొఫెసర్‌ని చుట్టుము ట్టారు. గీత పక్కకి తొలిగింది.

'గుడ్‌మార్నింగ్ సర్!' అన్నాడు యోగి ఆయన దగ్గరగా వెళ్ళి.

గీత అతన్ని పరిశీలనగా చూసింది... జుట్టు దువ్వుకోలేదో, లేకపోతే రేగినట్లుం చుకోవటమో అతనికి అలవాటో ఆమెకి తెలియలేదు... లోతుగా వున్న కళ్ళు సూటిగా చూడటమేకాదు, ఎదుటి మని షిని నిలదీస్తాయి. అయిదారు రోజులుగా రేజర్ చూడని చెంపలు గరుకుగా వున్నా అతని నవ్వుని దాచలేకపోతున్నాయి. గొంతులో టీవీ వార్తలు చదివేవారిలో విన బడే స్పష్టత వుంది.

"హలో యోగి!" అన్నాడు ప్రొఫెసర్. చుట్టూ వున్నవారిని చూసి "ఏమిటీ సంగతి? " అడిగాడు. ఆయన సంగతి బాగా తెలిసిన గీతకి ఓ సంగతి బాగా అర్థ మయింది. వాళ్ళు ఎందుకు వచ్చారో, ఏం అడగదల్చుకున్నారో ప్రొఫెసర్‌కి బాగా తెలుసు... అయినా ఏం తెలియనట్లు నటి స్తున్నాడు!

"నిన్న మీరు రామర్ చేసిన డిమాన్ స్ట్రేషన్‌కి వెళ్ళారు కదా. దానిమీద మీ అభి ప్రాయం కనుక్కుందామని వచ్చాం!" అన్నాడు యోగి మెత్తగా.

ప్రొఫెసర్ ఇబ్బందిగా నవ్వాడు. ఆ విషయం గురించి ఎక్కువగానే కాదు, అసలు మాట్లాడటం... అదీ ఇలా అందరి ముందునా... ఆయనకి ఇష్టం వున్నట్లు లేదు. "నా అభిప్రాయం ఎందుకయ్యా! నిన్న రాత్రి టీవీ రిపోర్ట్‌లో చూసివుం టారు. ఈ రోజు పొద్దున పేపర్లలో చదివి వుంటారు. మీ తీర్పు మీరే ఇవ్వండి" తెలి విగా అసలు విషయం దాటవేద్దామని ప్రయత్నించాడు.

"అలా అనకండి సర్! రామర్ ఎక్కు వగా చదువుకోలేదు. అయినా కొన్ని మూలికలని వాడి నీటిని పెట్రోల్‌గా మార్చటం అన్నది సాధారణ ప్రజలు నమ్మేటట్లు అతను డిమాన్‌స్ట్రేషన్ ఇచ్చాడు. కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు అతనికి నజరానాలు కూడా ఇచ్చాయి. అతను చేసిన ఆ విప్లవాత్మకమయిన ప్రయోగాన్ని మీరు కళ్ళారా చూశారు... అయితే నీటిని ఏవో మూలికల సాయంతో పెట్రోల్‌గా మార్చటం అసాధ్యం అన్న విషయం చెప్ప టానికి కావలసిన అర్హతలు ఉన్న మీలాం టివారు అంటీ ముట్టనట్లు అటు కర్ర విర క్కుండా ఇటు పాము చావకుండా అన్నట్లు ప్రవర్తిస్తే అందరికీ సైన్స్ కంటే నాన్‌సెన్స్ మీద నమ్మకం పెరుగుతుంది..."

ప్రొఫెసర్ రెండు క్షణాలు మౌనంగా ఉండిపోయాడు. "అయితే రామర్, ది నాన్‌సెన్స్ అన్న నిర్ణయానికి వచ్చావన్న మాట...!" యోగి మాటలలో దొరికిన చిన్న అవకాశాన్ని ఉపయోగించి బయటప డాలని అన్నాడు ప్రొఫెసర్. తర్వాత చిన్నగా నవ్వుతూ "జడ్జిమెంట్ అయిపో యాక నా సాక్ష్యం ఎందుకయ్యా? " అన్నాడు.

"క్షమించండి సర్! అతనిది నాన్‌సెన్స్ అని నేను అంటే వీడే పెద్ద నాన్‌సెన్స్... అంతకంటే పెద్ద న్యూసెన్స్ వీడు... అనే వాళ్ళు చాలామంది ఉంటారు. మీలాంటి





వాళ్ళు చెబితే విశ్వసనీయత ఉంటుంది..." అన్నాడు యోగి నవ్వుతూ. "చాలా చవుకగా పెట్రోలు తయారుచేసే విధానం కనుక్కుని దేశానికి ఎనలేని సేవ చేశాడని పత్రికలు అన్నీ పెద్ద అక్షరాలతో ప్రకటించి అతనికి కృతజ్ఞత చెప్పటానికి అత్యుత్సాహాన్ని ప్రదర్శించాయి... నిజమే! మనం అంతా రామర్‌కి కృతజ్ఞతలు చెప్పాలి... ఎందుకో తెలుసా? పేర్ల ముందు డాక్టర్ అని, ప్రొఫెసర్ అని, పేర్ల తరువాత పెద్ద పెద్ద డిగ్రీలు వున్నంత మాత్రాన సైంటిఫిక్ టెంపర్ ఉండకపోవచ్చని రామర్ నిరూపించాడు. అందుకు అతనికి మనం కృతజ్ఞతలు చెప్పుకోవాలి..."

చేయిఎత్తి యోగిని ఆగమన్నట్లు సూచించాడు ప్రొఫెసర్... ప్చ్... ఈ కుర్రవాళ్ళకి అసలు పరిస్థితులు ఎలా అర్థం అవుతాయి. కొన్ని సందర్భాలలో ఎంత గట్టిగా నమ్మినా సరే, మనసులో వున్న మాటని బయటికి చెప్పటం సమస్యలని సృష్టిస్తుందని ఎప్పటికి తెలుసుకుంటారో అనుకున్నాడు.

ఆయనకి రామర్ డిమాన్‌స్ట్రేషన్‌కి ఓ వార్తా పత్రిక నుండి ఆహ్వానం అందింది.



రామర్ ప్రయోగానికి వెళ్ళాక ఆయనకి ఆశ్చర్యం కలిగింది. సైంటిస్టులు డౌన్ డౌన్, రామర్ జిందాబాద్ అన్న నినాదాలతో హాలు దద్దరిల్లింది. చేసింది ఎవరో కాదు ఎంతో ప్రగతి శీలురం అనీ, హేతువాదులం అనీ చెప్పుకునే విద్యార్థి సంఘాలకి చెందినవారే! రామర్ క్లెయిమ్ చేసుకుంటున్న విషయాలు అసాధ్యం అని అంటున్నవారిని సైన్స్ ద్వారానే సవాలు చేయటం సమంజసం. అంతేకాని ఎన్నికలలో లాగా నినాదాలు చేసి సైన్స్‌లో బల నిరూపణ కోసం ప్రయత్నిస్తే ఎలా?



సరే, డిమాన్‌స్ట్రేషన్ మొదలయ్యింది. తన ప్రయోగాలని స్టేజ్ మీద అందరి ఎదుటా చేస్తానని ముందుగా రామర్ ప్రకటించినా ప్రయోగం మొదలయిన చాలా సేపటి వరకు ఎవరినీ దగ్గరికి రానీయలేదు. ఎందుకంటే అతను ఇంకా పేటెంట్ తీసుకోలేదుట. అందుకని కాస్త గోప్యత అవసరమట. అతను ఏంచేశాడో, ఎలా చేశాడో ఖండితంగా చెప్పటం కష్టం... నీటికి కొన్ని ఆకులు కలపటం, మరిగించటం ఆ తరువాత వచ్చిన ఆవిరిని చల్లారిస్తే పెట్రోలు వంటి ద్రవం వచ్చింది. ఆ ద్రవాన్ని ఉపయోగించి ఓ మోపెడ్ కూడా నడిపారు. ఇక హాల్ అంతా దద్దరిల్లిపోయే చప్పట్లు... ఆ తరువాత ఉన్నత పదవులలో ఉన్న వారినుండి అతనికి మంచి కితాబులే అందాయి. యోగి చెప్పినట్లు రాష్ట్ర ప్రభుత్వం తరపున విరాళం కూడా ప్రకటించారు. ఒక ప్రయోగాన్ని ప్రదర్శించే శాస్త్రీయత అన్నది మచ్చుకు కూడా లేదు. టోపిలోంచి కుందేలుని తీసే మ్యాజిక్‌ని చూసి ఆ మెజీషియన్‌కి అతీత శక్తులు ఉన్నాయని అనుకోవటం సబబా? కాని విద్యార్థులు చేసిన గలాభా చూశాక ఈ వ్యవహారంలో అంటీముట్టనట్లు ఉండటం మంచిది అనిపించింది ప్రొఫెసర్‌కి. అందుకనే తన అభిప్రాయం అడిగిన మీడియా ప్రతినిధులతో 'రామర్ పేటెంట్‌కి అప్లై చేస్తున్నాడని విన్నాను. అంతవరకు అతనికి గోప్యత అవసరం అని అంటున్నాడు. అందుకనే కాబోలు మాకు ప్రయోగంలో అన్ని భాగాలు చూపించలేదు. అతను త్వరలో పేటెంట్‌కి అప్లై చేయాలని ఆ తర్వాత అతని ఆధ్వర్యంలో వివిధ ప్రయోగశాలల్లో ప్రయోగాలు జరగాలని ఆశిస్తు

న్నాను. నిజానికి అప్పటికిగాని నేను దీ నిపై సరిగ్గా వ్యాఖ్యానించలేను...'

అయితే ఆయన చెప్పిన మాటలు కాసింత ఎడిటింగ్‌కి గురయ్యి టీవీలో వచ్చాయి... ముఖ్యంగా అప్పటికిగాని నేను వ్యాఖ్యానించలేను అన్న మాటలు టీ వీలో రాలేదు. ఈ ఉదయం వచ్చిన పత్రి కల్లో కూడా లేదు. దాంతో ఆయన పరో క్షంగా రామర్‌కి సర్టిఫికెట్ ఇస్తున్నట్లు అనిపించింది. యోగి బృందం ఆయన్ని నిలదీయటానికి అదే కారణం.

"రామర్ ప్రయోగాలు తప్పయితే కాలమే ఆ సంగతి నిర్ధారిస్తుంది. ఇక సమస్యేముంది? " ప్రొఫెసర్ అన్నాడు.

"అదేమిటి సర్, అలా అంటారు...? ఎక్కడా కనీవినీ ఎరగని రసాయనిక చర్యలని సాధించినట్లు ఒక వ్యక్తి ప్రగ ల్భాలు చెప్పుకుంటుంటే బాధ్యతా యుతమైన పదవులలో ఉన్న వాళ్లు కిమ్మనకుండా ఉంటే ఎలా...? మీకు నమ్మకం ఉంటే దానిని మంచి ప్రయోగమని చెప్పండి. మీరు ఆ విధమయిన కన్‌క్లూజన్‌కి ఎలా వచ్చారో వివ రించండి. లేకపోతే ఈ ప్రయోగంలో విశ్వసనీయత లేదు. ఇది శాస్త్రీయ ప్రయో గం కాదు అని తేల్చి చెప్పండి. అంతేకాని మౌనంగా ఉండటం సైంటిఫిక్ టెంపర్‌కి విరుద్ధం కాదా? " యోగి స్వరంలో ఎందుకో ఆవేశం పాలు ఎక్కువయింది.

"నీ బాధ ఏమిటో నాకు అర్థం అవటం లేదు యోగి..." ప్రొఫెసర్ నవ్వాడు. "రామర్ ప్రయోగాలు పత్రికలలో పతాక శీర్షి కలలో కనబడినంత మాత్రాన నువ్వు నమ్మే సైన్స్‌కి పెద్ద అపకారం జరుగుతుం దని చింతించటం అనవసరం... సైన్స్‌ని నాన్‌సెన్స్ ఎప్పటికీ దెబ్బతీయలేదు. ఇక పోతే జనాలు నమ్ముతున్నారని అంటావా...వాళ్ళ అభిప్రాయాలు స్థిరంగా వుండవు. మారుతూ వుంటాయి. సమయం వచ్చినప్పుడు నిజం తేలిపో తుంది... నువ్వు అన్నావు చూడూ సైంటి ఫిక్ టెంపర్ అని... అది ప్రతి మనిషికి వుండాల్సిందే, కాదనను... అయితే అంతే ముఖ్యమైనది ఇంకోటి ఉంది... అదే సోషల్ టెంపర్. ఏయే పరిస్థితుల్లో ఎలా ప్రతిస్పందించాలో, ఎలా ప్రవర్తించకూడదో తెలుసుకోవటం అన్నమాట.... ఆ సంగతి అర్థం చేసుకుంటే నేను ఎక్కువగా ఎందుకు మాట్లాడటం లేదో నీకు అర్థం అవుతుంది... అంతేకాదు నీలో తప్పు లేకపోయినా నీకు సమస్యలు పదేపదే ఎందుకు ఎదురవుతున్నాయో కూడా తెలు స్తుంది. ఇప్పటికే చాలా సేపు మాట్లాడాను... ఇక వుంటాను" అంటూ యోగి భుజంతట్టి వెళ్ళి పోయాడు ప్రొఫెసర్.



**"రామర్ ప్రయోగాలు తప్పయితే కాలమే ఆ సంగతి నిర్ధారిస్తుంది. ఇక సమస్యే ముంది?" ప్రొఫెసర్ అన్నాడు.**



సైంటిఫిక్ టెంపర్ అన్న పద ప్రయోగం చేసిన ఖ్యాతి జవ హర్‌లాల్ నెహ్రూకి దక్కు తుంది. దానికి సరిపోయే విధంగా సోషల్ టెంపర్ అన్న మాటని ఉపయోగించటం, గడుసుపిండంలా ఉన్న ఈ యోగి నోరు మూయించిన ప్రొఫెసర్ వంక ప్రశంసాపూర్వకంగా చూసింది గీత. ఈ యోగి ఎవరో గాని చిత్రమయిన వ్యక్తి అనుకుంది ఆమె. ప్రొఫెసర్‌తో పాటు నాలుగు అడుగులు వేసి వెనక్కి తిరిగి చూసింది. అతనిలో ఇదీ అని చెప్పలేని ప్రత్యేకత ఏదో ఉందని ఆమెకి అనిపిం చింది. నిజానికి ప్రొఫెసర్‌తో పాటు ముందుకు వెళ్లకుండా ఆగి ఇప్పుడు మిత్ర బృందం ఎదురుగా యోగి ప్రతిస్పందన

ఎలా ఉంటుందా అన్నది చూడాలన్న కుతూహలం ఆమెని ఆవరించింది. కాని ప్రొఫెసర్‌తో పాటు నడవక తప్పదాయే!

"యోగి! ఆయనని అలా తేలికగా ఎలా వదిలేశావు? " ఓ స్నేహితుడు అడిగాడు.

"ఆయన బోధ చేసినట్లు మనవాడికి సోషల్ టెంపర్ అనే జ్ఞానోదయం కలిగిం దేమోరా!"

అందరూ నవ్వారు. యోగి కూడా వాళ్లతో కలిసి స్వచ్ఛంగా నవ్వాడు. "ఎవ రినయినా నిలదీసేందుకు ఒక లిమిట్ ఉంటుంది. ఆయన దాదాపుగా తన తప్పు ఒప్పుకున్నాడు కదా..." అన్నాడు.

"మేమన్నదీ అదే బాస్! అలా లిమిట్స్ గురించి ఆలోచించటమే సోషల్ టెంపర్..."

మళ్లీ అంతా నవ్వారు యోగి జతకలప లేదు. ఏదో ఆలోచిస్తూ ఉండిపోయాడు.

★ ★ ★

రామర్ ప్రయోగాల గురించి దేశం లోనూ తన క్యాంపస్‌లోనూ ఇంత చర్చ జరుగుతుంటే తనేం తెలియని దానిలాగా అస్సలు పట్టించుకోకపోవటం ఏం బాగా లేదు అనుకుంది గీత, ప్రొఫెసర్‌తో పాటు నడుస్తూ. అదే సమయానికి ఆమెకి ఇంకో విషయం స్ఫురణకి వచ్చింది... ఇది ఇంత హాట్ టాపిక్ కాబట్టే తండ్రి తనని పొద్దున ఆ ప్రశ్న అడిగాడు కాబోలు... 'అయ్యో...! పొద్దున నాన్నతో రామర్ గురించి క్లుప్తంగానైనా మాట్లాడాల్సింది...' అన్న పశ్చాత్తాపం కలిగిందామెకి.

ప్రొఫెసర్ భుజంపై నుండి వెనక్కి చూశాడు. 'ఏ లైక్ హిమ్... హీ ఈజ్ ఏ వెల్ రెడ్ మ్యాన్...' అన్నాడు.

ఆయన సాధారణంగా ఎవరికీ కాంప్లిమెంట్ ఇవ్వడు. అందుకనే గీతకి యోగి అంటే ఆసక్తి పెరిగింది. చిత్రమేమిటంటే యోగి ఏం చదువుతున్నాడో ఆమెకి తెలియదు.

ఆ తరువాత యోగిని, రామర్‌ని మరిచిపోయి ఓ గంటసేపు నడుస్తున్న పని గురించి వాళ్లిద్దరూ చర్చించారు. వచ్చే వారం రోజులలో ఏయే అంశాలని గీత అధ్యయనం చేయాలో ఆయన చెప్పాడు. గీత 'ఓకే సర్!' అంటూ లేవబోయింది.

"రామర్ చేస్తున్నదంతా ప్యూర్ మ్యాజిక్. కాని దురదృష్టవశాత్తు పెద్ద పెద్దవాళ్ళు అంతా ఓపెన్‌మైండ్‌తో ఉండాలన్న సదుద్దేశంతోనో, రాజకీయవేత్తల ప్రెషర్ వల్లనో చేతులు కట్టుకుని ఉండిపోవలసి వస్తున్నది... ఇకపోతే మీడియా కూడా కొంత ఓవర్ యాక్షన్ చేస్తున్నది... అందుకనే అతనికింత పబ్లిసిటీ వస్తున్నది... అయితే మీడియాని పూర్తిగా తప్పు పట్టలేం... ఆ మూలికా పెట్రోలులో సాధ్యాసాధ్యాల గురించి సాధికారికంగా, శాస్త్రీయంగా కామెంట్ చేయాల్సిన వాళ్ళు మౌనంగా ఉండటంతో మీడియా మాత్రం ఏం చేస్తుంది? నిజంగా అందరం సిగ్గుపడాల్సిన సంగతి ఇది. యోగి నూటికి నూరు పాళ్ళూ కరక్టే!' తన తలపైన అంత వరకూ అదృశ్యంగా ఉన్న భారం ఏదో మాయమైనట్లు ప్రొఫెసర్ తేలికగా నవ్వాడు. 'యోగి గురించి నాకు ఒకే ఒక కంప్లయింట్. తరువాత జరిగే పరిణామాల గురించి పట్టించుకోకుండా నమ్మిన దానికోసం ఏదన్నా చేయటానికి తయారవుతాడు. అది పట్టుదల కాదు... మొండితనమూ కాదు... అనవసరమయిన తెగువని ప్రదర్శిస్తాడు... అలా చేసి ఏమేమి పోగొట్టుకుంటున్నాడో అతను ఎప్పుడూ ఖాతరు చేసినట్లు కనబడడు...' గీత ఆసక్తి ఇంకా పెరిగింది.

తన టేబుల్ ముందు కూర్చుని ప్రొఫెసర్ చెప్పిన పాయింట్స్ అన్నీ ఇంకోసారి మననం చేసుకుంది గీత. చేయాల్సింది చాలా ఉంది అని తేటతెల్లమవుతున్నా ఈ పూటకి ఏమీ పని చేయకూడదని నిశ్చయించుకుంది. సెమినార్ లైబ్రరీకి వెళ్లి గత పదిహేను రోజుల న్యూస్‌పేపర్లు చదవాలి.... ఈ రామర్ గురించి తెలుసుకోవాలి అనుకుంది... పిహెచ్‌డి పని ఆ తరువాతే!

అలా పేపర్లు చదవటం వల్ల నష్టపోయిన గంటన్నర సమయాన్ని భర్తీ చేసుకోవటానికి గీత బాగానే శ్రమ పడింది. పదినిముషాల్లో లంచ్ చేసింది. తోటి రీసెర్చ్‌ఫెలో వినాయక్‌తో బాతాఖానీ వేయకుండా ఏకధాటిగా పని చేసింది.

అయిదు గంటలకి ఇక చాలు అనుకుని ఇంటికి వెళ్లటానికి తయారు కాసాగింది గీత... అప్పుడు గుర్తుకి వచ్చింది. ఆ రోజు శుక్రవారం, అంటే తార ఇంటికి వెళ్లాలి! ఇంటర్ చదువుతున్న తారకి గీత ట్యూషన్ చెబుతోంది.

తార ఇంటి ముందున్న గేట్ తీయగానే వవ్... వవ్... అంటూ తెల్లటి కుక్కపిల్ల ఎదురు వచ్చింది.

'హాయ్ జీరో...!' అంటూ దాన్ని పలకరించింది గీత. తార ఏరికోరి అపురూపంగా పెంచుతున్నది ఆ కుక్కపిల్లని. మొదట్లో దానికి ఏ పేరు పెట్టాలో ఆ అమ్మాయికి తోచలేదు... ఏ పేరు చెప్పినా బాగాలేదు అనో, వద్దు.. ఆ పేరుతో నాకు కిండర్‌గార్డెన్‌లో ఓ ఫేవరైట్ టీచర్ ఉండేది అనో అభ్యంతరం చెప్పేది. అప్పుడు గీత సరదాగా అంది, 'చూస్తుంటే దీనికి ఏ పేరూ కుదిరేట్లు లేదు... పేరు లేదు కాబట్టి శూన్యా అని పిలువు...'

'వావ్... గ్రేట్ ఐడియా...!' అంది

# "పల్లవి" లో స్థలం... మీ కలల గృహనిర్మాణానికి శ్రీకారం...

మా ప్రథమ వెంచర్

**PALLAVI**
*Lake View Residency*

గుంటూరు - చిలకలూరిపేట నేషనల్ హైవే నెం. 5, కాటూరి మెడికల్ కాలేజి దగ్గర



మా ద్వితీయ వెంచర్

## పల్లవి గార్డెన్స్

గుంటూరు - చిలకలూరిపేట నేషనల్ హైవే నెం. 5, పొత్తూరు జంక్షన్



మా రెండు వెంచర్లను దిగ్విజయ బాటలో నిలిపిన కస్టమర్ దేవుళ్ళకు కృతజ్ఞతలు....
ఈ విజయానికి తోడ్పాటును అందించిన క్షేత్ర సిబ్బందికి, ధన్యవాదాలు తెలుపుతూ...
K.S.శ్రీనివాసరావు (K.K) గారి ఆధ్వర్యంలో తక్షణ గృహనిర్మాణానికి కావలసిన
సదుపాయాలతో అత్యంత ప్రతిష్టాత్మకంగా రూపుదిద్దుకుంటున్న ప్రెస్టీజియస్ తృతీయ వెంచర్

**పల్లవి** వారి

తృతీయ కానుక...

## వైట్ సిటీ



వెంచర్ హైలెట్స్: DTCP ఉత్తర్వుల ప్రకారం
పిల్లల ఆట స్థలాలు ఆహ్లాదకరమైన వాతావరణం
కోసం చక్కటి ప్లాంటేషన్స్‌తో పార్కులు, దేవాలయాలు,
ఆడిటోరియంలు మొదలగు వాటికి స్థలం కేటాయింపు...

★ పూర్తి విశ్వసనీయత ★ అత్యున్నత ప్రమాణాలు.
★ సరైన ప్రణాళిక ★ సత్వర అభివృద్ధి



K.S.శ్రీనివాసరావు K.K. M.Com
ప్రమోటర్.



**శ్రీ పల్లవి ఎస్టేట్స్**
**బిల్డర్స్ & డెవలపర్స్**


D.No: 6-4-28, 1వ అంతస్థు
4/2 అరండల్ పేట, గుంటూరు-2.
ఫోన్స్ 0863-2333333, 6680313
Fax: 0863-2339038, Cell: 93941 01017.
E-Mail: kk_vasu@yahoo.co.in.

తార కళ్లు మెరుస్తుండగా. 'శూన్యా అని పిలవాలంటే కష్టం కాబట్టి జీరో అంటాను... థాంక్యూ అక్కా, థాంక్యూ... చాలా వెరయిటీ పేరు సజెస్ట్ చేశావు..'

అది తలచుకుంటే గీతకి ఇప్పుడు నవ్వు వచ్చింది. ఏ పేరూ లేదు అని సూచించ టానికి జీరో అని పెడితే పేరు ఉన్నట్లా లేనట్లా? బహుశా జీవితకాలంలో చిక్కు వీడని పేరడాక్స్‌లలో ఇదొకటి కాబోలు...

గీత తార గదిలోకి వెళ్లింది. మంచం మీద ఓ మూల వాక్‌మన్, మధ్యల్లో చిందరవందరగా కేసెట్లు పడివున్నాయి.

'నిన్న ఇచ్చిన లెక్కలు చేశావా?' గీత తారని అడిగింది.

'టూ మచ్ అక్కా...! ఇలా అడుగు పెడుతూనే, అలా క్లాసు తీసుకుంటే ఎలా...? ఒక్క నిముషం ఆగలేవా? కొత్త డ్రెస్సు వేసుకున్నాను... తారా, నీ డ్రెస్ బాగుంది అని కాంప్లిమెంట్ ఇవ్వచ్చు కదా...! అబ్బబ్బ... ఈ బస్సులు సరియైన టైముకి రావు. పైగా హేవీరష్‌అని నీ బాధలు నాతో పంచుకోవచ్చుకదా...! షారుఖ్ కొత్త మూవీ యస్‌బాస్‌కి మ్యూజిక్ జతిన్‌లలిత్ ఇస్తున్నారుట కదా అని సరదాగా నాలుగు కబుర్లు చెప్పి రిలాక్స్ అయ్యి అప్పుడు మొదలు పెట్టచ్చు కదా!'

'సారీ! టాపిక్ మార్చాలని ప్రయత్నించకు... ప్రాబ్లెమ్ పూర్తిచేశావా లేదా? అది చెప్పు ముందు' గీత కచ్చితంగా అంది.

'అక్కా నేను చెప్పే టాపిక్ వింటే నువ్వే ప్రాబ్లెం గురించి మరిచిపోతావు... పదే పదే దాని గురించే ప్రశ్నలు వేస్తావు... అంత ఎగ్జయిటింగ్ టాపిక్ అది...' తార సీరియస్‌గా అంది.

'మళ్లీ అదే ప్రయత్నం...! నో అదేం కుదరదు. లెక్కలు చేశావా లేదా?'

తార ఆ ప్రశ్న విననిదానిలాగా చెప్పుకుపోయింది. 'రామర్‌లాగా నేను కూడా కొన్ని ఆకులు నీళ్ళల్లో వేసి మరిగించాను. రామర్ సిట్రిక్‌యాసిడ్ ఇంకా పేర్లు చెప్పని కెమికల్స్ కలిపాడుట... నేనయితే సిట్రిక్ యాసిడ్ బదులు నిమ్మ రసం వేశాను... దానికి తోడుగా ఇంకో తెల్లని కెమికల్ కలిపాను. అప్పుడేమయిందో తెలుసా? అద్భుతం జరిగింది అక్కా... అద్భుతం!' అంది తార.

'నిజంగానా?' గీత స్వరం కీచుగా మారింది. 'ఏం చేశావు నువ్వు? ఏ అద్భుతం జరిగింది?'

'ఒక్క క్షణం... నేను తీసుకువచ్చి స్వయంగా నీకు చూపిస్తాను...' తార గిరుక్కున వెనక్కి తిరిగింది. ఎంత వేగంగా తిరిగిందంటే ఆమె మొహంలో ప్రత్యక్షమయిన కొంటె నవ్వుని గీత గమనించలేకపోయింది.

పొద్దున ప్రొఫెసర్ దాదాపుగా రూఢీగా చెప్పాడు. న్యూస్‌పేపర్లు చదివాక గీతకి కూడా రామర్ ప్రయోగాలపైన సందేహంగానే ఉంది. కాని తార ఏమిటి అద్భుతం అంటున్నది? గీత ఆలోచనలో పడింది.

ఒక్కక్షణం అని తార అందికానీ, ఆమె రావటానికి నాలుగు నిముషాలు పట్టింది. ఆమె చేతిలో ట్రే ఉంది. అందులోని కప్పులలో పొగలు కక్కుతున్న టీ ఉంది.

'అద్భుతం అని టీ తెచ్చావేమిటి?' కప్పు అందుకుంటూ గీత అడిగింది. డార్జిలింగ్ టీ ఫ్లేవర్‌కి ఆమె బడలిక నిష్క్రమించటం మొదలు పెట్టింది.

నాలుగయిదు గుక్కలు తాగేంత వరకూ ఏం మాట్లాడలేదు తార. తరువాత గీత వంక అల్లరిగా చూస్తూ అంది, 'లెమన్ టీ అద్భుతంగా ఉంది కదూ?!'

అప్పటికి గీతకి అర్థం అయ్యింది. 'చదువు మానేసి టీ చేస్తూ గడుపుతూ పైగా రామర్‌లాగా ప్రయోగాలు చేస్తు

# Dare to Dream

to join with

**A.S.R. EDUCATIONAL GROUP**



SRI AKULA SREE RAMULU
CHAIRMAN

WE FACILITATE

# 100%

Placements Opportunity

# B.TECH

CSE, ECE, EEE, MECH, IT

## MBA | MCA

## B.PHARMACY

We have given **240 PLACEMENTS** to our students within **last 6 Months**



ASR Students with Ms.Anitha.S.Guha, India Diversity Leader,IBM

ASR Students had an great Opportunity to meet **Mr.Ratan Tata, Chairman, Tata Sons** and IT Techies from companies like IBM, Satyam, TCS, Intel in National Summit on Corporate Social Responsibility held in Chennai Convention Centre recently.

For **MANAGEMENT SEATS** and other details
Contact: **99481-13209, 98495-88266**

**AKULA SREE RAMULU COLLEGE OF ENGINEERING & TECHNOLOGY**
TANUKU, WEST GODAVARI DISTRICT, CELL : 99481 13209

**AKULA GOPAYYA COLLEGE OF ENGINEERING & TECHNOLOGY**
Tadepalligudem, W.G. District, Cell : 98495 88266

**ASR GROUP OF MCA, MBA & PG COURSES**
Tanuku, W.G. District, Cell : 98661 27908

న్నాను అని గప్పాలు చెబుతావా?'

'నేనేం చదువు మానలేదు అక్కా...! నేను కలిపాను అని ఇందాక చెప్పానే ఆ తెల్లని కెమికల్ ఓ కార్బోహైడ్రేట్. దాని ఫార్ములా... సి ట్వెల్వ్... హెచ్ ట్వెంటి టూ... ఓ ఎలెవెన్... కరెక్టే కదా?' అంది పంచదార కెమికల్ ఫార్ములా చెబుతూ. 'చూశావా? నేను కెమిస్ట్రీ బాగానే చదువు తున్నాను అని తెలిపోయింది కదా! ఇక నువ్వు చేయమన్న లెక్కలు గురించి టీ తాగాక చెప్పుకుందాం'

'టీ తాగుతూ కూడా చెప్పచ్చు అను కుంటా...' ఇంకో గుక్క తాగి గీత అంది. టీ నిజంగానే అద్భుతంగా పనిచేస్తూ ఉత్తే జాన్నిస్తున్నది అనుకుంది.

'యు ఆర్ రైట్ టీచర్! అలా కూడా చెయ్యొచ్చు' అంది తార. 'లెక్కలు అన్నీ చేశాను. ఒకటి మాత్రం ఎంత ప్రయత్నిం చినా రాలేదు. లాభంలేదని వేడెక్కిన బుర్రకి వాక్‌మన్ వైద్యం మొదలు పెట్టాను. జరాస ఝూమ్‌లు మై అంటూ షారుఖ్‌తో డ్యూయెట్ పాడుతుంటే మధ్యలో నువ్వు వచ్చావు...'

'మళ్లీ షారుఖ్ జపం మొదలు పెట్టావా?' గీత విసుగు నటిస్తూ అంది. 'అతని పైన చూపించే శ్రద్ధలో నాలుగో వంతు చదువుపైన పెడితే ఎంసెట్ చులాగ్గా రాసేయొచ్చు తెలుసా?'

తారకి ఎంసెట్ అంటే గిట్టదు. 'అందరూ ఎంసెట్ జపం చేస్తే నేనూ అందులోకి జంప్ చేయలా?. నో... ఏయ్! జీరో! నువ్వు చెప్పు... నేను ఎంసెట్ రాయాలా?'

పిలవగానే జీరో చెంగున తార ఒడిలోకి గెంతింది. యజమానురాలికి ఏదో జవాబు ఇవ్వాలన్నట్లు తల అడ్డంగా ఊపింది. జీరోని దగ్గరగా హత్తుకుని నవ్వింది తార. 'చివరికి దీనికి ఉన్న తెలి వితేటలు కూడా ఎవరికీ లేవు. ఊరికే ఎంసెట్ ఎంసెట్ అని షంటేస్తున్నారు...' అంది తార. అంతలో గీత మొహం స్వల్పంగా వివర్ణమవటం గమనించి వెంటనే సద్దుకుంది. 'అయామ్ సారీ అక్కా! నేను నీ గురించి అనలేదు. మా పేరెంట్స్ గురించి చెబుతున్నాను. నేను ఎంత వద్దన్నా.. పొద్దునా సాయంకాలం ఎంసెట్ చెయ్యి.. చెయ్యి.. అని పోరు తూనే ఉంటారు... అయామ్ సారీ' అంది తార. తను సీరియస్‌గా ఉన్నానని నిరూ పించాలన్నట్లు 'జీరో! బి ఏ గుడ్ గర్ల్ అండ్ జంప్ ఆఫ్! గో...' అంది పుస్తకాలు అందుకుంటూ.

'సరే, నీకు రాని ప్రాబ్లెమ్ ఏమిటి?' అంది గీత.

'చెబుతాను గాని, ఓ డౌట్ అక్కా...!'

'ఏమిటది?'

'నీకు షారుఖ్ అంటే క్రష్ లేదా?'

చిరుకోపంతో పాటు నవ్వు కూడా వచ్చింది గీతకి. 'ఏయ్ తారా! నన్నేమను కుంటున్నావు? నేనేమన్నా టీనేజ్ గర్ల్‌ని అనుకుంటున్నావా? అయినా టీచర్‌తో అలాంటి కబుర్లేమిటి...?' తెచ్చి పెట్టు కున్న కోపంతో అంది గీత.

'వన్స్ ఎగైన్ సారీ... టీచర్! ఇదిగో ఈ నాకు రాని ప్రాబ్లెమ్...' అంది తార పుస్తకం తీసి.

గంటన్నర తరువాత గీత అంది. 'ఈ సారి ఎసైన్‌మెంట్ ఎక్కువ ఇస్తున్నాను. షారుఖ్‌ని మరిచిపోయి పూర్తిగా చెయ్యాలి. అర్థమయిందా?'

'అర్థమయింది టీచర్...' అంది తార చేతులు కట్టుకుని.

గీత చెప్పులు వేసుకుంటుంటే తార తల్లి వచ్చింది 'రామర్ రెండు రూపాయలకే పెట్రోలు అమ్ముతానని అంటున్నాడు. ఎంచక్కా నువ్వు ఓ బండి కొనుక్కో...'



# ఆహారంలో విటమిన్లు

**'ఆరోగ్యమే మహాభాగ్యం' కనుక మంచి ఆరోగ్యం కోసం అవసరమైన విటమిన్లు ఉన్న పదార్థాలు తీసుకోవడం తప్పని సరి. ఏ ఏ విటమిన్లు ఎందులో లభిస్తాయో చూద్దాం.**

**బి1 (థయమిన్ 1.5 మి.గ్రా.)**
విత్తనాలు, కాయకూరలు
**బి2 (రిబోఫ్లెవిన్ 1.7 మి.గ్రా.)**
మాంసం, బీన్స్, ఆకుకూరలు.
**బి3 (నయాసిన్ 20 మి.గ్రా.)**
ధాన్యపు గింజలు
**బి6 (పైరిడాక్సిన్.2 మి.గ్రా.)**
మాంసం, గింజలు, గోధుమ
**బి12 (కోబాలమైన్6 మైక్రో గ్రాములు)**
కాలేయం, మాంసం, గుడ్లు.
**ఫోలిక్ఆమ్లం(400మైక్రో గ్రాములు)**
బ్రెడ్, ఇడ్లీ, ఆప్పం, పండ్లు, ఆకు కూరలు, ఈస్ట్,
**పాంటోథనిక్ ఆమ్లం(10 మి.గ్రా.)**
కాలేయం, ఈస్ట్, పాలు, గుడ్డుసొన,
**బయోటిన్ (300 మి.గ్రా.)**
గుడ్లు, వెన్న, కోడిమాంసం.
**విటమిన్ "సి"(60 మి.గ్రా.)**
నిమ్మ, దానిమ్మ, ఉసిరి, ఆలు, ఆకుకూరలు,
**విటమిన్ "డి" (400 I.U.)** సూర్యరశ్మి,
**విటమిన్ "ఇ" (30 I.U.)** వెజిటబుల్ నూనెలు, గింజలు, ఆకుకూరలు

అంది ఆవిడ.

'చదువులో పడి ఆ సంగతే డిస్కస్ చేయలేదు అక్కా! ఫెంటాస్టిక్ కదూ?!' అంది తార.

తన అభిప్రాయం ఏమిటో చెబితే ఇంకో పావుగంట గడపాలి. అప్పటికీ వాళ్లని కన్విన్స్ చేయలేకపోవచ్చు. ఎందుకు వచ్చిన వృథా శ్రమా!? ఆ యోగికి ఉన్న ఓపిక నాకు లేదు అనుకుని నవ్వి ఊరుకుంది గీత.

'ఏమంటున్నది మీ స్టూడెంట్...? ఎంసెట్ రాస్తానని అంటున్నదా?' తార తల్లి అడిగింది.

'అమ్మా జీరోకి ఎన్ని తెలివితేటలున్నాయో తెలుసా?' తార అమాయకంగా అంది.

అతికష్టం పైన నవ్వుని ఆపుకుని సెలవు తీసుకుంది గీత.

★ ★ ★

గీత ఇంటికి వెళ్లేసరికి రాఘవ ముందు గదిలో కూర్చుని క్రాస్ వర్డ్ పజిల్ పూరిస్తున్నాడు. జయ పూజ చేసుకుంటోంది. ఆవిడకి ఇంకో వ్యాపకం లేదు. భర్త సరిగ్గా ఉన్న రోజులలో తనకున్న భక్తిని ఇంత బాహాటంగా ప్రదర్శించేది కాదు. ఎప్పుడయితే సంసార నిర్వహణా బాధ్యత తని తన భుజస్కంధాలపైన వేసుకుందో అప్పటినుంచి జయకి ఆవిధమైన సంకోచాలు పోయాయి.

గీత స్నానం చేసి వచ్చినా జయ పూజ అవలేదు. తెచ్చుకున్న కాయితాలు తీసి చదవసాగిందామె. రెండు పేరాలు చదివినా ఒక్క వాక్యం కూడా బుర్రలోకి సక్రమంగా ఎక్కలేదని ఆమె అయిదు నిముషాల తరువాత గ్రహించి విసుగ్గా కాయితాలు పక్కన పెట్టింది.







టీవీ చూద్దామని ముందుగదిలోకి వచ్చింది. గీత తండ్రి ఇంకా అక్కడే ఉన్నాడు. రిమోట్ కింద ఆ నాటి పేపర్ ఉంది. అప్రయత్నంగా పేపర్ అందుకుంది గీత. యాంత్రికంగా పేజీలు తిప్పింది. రామర్ గురించి వచ్చిన వార్తా కథనం పక్కన రాఘవ పెన్సిల్‌తో ప్రశ్నార్థకం పెట్టాడు. ఉదయం తండ్రి కుతూహలంగా అడిగితే తను కటువుగా తెంచినట్లు మాట్లాడటం గుర్తుకి వచ్చి గీత మనసు చివుక్కుమంది. ఒక పావుగంట తండ్రితో మాట్లాడితే?

గీత వెళ్ళి తండ్రి పక్కన కూర్చుంది. ఎన్నో రోజుల తరువాత గీత తనంతటతానే తండ్రితో మాట్లాడటం అది. అందుకనే సంభాషణ ఎలా ప్రారంభించాలా అని లోలోపల చర్చించుకుని గొంతు విప్పింది. 'మా ప్రొఫెసర్ నిన్న రామర్ చేసిన ప్రయోగాలకి వెళ్లారు నాన్నా...' అని మొదలుపెట్టింది.

రాఘవ ఉలిక్కిపడ్డాడు. అతని చేతిలోని పెన్సిల్ జారి కిందపడింది. అయినా అతను అది పట్టించుకోలేదు... కూతురు తనతో మాట్లాడుతున్నది!

రామర్ చేసిన బహిరంగ ప్రయోగాలలో ఎంత గోప్యత ఉందో, అతను ఎక్కువగా చదువుకోక పోవటాన్ని ఎంత తెలివితేటలతో తనకి అనుకూలంగా మలచుకుంటున్నాడో వివరించింది గీత.

రాఘవ కొన్ని ప్రశ్నలు అడిగాడు. గీత ఆశ్చర్యపోయింది. కొన్ని మూలికలు నీళ్ళకి కలిపి వేడి చేస్తే పెట్రోల్ వస్తుందని రామర్ చెప్పగానే, అందులో సాధ్యాసాధ్యాల గురించి సైన్స్ చదివిన చాలామందే ఆలోచించలేదు. ఐఐటిలో పని చేసే ఓ ప్రొఫెసర్ అయితే, 'ఆ ప్రయోగాన్ని నేను స్వయంగా చూశాను. నీరు పెట్రోలుగా మారటాన్ని గమనించాను. పెట్రోలులో ఉన్న హైడ్రోజన్ నీటి నుంచి, కార్బన్ అయితే గాలిలో ఉన్న కార్బన్ డయాక్సయిడ్ నుంచి వచ్చి ఉండచ్చు...' అని వివరించటానికి కూడా ప్రయత్నించింది. కాని సైన్స్‌లో డిగ్రీ కూడా లేని తండ్రి మాత్రం 'గాలిలో వెయ్యవ వంతు కన్నా తక్కువ ఉన్న కార్బన్ డయాక్సయిడ్ నుంచి పెట్రోల్‌లో ఉన్న కార్బన్ రావాలంటే ఎంత ఘనపరిమాణం ఉన్న గాలి అవసరం అవుతుంది?' అని ప్రశ్నిస్తున్నాడు. ఆయన అడిగే ప్రశ్నల వెనక కచ్చితమైన లాజిక్ ఉంది... సందేహాల నుంచి, ప్రశ్నల నుంచే సైన్స్ ప్రగతి సాధ్యమయింది అని తండ్రి చిన్నప్పుడు చెప్పిన సంగతి గుర్తుకి వచ్చింది ఆమెకి. పావుగంట అని అనుకుంది కానీ దాదాపు నలభై నిముషాలు తండ్రితో మాట్లాడింది గీత.



చాలారోజుల తరువాత తండ్రితో సంభాషించటం ఆమెకే కాదు రాఘవకి కూడా అనిర్వచనీయమయిన తృప్తిని కలిగించింది... ఆరాత్రికి రాఘవకి సరిగ్గా నిద్రపట్టలేదు...



చాలారోజుల తరువాత తండ్రితో సంభాషించటం ఆమెకే కాదు, రాఘవకి కూడా అనిర్వచనీయమైన తృప్తిని కలిగించింది... ఆరాత్రికి రాఘవకి సరిగ్గా నిద్రపట్టలేదు... అతను సీసా తెరవకపోవటం కూడా కారణం అయివుండచ్చు కాని రాఘవ మళ్ళీ మళ్ళీ ఆ సంభాషణని రీప్లే చేసుకుంటూ ఆ రాత్రి చాలాసేపు గడిపాడు.

మర్నాడు చేయాల్సిన పనుల గురించి తనకితానే జ్ఞాపకం చేసుకుంటూ నిద్రకి ఉపక్రమించిన గీతకి ఎందుకో '...అది పట్టుదల కాదు... మొండితనం కాదు... అనవసరమైన తెగువని ప్రదర్శిస్తాడు యోగి...' అని ప్రొఫెసర్ అనటం గుర్తుకి

# శ్రద్ధాంజలి



## స్వర్గీయ గునిపాటి రంగమ్మ గారు

మంగంపేట గ్రామం, ఓబులవారిపల్లె (మం), కడప జిల్లా.

మంచితనం, అనురాగం, ఆప్యాయతలు పంచుతూ ఉన్నతమైన
వ్యక్తిత్వాన్ని కలిగి కుటుంబ ఉన్నతికై అహర్నిశలు శ్రమించి
అందరి హృదయాలలో చెరగని ముద్రవేసుకొని
మా అందరినీ ఉన్నత స్థానాలధిష్టింప చేసిన మా మాతృమూర్తి

కీ॥శే॥ గునిపాటి రంగమ్మ గారి"

మరణం మాకు తీరని లోటు.

ఆమె పవిత్ర ఆత్మకు శాంతి కలగాలని దేవుని ప్రార్థిస్తున్నాము.

కుమారులు

**గునిపాటి కేశవులు**
మాజీ సర్పంచ్
మంగంపేట గ్రామం,
ఓబులవారిపల్లె (మం), కడప జిల్లా.

**గునిపాటి రామయ్య**
మాజీ పార్లమెంట్ సభ్యులు
రాజంపేట,
కడప జిల్లా.

వచ్చింది. ఆ తెగువ వల్లనే యోగి ఇబ్బం దులలో ఇరుక్కుంటున్నాడా?

3



యోగి ఇంటికి వచ్చేసరికి ముందు గదిలో లైట్ లేదు. సాధారణంగా ఆ సమ యానికి యోగి తండ్రి రంగారావు హిందూ పేపర్‌లో క్రాస్ వర్డ్ పజిల్‌లో నింపలేకపోయిన ఖాళీల వంక చూస్తూ ఆలోచిస్తూ ఉండేవాడు.

హాల్‌లో లైట్ ఉంది కాని రంగారావు లేడు. కిచన్‌లోకి అడుగు పెడుతుంటేనే అప్పుడే వంట పూర్తిచేసినట్లు వాసన వస్తు న్నది. లైట్ వేసి చూశాడు యోగి... స్టవ్ పైన చారుగిన్నె ఉంది. దానికి మూత పెడు తుంటే చారు సువాసన అతని నాసికని పల కరించింది. నాన్న చారు కాయటంలో ఎక్స్ పర్ట్ అనుకున్నాడు. కొద్దిగా మాడిన బంగాళ దుంపకూర... పొద్దున యోగి వండిన పాల కూరపప్పు గిన్నెలలో ఉన్నాయి.

తండ్రి రూమ్‌లోకి నడిచాడు యోగి. నిండా రగ్గు కప్పుకుని పడుకుని ఉన్నాడు రంగారావు.

'ఒంట్లో బాగా లేదా నాన్నా?' యోగి కంగారుగా అడిగాడు.

'బాగానే ఉంది. జ్వరం వస్తుందా అని అనుమానం వేసింది...' రంగారావు అన్నాడు.

తండ్రి నుదురు తాకి చూశాడు యోగి. మామూలుగా ఉంది. అమ్మయ్య అనుకు న్నాడు. 'జ్వరం లేదనుకుంటాను నాన్నా!'

'లేదు... చూశావా? ఆ చిట్కా పని చేసింది!' అన్నాడు రంగారావు రగ్గు తొల గిస్తూ.

'చిట్కా ఏమిటి?' అయోమయంగా అడి గాడు యోగి.

'ఉష్ణం ఉష్ణేన శీతలం... అంటారు కదా... ఒళ్ళు కాస్త వెచ్చగా ఉందనిపించి రగ్గు కప్పుకున్నాను... బాగా చెమటలు పట్టాయి... దాంతో జ్వరం పోయింది...' అన్నాడు రంగారావు, తను అనుసరించిన నేచురోపతీ విధానాన్ని వివరిస్తూ...

'ఎందుకంత శ్రమ నాన్నా?' కాసింత చిరాగ్గా అన్నాడు యోగి. 'ఓ పారాసిట మాల్ టాబ్లెట్ వేసుకుంటే సరిపోయేది కదా!'

'నేను ఆ అల్లోపతీ మందులు వేసు కోను... శరీరాన్ని అంతా కెమికల్స్‌తో నింపి విషపూరితం చేస్తాయి అవి... పారాసిటమాల్ వేసుకుంటే కిడ్నీ, లివర్ చెడిపోయే ప్రమాదాలున్నాయి తెలుసా?'

తనని తప్పుపట్టాలనే ఆయన ఆ సైడ్ ఎఫెక్టులు ప్రస్తావించాడని యోగికి అని పించింది. దాంతో యోగి చిరాకు విసు గుగా మారింది. 'ఈ మధ్య నువ్వు మరీ చాదస్తంగా మాట్లాడుతున్నావు నాన్నా!. ఒక్క టాబ్లెట్ వేసుకుంటే ఏం నష్టం ఉండదు... కిడ్నీ, లివర్ అంత అర్జెంట్‌గా చెడిపోవు...'

'అలా అని ఆ మందులు తయారుచేసే మల్టీ నేషనల్ కంపెనీలు చెబుతాయి... వాళ్ల డబ్బులకి తోకవూపే శాస్త్రజ్ఞులు- అవును, మా పరిశోధనలలో ఇవెంతో సుర క్షితమని తేలాయి అని చెబుతారు. అవన్నీ ఇంగ్లీష్‌లో ప్రింట్ అవుతాయి కాబట్టి నువ్వు నమ్మేస్తావు. నిజానికి మన దేశీయ వైద్య విధానాన్ని ఒక పద్ధతి ప్రకారం

వాళ్లు దెబ్బతీస్తుంటే నీలాంటివాళ్లు వాళ్లకి వత్తాసు పలుకుతున్నారు. అయినా తన జ్వరాన్ని ఎలా తగ్గించుకోవాలో మన శరీ రానికి బాగా తెలుసు. దాని పని అది సమర్థవంతంగా చేసుకుంటుందికదా... ఊహు అలాకాదు... ఏవేవో టాబ్లెట్స్ వాడతారు. దాంతో ఏమవుతుంది? రోగని రోధక వ్యవస్థ బలహీనమవుతుంది. దాంతో శరీరం అలోపతీ మందులకి శాశ్వ తంగా బానిసగా మారిపోతుంది...' రంగా రావు అన్నాడు.

తండ్రి ఎందుకిలా వితండంగా మాట్లా డుతున్నాడు? యోగికి కోపం వచ్చింది. 'నాన్నా! ఒక్క టాబ్లెట్ వేసుకోమంటే ఇంత చర్చ ఎందుకు చేస్తున్నావు?'

'చెప్పానుకదా అడ్డమయిన కెమికల్స్ నేను మింగను...' రంగారావు కచ్చితంగా అన్నాడు.

యోగి వ్యంగ్యంగా నవ్వాడు. 'అసలు నిజానికి మన శరీరం అంతా కెమికల్స్ మయం నాన్నా...! హిమోగ్లోబిన్ ఒక కెమికల్... ఇన్సులిన్ ఒక కెమికల్...'

రంగారావు అడ్డుతగిలాడు. 'శరీరం కెమికల్స్ మయం అనుకున్న మనిషి ఏం చేస్తాడు? ఆ కెమికల్స్ని ఎలాగయినా ఉపయోగించుకోవాలన్న వ్యాపారభావనతో తోటిమనిషి చావగానే పాతిపెడతాడు... శరీరంలో ఉన్న కెమికల్స్ అన్నీ ఎరువు లుగా మారాలి అన్న దుర్బుద్ధి అన్నమాట. అందుకనే తెల్లవాళ్లు మృతదేహాలని పాతి పెడతారు... కాని మనమో...? దేహం అంటే దేవాలయంగా భావిస్తాం... దేహో దేవాలయ ప్రాక్తో జీవో దేవః సనతనః అన్నారు. దేహంలో అంతవరకూ వసిం చిన ఆత్మ, పరమాత్మలో లీనమయింది కాబట్టి ఆ దేహాన్ని కూడా అగ్నిదేవుడికి సమర్పిస్తాం... గౌరవ ప్రదంగా వీడ్కోలు చెబుతాం... అదీ మన పూర్వీకుల విజ్ఞత... గొప్పతనం... అదీ మన సంస్కృతి... అవన్నీ నీకు పట్టవు... తెల్ల వాళ్లు చెప్పిందే సైన్స్, శాస్త్రం అనుకుని ఈ దేశం అంతా ఎందుకు మారలేదా అని బాధపడిపోతుంటావు...'

తండ్రి స్వరంలో బాధకన్నా అక్కసుదే పైచేయిగా ఉండటంతో యోగి ఎటెన్షన్లోకి వచ్చాడు. ఛా! ఏమిటిది? ఎన్నిసార్లు అనుకున్నా ఎందుకిలా తండ్రితో వాదనకు దిగుతున్నాడు తను? ఉద్దేశించక పో యినా తమ సంభాషణ తప్పనిసరిగా వివాదంలోకి ఎందుకు దారి తీస్తుంది? సామరస్యంగా తండ్రితో మాట్లాడి ఎన్ని రోజులయ్యింది? యోగి తల విదిలించాడు.

'నాన్నా నీకు ఒంట్లో బాగా లేనప్పుడు వంట చేయటం ఎందుకు...? ఎందుకు శ్రమ పడ్డావు, చెప్పు... వచ్చాక నేను చేసే వాడిని కదా!' గొంతుని సౌమ్యంగా మార్చి అన్నాడు యోగి.

'నువ్వు ఎప్పుడు వస్తావో చెప్పలేం కదా... మళ్లీ నాకు ఆకలి వేసే సమయా నికి ఓపిక ఉంటుందో లేదో అని, ఓపిక ఉన్నప్పుడే వంట చేసేశాను...' రంగారావు కూడా మెత్తగానే అన్నాడు.

అపరాధభావంతో కొద్ది సేపటివరకూ కద ల లేకపోయాడు యోగి. ఏదో రకంగా ఆయన తనని దోషిగా నిలబెట్టాలని ప్రయ త్నిస్తున్నాడంటే ఎంతటి అసహనం ఉందో ఆయనలో..! తన ప్రవర్తనని ఆయన ఎందుకు హర్షించలేకపోతున్నాడు?

భారంగా కదిలి కిచెన్లోకి నడిచాడు యోగి. చికాకు పరుస్తున్న ఆలోచనల నుంచి సాంత్వన పొందాలంటే ఓ మగ్గుడు లెమన్ టీ తాగాలి అనుకున్నాడు. గిన్నెలో నీళ్ళు పోసి స్టవ్ మీద ఉంచి లైటర్ అందుకున్నాడు.

★ ★ ★

యోగి తల్లి అతని చిన్నప్పుడే చనిపో



యింది. తండ్రి రైల్వేలో పనిచేస్తున్నాడు. తల్లి లేదని యోగిని ఎంతో ప్రేమతో పెంచాడు. ముప్ఫయి ఏళ్ల వాడివే కదా మళ్లీ పెళ్లి చేసుకోరాదా అని బంధువులు, స్నేహితులు ఎంతగా చెప్పినా రంగారావు పెడచెవిన పెట్టాడు. తనకి భార్యగా వచ్చే అమ్మాయి తన కొడుకుకి తల్లిగా ప్రేమని అందించకపోతే పిల్లాడు నలిగిపోతాడని ఆయన భయపడ్డాడు.

తల్లిలేని పిల్లవాడని మొదట్లో గారం చేశాడు. దాంతో చిన్నప్పుడు యోగి ఏదంటే అదే సాగేది. అలా కొడుకును అతిగా రాబం చేశాక పిల్లాడిని పెంచే పద్ధతి ఇది కాదు అనుకున్నాడు ఆయన. కొన్ని రూల్స్ రెగ్యులేషన్స్ ఏర్పరిచాడు. యోగి రాత్రి ఎన్నింటికి రంచన్‌గా పడుకోవాలో, స్కూల్ నుంచి వచ్చి ఎన్ని నిముషాలు ఆడుకోవాలో, ఎంతసేపు చదువుకోవాలో, ఎవరితో స్నేహం చేయాలో అన్నీ ఆయనే ఓ టైమ్‌టేబుల్‌లాగా ఏర్పరిచాడు. అంతవరకూ స్వేచ్ఛగా పెరిగిన యోగికి ఒక్కసారిగా ఉక్కిరిబిక్కిరిగా తోచసాగింది. దాంతో ఎదురు తిరిగాడు. లాభం లేకపోయింది. నియమనిబంధనలు ఇంకా కఠినంగా మారాయి. ఇక తప్పక తల ఒగ్గాడు.

ఓరోజున టైమ్ టేబుల్‌లో అరగంట బదులు గంటన్నర ఆడుకున్నట్లు ధైర్యంగా నోట్ చేశాడు యోగి.

'అంతసేపు ఎందుకు ఆడుకున్నావు?' రంగారావు నిలదీశాడు.

'హోమ్‌వర్క్ ఇవ్వలేదు...'

'ఎందుకు ఇవ్వలేదు...'

'రేపు లెక్కల పరీక్ష ఉందిగా అందుకని...' చల్లగా చెప్పాడు యోగి.

రంగారావు అదిరిపడ్డాడు. 'లెక్కల పరీక్షా...? చదవకుండా ఎందుకు ఆడుకుంటున్నావు?'

యోగి నవ్వాడు. 'లెక్కల పరీక్షకి చదవరు నాన్నా... లెక్కలు చేయాలి. అయినా ఆ లెక్కలన్నీ నేను ఎడం చేత్తో చేయగలను...'

రంగారావు మతిపోయింది. ఆయన చిన్నప్పుడు తండ్రి చెప్పిన ప్రతిదానికీ సరేననేవాడు. ఎంత నచ్చని పని అయినా తండ్రి చెబితే చేసేవాడు. పెద్దవారితో వాదనకు దిగటం అన్నది ఆయనకి భరించలేని విషయంగా తోచింది.

'అంత ఓవర్ కాన్ఫిడెన్స్ పనికిరాదు...' రంగారావు తేరుకుని అన్నాడు. 'అయినా పరీక్ష ముందు మళ్లీ మళ్లీ లెక్కలు చేస్తే తప్పేమిటి?'

'అన్నీ చాలా తేలిక లెక్కలే నాన్నా!' అన్నాడు యోగి.

సాధారణంగా తమ పిల్లలకి పరీక్షలో మంచి మార్కులు రావాలని అందరూ కోరుకుంటారు. కానీ ఆ మర్నాటి పరీక్షలో మార్కులు తక్కువ వస్తేగాని యోగి తిక్క కుదరదనుకున్నాడు రంగారావు. ఆవిధంగా దేవుడ్ని ప్రార్థించాడు కూడా.

పన్నెండు లెక్కలు ఇచ్చి ఎనిమిది చేయమంటే యోగి పన్నెండూ సరిగ్గా చేశాడు. లెక్కల మాస్టారు ఎక్సలెంట్ అని పెద్ద అక్షరాలతో రాశాడు కూడా. అది చూసినప్పుడు యోగి ఇక తన మాట వినడేమో అని రంగారావుకి భయం వేసింది. 'లెక్కలని తేలికగా తీసుకోకూడదురా! జాగ్రత్తగా ఉండాలి' అని మాత్రం హెచ్చరించాడు.

యోగి నవ్వాడు. 'మా పాత లెక్కల



**ఎంత బాగా చెబుతాడో తెలుసా? లెక్కలతో స్నేహం... చేయాలిట... వాటితో ఆడుకోవాలిట... అప్పుడే అవి మనం చెప్పిన మాట వింటాయిట...'**



మాస్టారు అలాగే అనేవాడు. ఇప్పుడు కొత్తగా ఒకాయన వచ్చాడు. ఎంత బాగా చెబుతాడో తెలుసా? లెక్కలతో స్నేహం చేయాలిట... వాటితో ఆడుకోవాలిట... అప్పుడే అవి మనం చెప్పిన మాట వింటాయిట...'

రంగారావు భయం పెరిగింది. లెక్కలతో ఆడుకోవటం, స్నేహం చేయటం ఏమిటో ఆయనకి అంతుబట్టలేదు.

అయితే యోగికి లెక్కల మాస్టారు ఆరాధ్యదైవం అయ్యాడు. ఆయన లెక్కలు బోధించినా యోగికి మిగిలిన అంశాలపైన కూడా అభిరుచి కలిగించేందుకు పుస్తకాలు ఇస్తుండేవాడు. క్లాసు పుస్తకాలతో సమానంగా ఏవేవో పుస్తకాలు యోగి చదవటం రంగారావుకి అసహనంగా ఉండేది.

ఏడో తరగతి చదివేటప్పుడు జరిగిన సంఘటన యోగి ఆలోచనలని చిత్రమయిన మలుపు తిప్పింది.

వినాయక చవితి పండగ రోజున తండ్రీ కొడుకులు కలిసి శ్రద్ధా భక్తులతో వినాయక పూజ చేశారు. రంగారావు కథ చదువుతుంటే ఎప్పుడూ రాని సందేహం యోగికి కలిగింది. 'నాన్నా! మనకి భూమి మీదనుండి చంద్రుడు చవితినాడు ఒకలాగా, పున్నమినాడు ఇంకోలాగా కనిపిస్తాడు కదా? మరి పైనుండి అంటే దేవతలు ఉండే రోదసి నుండి చూస్తే కూడా ఆ తేడా కనిపిస్తుందా?' అని అడిగాడు.

'యోగి, ఇది స్కూల్ కాదు. పూజ చేసేటప్పుడు ఇంకో ధ్యాస ఉడకూడదు...' రంగారావు గొంతు కరుకుగా మారింది. తిరిగి కథ కొనసాగిస్తూ 'ఈ దినము చంద్రుని చూడరాదు గాన నిజ గృహంబునకేగెద శలవిందు...' అని, 'నారదుడు స్వర్గలోకమునకేగెను... అంతట శ్రీకృ



ష్ణుడు...' అని చదువుతున్నప్పుడు కూడా ఆ స్వరంలో మార్పు రాలేదు.

యోగి తిరిగి అడ్డుతగిలాడు. 'నా డౌట్ అదే నాన్నా! కృష్ణుడికి జాగ్రత్త చెప్పి నారదుడు పైన విహరిస్తూ.. చవితి చంద్రుడిని చూడకుండా ఎలాంటి జాగ్రత్త తీసుకుంటాడు? ఆయనకి చంద్రుడి ఆకారం ఏ విధంగా కనిపిస్తుంది?'

యోగి సందేహాలకి రంగారావు వద్ద సమాధానాలు లేవు... పైగా ఆయనకి అవి పిచ్చి ప్రశ్నలులాగా తోచాయి. అవి నిజమైన సందేహాలా? లేకపోతే వీడు హేళన చేస్తున్నాడా? అందుకునే కొడుకుని నోరు మూసుకోమని గద్దించాడు.

ఆ రోజంతా యోగి పెన్సిల్‌తో బొమ్మలు గీస్తూ సందేహ నివృత్తికి ప్రయత్నించాడు. లాభం లేకపోయింది. పాలవెల్లికి కట్టిన వెలగపండుకి బత్తాయి పండు అడ్డుగా పెట్టి టార్చ్‌లైట్ వెలిగించి పక్క నుండి, పైనుంచి చూసి జవాబు రాబట్టే ప్రయత్నం చేశాడు. సందేహం తీరలేదు.

ఆ మర్నాడు యోగి స్కూల్‌లో సైన్స్ మాస్టారిని అడిగాడు... ఆయన కూడా సరైన జవాబు ఇవ్వలేకపోయాడు.

పక్కనే ఉన్న లెక్కల మాస్టారు విషయం ఏమిటి అని ఆరా తీశాడు... ఆయనకి యోగి ప్రశ్నలు చాలా తెలివైన విగా తోచాయి. సంతృప్తికరంగా సమాధానం ఇవ్వాలంటే తనూ కొన్ని పుస్తకాలు చదవాలని గ్రహించాడు. ఆయనతోపాటు యోగి కూడా ఆ పుస్తకాలు చూశాడు. అడిగిన ప్రశ్నలకు సమాధానాలు వచ్చాయి. కాని ఇంకెన్నో సందేహాలు పుట్టుకు వచ్చాయి. వాటికి జవాబులు వెతుక్కోవటం ఎంత బాగుంటుందో అతను లెక్కల మాస్టార్ ద్వారా నేర్చుకున్నాడు.

బహుశా ఆ శోధనలో యోగికి కొత్త విషయాలు తెలియటమే కాదు, కొత్త దృక్పథం కూడా ఏర్పడింది. ఐన్‌స్టీన్ తన బాల్యం గురించి రాసిన విషయాల తెలుగు అనువాదం అతన్ని ఎక్కువగా ప్రభావితం చేసింది. 'విజ్ఞాన శాస్త్రానికి సంబంధించిన పుస్తకాలు చదివాక బైబిల్‌లో ఉన్న కథలలో ఉదహరింపబడ్డ విషయాలు చాలా వరకు సత్యాలు కాకపోవచ్చునన్న అభిప్రాయం నాకు కలిగింది' అని ఐన్‌స్టీన్ రాసిన వాక్యాలు చదువుతూ ఉంటే అతని ఒళ్ళు ఝల్లుమన్నట్లయింది. ఆ వాక్యాలనే పదే పదే చదివాడు. ఇక అతని మార్గం మారింది.

మరుసటి సంవత్సరం రాష్ట్ర ప్రభుత్వం ముందుగా ప్రకటించిన రోజున కాకుండా తరువాతి రోజున వినాయక చవితి చేయాలని కొందరు అన్నారు. సిద్ధాంత రాద్ధాంతాల తరువాత ప్రభుత్వం కూడా సెలవు మార్చింది.

స్నానం చేసి వచ్చిన యోగి పూజకి కూర్చోలేదు. 'నాకు నమ్మకం లేదు నాన్నా!' అన్నాడు.

"ఏమిటీ! నీకు నమ్మకం లేదా?' పదమూడేళ్ల పిల్లాడు తనని ఎదిరించటమే కాకుండా నలభై అయిదేళ్ళుగా తానేం ప్రశ్నించకుండా ఒప్పుకున్న సంగతులని నిలదీయటం ఆయనకి ఉక్కిరిబిక్కిరిగా అనిపించింది. 'నీకేం తెలుసనిరా ఇలా మాట్లాడుతున్నావు?'

'నాకే కాదు, ఎవరికీ ఏమీ తెలిసినట్లు లేదు నాన్నా! అందుకనే ఈ పండుగ ఈ రోజున చేయాలా, నిన్న చేయాలా అని మొన్నటివరకూ తేల్చుకోలేక పోయారు..'

అప్పుడు యోగి చెంప పగిలేలా కొట్టాడు రంగారావు. ఆ పండుగ రోజున తండ్రీ కొడుకులు సరిగ్గా ఎంగిలి పడలేదు. రాత్రి పెరట్లో మంచం వేసుకుని ఆకాశంలోకి చూస్తూ ఉండిపోయిన కొడుకుని ఎలా మందలించాలో ఆయనకి అర్థం కాలేదు. తోటి వారికి కలగని సందేహాలు వీడికి ఎందుకు వస్తున్నాయి? ఇవి తెలివితేటలా లేక అతి తెలివితేటలా?

'పూజ చేసుకోకుండా చంద్రుడిని చూస్తే నీలాపనిందలు వస్తాయని అన్నావు కదా... నిన్న రాత్రి నేను ఆ పనే చేశాను... నీలాపనిందలు నిజమో కాదో నీకే అర్థమవుతుంది...' అని యోగి స్నేహితుడితో అనటం విన్న రంగారావు నిర్ఘాంతపోయాడు. అన్ని రోజులుగా ప్రోగ్రెస్ రిపోర్ట్ చూసి అంతా చక్కగా ఉందనుకోవటం పొరపాటేమో అన్న ఊహ కలిగింది. క్లాసు వర్క్, హోం వర్క్ నీట్‌గా రాస్తుంటే మురిసిపోవటం సరికాదేమో అన్న సందేహం కలిగింది. స్కూల్‌లో ఎవరితో స్నేహం చేస్తున్నాడో విచారించాడు. స్నేహితులంతా యోగి చాలా ఇంటెలిజెంట్ అనే చెప్పారు. అంతా బాగానే ఉంది, మరి వీడేమిటీ ఇలా తయారవుతున్నాడు?

రంగారావు కొత్త కోణంలో ఆలోచించి మాస్టార్ల గురించి ఆరా తీశాడు. లెక్కల మాస్టారుకి కమ్యూనిస్ట్ అని పేరుంది. అది విని రంగారావు వణికిపోయాడు.







యోగి వింత ప్రవర్తనకి కారణం తెలిసినట్లయింది ఆయనకి. ఇక అలక్ష్యం చేస్తే కొడుకు నక్సలైట్‌గా మారిపోతాడేమో అన్న భయం పట్టుకుంది ఆయనకి. సంకోచించకుండా యోగిని వెంటనే ఇంకో స్కూల్‌లో చేర్చాడు.

అప్పటినుండి కొడుకు చేసే ప్రతి పనిని భూతద్దంలోంచి చూడటం మొదలుపెట్టాడు రంగారావు. పరీక్ష రాస్తుంటే ఎలా రాస్తున్నాడా చూడాలని ఇన్విజిలేటర్ వెనకే నిలబడి గమనిస్తున్నట్లు ఇబ్బంది పెరిగింది యోగికి. కొడుకుని మంచి మార్గంలో పెట్టాలన్న తపనలో తండ్రి మునిగిపోతే అది యోగికి దుర్భరమైంది.

★ ★ ★

ఖాళీ అయిన కప్పుని పెదవులకి చేర్చి ఇంకా టీ తాగాలని ప్రయత్నిస్తున్నానని గ్రహించి యోగి చిరాగ్గా కప్పుని టేబుల్ పైన ఉంచాడు. ఆలోచనలలో మునిగిపోవటంతో టీ తాగిన స్పృహ లేదు అతనికి. లేచి తండ్రి ఏం చేస్తున్నాడో చూశాడు. రంగారావు భగవద్గీత చదువుతున్నాడు. క్రాస్‌వర్డ్ పజిల్‌లో తండ్రి వదిలేసిన ఖాళీలని నింపుతూ కూర్చున్నాడు యోగి.

★ ★ ★

ఆ మర్నాడు క్యాంటిన్‌లో గీతకి కనబడ్డాడు యోగి. ఆమెతో పాటు రీసెర్చ్ చేస్తున్న వినాయక్‌తో కలిసి ఏదో చర్చిస్తున్నాడు. తల్లితో పాటు ఆమె రెగ్యులర్‌గా గుడికి వెడుతుంది... అక్కడ తప్పకుండా వినాయక్ కనబడుతుంటాడు. టీ కప్పు తీసుకుని పక్క టేబుల్ దగ్గర కూర్చోంది. గీత ఓ చెవిని వినాయక్, యోగిల సంభాషణపై వేసిందామె.

'యోగి! నువ్వు చాలా బ్లంట్‌గా మాట్లాడుతున్నావు' అంటున్నాడు వినాయక్. 'ఈనాటి సైన్స్‌కి కొరుకుడు పడలేదని నాన్‌సెన్స్ అని ఒక్క ముక్కలో తేల్చి పారెయ్యటం చాలా తప్పు... సైన్స్ అర్థం చేసుకోనివి సైన్స్‌కి అర్థం కానివి ఎన్నో ఉన్నాయి... ఉంటూనే ఉంటాయి.'

'కొన్ని విషయాలలో అలా మాట్లాడక తప్పదు...' కచ్చితంగా చెప్పాడు యోగి. 'రామర్ చెబుతున్న దానిలో లాజిక్‌కి అందేది ఒక్కటీ లేదు. మొదట్లో పిక్‌నిక్‌కి వెళ్ళినప్పుడు నిప్పురవ్వ పడితే చుర చురా మండిన పచ్చని ఆకుని చూశానని చెప్పాడు...అలా కాలింది కాబట్టి అందులో ఇంధనం ఉందని గ్రహించానని అన్నాడు. ఆ ఆకులని నీటితో మరిగిస్తే మహా అయితే అందులో ఉన్న నూనె స్టీమ్ డిస్టిలేషన్ ద్వారా బయటికి రావాలి... కాని అతను నీళ్ళే పెట్రోలుగా మారటానికి ఆ ఆకులు ఉత్ప్రేరకంగా పని చేస్తున్నాయని ఇప్పుడు అంటున్నాడు...ఎలా నమ్మాలి? '

వినాయక్ నవ్వాడు. 'ఇలా మొండిగా నేను నమ్మను అనే బదులు అతను చేసిన డిమాన్‌స్ట్రేషన్‌కి రావలసింది. అప్పుడు నీ కళ్ళతో చూసి నమ్మేవాడివి...'

'నా కళ్ళతో చూసినా నమ్మను...' దృఢంగా అన్నాడు యోగి.

'సైన్స్ అంతా నీకే తెలిసినట్లు నువ్వు టూ మచ్‌గా మాట్లాడుతున్నావు...' వినాయక్ అన్నాడు.

'ఇందులో టూ మచ్ లేదు వినాయక్! నువ్వు థర్మోడైనమిక్స్, కైనెటిక్స్ చదివావు కదా..? నీటిలో ఉన్న హైడ్రోజన్‌ని ఆక్సిజన్ నుండి విడగొట్టడం ఎంత కష్టమో నీకు తెలుసు కదా... గాలిలో చాలా తక్కువగా ఉన్న కార్బన్ డయాక్సైడ్‌తో ఆ హైడ్రోజన్ కలిస్తే కాని రామర్ సృష్టించిన పెట్రోల్ వచ్చే అవకాశం లేదు. అది కూడా అసాధ్యమే అని తెలిసినప్పుడు నా కళ్ళని అతను మోసగించాడు అనుకుంటాను కాని నా కళ్లు చూసింది నిజం అనుకోను. ఫస్ట్ లా,

సెకండ్ లా ఆఫ్ థర్మోడైనమిక్స్‌కి వ్యతిరే కంగా ఈ ప్రపంచంలో ఏది జరిగినా అది మ్యాజిక్ అని అనుకోవటానికి సైన్స్‌లో డాక్ట రేట్ అక్కరలేదు...'

'ఆ అహంకారమే నాకు నచ్చదు... మన భారతీయుడు ఓ విప్లవాత్మకమైన నూతన విషయాన్ని ఆవిష్కరించినప్పుడు దాన్ని కొట్టిపారేయటం బాగా లేదు...'

టక్కున అడ్డు తగిలాడు యోగి. 'వినాయక్! ఓ సాయం చెయ్యి...నీ దగ్గర ఐదు రూపాయలు ఉన్నాయా?'

'ఉన్నాయి... ఎందుకు?' వినాయక్ అయోమయంగా అడిగాడు.

'ఉంటే ఇవ్వు...' అంటూ అత నిచ్చిన నోట్ అందుకుని థాంక్స్ చెప్పాడు. 'మనం ఎంతసేపు చర్చించినా, వాదులాడినా నేను చెప్పేది నువ్వు ఒప్పుకోవు, నువ్వు చెప్పేది నేను ఒప్పుకోను... ఏం ప్రయోజనం ఉండదు... ఎట్‌లీస్ట్ ఈ అయిదు రూపాయలతో నాకు ఓ సిగరెట్ పాకెట్ వస్తుంది. థాంక్యూ' అని వెళ్లాడు.

వినాయక్ అతన్నే చూస్తుండిపోయాడు. 'హాయ్!' అంటూ గీత అతని ఎదురుగా కూర్చుంది.

'హాయ్ గీతా...!' అన్నాడు వినాయక్ తేరుకుని. 'సైన్స్ ఎంత చులకన అయిపోయిందో చూడు.. బీఏ చదివిన వాడు కూడా ఫస్ట్ లా ఆఫ్ థర్మోడైనమిక్స్‌పై లెక్చర్లు ఇస్తున్నాడు.'

'బీఏనా...? ఎవరు?' గీత ఆశ్చర్యంగా అంది. ఆ ఆశ్చర్యంలో అంతకు మునుపు జరిగిన సంభాషణని చాటుగా విన్నట్లు తెలిసిపోతుందన్న విషయాన్ని ఖాతరు చేయకుండా 'నువ్వు యోగి గురించేనా చెప్పేది?' అని అడిగింది.



కాని నా కళ్లు చూసింది నిజం అనుకోను. ఫస్ట్ లా, సెకండ్ లా ఆఫ్ థర్మోడైనమిక్స్‌కి వ్యతిరేకంగా ఈ ప్రపంచంలో ఏది జరిగినా అది మ్యాజిక్ అని అనుకోవటానికి సైన్స్‌లో డాక్టరేట్ అక్కరలేదు...'



'అవును ప్రొఫెసర్ యోగిగారు ఇంగ్లిష్ లిటరేచర్‌లో బీఏ చేశారు... ఇప్పుడు యూనివర్సిటీలో జర్నలిజం వెలగబెడుతున్నారు...' వినాయక్ వ్యంగ్యంగా అన్నాడు. 'అయినా ఈ హైదరాబాద్ మొత్తంలో సైంటిఫిక్ టెంపర్ ఉన్న వ్యక్తి ఇతనొక్కడే అన్నట్లు బిహేవ్ చేస్తాడు...'

గీత గుటకలు మింగింది. క్రితంరోజు తండ్రితో మూలికా పెట్రోల్ గురించి చర్చించాలన్న ఆలోచన ఎందుకు పుట్టిందో ఆమెకి తెలిసినట్లయింది. భౌతికంగా ఏ విధమైన పోలికలు లేకపోయినా యోగి, రాఘవ ఒక్కలాంటి వాళ్లే! అదే... అదే... ఆ కారణం వల్లనే యోగి అంటే తనకి ఆసక్తి పెరుగుతున్నది. అందుకనే అతని గురించి అన్నిసార్లు తను ఆలోచిస్తున్నది. 'ఇప్పుడు నాకు అర్థమయింది...' అని మనసులో తోచిన భావాన్ని అప్రయత్నంగా పైకి వెలిబుచ్చింది.

'ఏం అర్థమయింది?' వినాయక్ అడిగాడు. గీత జవాబు ఇవ్వకపోయే సరికి మాట మార్చాడు. 'నీకు ఓ సంగతి తెలుసా గీతా? రామర్‌కి ఆ మూలిక కనబడిన ప్రాంతంలో సీతను వెతుక్కుంటూ రాముడు తిరిగాడుట... అందుకే అంత ప్రభావం ఉండి ఉంటుంది...'

ఎవరు పుట్టించారో తెలియదు కాని ఆ వార్త అతి వేగంగా పాకిపోతున్నది. ఏ విషయానికయినా పురాణాల నుంచి ఏదన్నా సందర్భాన్ని ఉటంకిస్తే జనాలకి బాగా హత్తుకుపోతున్నది. గీతకి ఓ చిలిపి ఊహ పుట్టింది. 'నువ్వు ఈశావాస్యోపనిషత్ చదివావా?' సీరియస్‌గా అడిగింది.

'చదువలేదు, కాని విన్నాను...'





## మన కర్మ

**చె**ప్పిందే చెబుతూ విసిగిస్తున్న ఓ లాయర్‌కు న్యాయమూర్తికి జరుగుతున్న సంభాషణ ఇది.

**న్యా.మూ:** మా కర్మ ఎవరెంత చెత్త చెప్పినా వింటూ భరించాలే గానీ ఏమనడానికి వీలులేదు

**న్యా.వా:** ఈ విషయంలో కర్మ సిద్ధాంతం బెంచికి, బార్‌కీ సమంగానే వర్తిస్తుందండీ. ఎటువంటి తీర్పుకైనా (అంటే చెత్త తీర్పు) మేము నోరు మూసుకోవలసిందే.




గీత నవ్వుకుంది. రీసెర్చ్ చేస్తున్న వారెవ్వరూ తమకి ఏ విషయమైనా తెలియదని బయటపడరు. జాక్స్ (జర్నల్ ఆఫ్ అమెరికన్ కెమికల్ సొసైటి)లో ఫలానా పేపర్ చూశావా అంటే, ఆ గ్రూప్ రాసినదే ఇంకో పేపర్ చదువుతుంటే నాకో డౌట్ వచ్చిందోయి అంటారని నవ్వుతూనే చెప్పసాగింది. 'చాలా చిన్న ఉపనిషత్ అది. అందులో ఓ శ్లోకం ఉంది. తదే జతి తన్నయిజతి... తద్దూరే తద్వంతికే... తదంతరస్య సర్వస్య... తదు సర్వసావ్య బాహ్యతః...'

వినాయక్ చేతులు కట్టుకుని శ్రద్ధగా విన్నాడు. 'నేను ఇంటర్‌లో సాంస్క్రిట్ చదివాను... కొద్దిగా అర్థమైంది. పూర్తి మీనింగ్ నీకు తెలుసా?'

'నేను ఇంటర్‌లో సాంస్క్రిట్ చదవలేదు కాని సంస్కృతం చదివాను' గీత నవ్వింది. 'మీనింగ్ తెలియదు, కాని భావం తెలుసు. అది కదులుతుంది... అది కదలకుండా స్థిరంగా ఉంటుంది. అది బహుదూరంలో ఉన్నా అతి సమీపంలోనే ఉంటుంది.. అన్నింటి లోపలా ఉంటుంది. వెలుపలా వ్యాప్తమయి ఉంటుంది...'

'ఇంట్రెస్టింగ్‌గా ఉంది...' వినాయక్ అన్నాడు. వెంటనే సర్దుకుని, 'గొప్పగా ఉంది... బాగుంది...' అన్నాడు.

'ఆత్మ స్వరూపాన్ని వివరించే శ్లోకం అది... ఎలక్ట్రాన్ రేణువా? తరంగమా ఇంకా సందేహంగా ఉంది.. ఇక అన్‌సర్టెనిటి ప్రిన్సిపుల్ తెలుసు కదా... వైరుధ్య స్వభావాలని కలిగి వున్న ఎలక్ట్రాన్‌కి ఈ శ్లోక భావం ఎంత చక్కగా సరిపోతుందో ఆలోచించు'

వినాయక్ మొహం వెలిగిపోయింది. 'గీతా! యూ ఆర్ ఫెంటాస్టిక్...ఐ మీన్...నా అభిప్రాయం ఏమిటంటే అద్భుతంగా చెప్పావు... ఏదీ ఆ శ్లోకం ఇంకోసారి చెప్పు.. రాసుకుంటాను'

గీత పకపకా నవ్వింది. 'బాణం తగిలాక చుట్టూ సున్నా గీయటం విలువిద్యా నైపుణ్యానికి చిహ్నం కాదు వినాయక్! ఐన్‌స్టీన్ న్యూటన్ సైన్స్‌లో ఎంతటి అంకిత భావంతో దీక్షతో శ్రమించారో అంతటి స్థాయిలో కొందరు మహనీయులు పడిన తపన, జిజ్ఞాసల ఫలితమే ఉపనిషత్తులు... మానవ మేధ ఎంతటి ఎత్తుకు ఎదగగలదో చెప్పటానికి ఉపనిషత్తులకి మించిన ఉదాహరణ ఉండదు. అంత మాత్రాన వాటిలో ఈనాటి సైన్సు కూడా ఉందని భ్రమించడం సరికాదు... ఇప్పుడి

ప్పుడే వెలుగులోకి వస్తున్న ఫలితాలని ఆధారంగా చేసుకుని పురాణాలను, ఉపని షత్తులను విశ్లేషించి కొత్తభాష్యం చెప్పటం బాగుండదు. తెలిసీ నేను ఆ తప్పు ఎందుకు చేశానో తెలుసా?'

'తెలియదు... తెలుసుకోవాలన్న ఆసక్తి కూడా లేదు...' చివ్వున లేచాడు వినా యక్. 'బట్...నువ్వో సంగతి తెలుసుకో వాలి గీతా! యు హావ్ ఇన్‌సల్టెడ్ మి.. దట్స్ వెరీ బ్యాడ్' ఆమె తేరుకునేలోగా అతను చరచరా వెళ్లిపోయాడు.

అపరాధభావంతో గీత అలాగే కూర్చుండిపోయింది. 'ఛా! వీలయినంత వెంటనే వినాయక్‌కి క్షమాపణ చెప్పాలి' అనుకుంది.

4



**వా**రం రోజుల తరువాత...

చీకటి పడిందన్న స్పృహ లేకుండా పని చేస్తూనే ఉంది గీత. ఆ రోజున తారకి ట్యూషన్ చెప్పాలని ఉన్నట్లుండి గుర్తుకి రావటంతో చేస్తున్న పనిని సాధ్యమైనంత త్వరగా ముగించి బయటపడింది. బస్ స్టాప్ వేపు గబగబా నడవసాగింది.

దూరంగా ఓ చెట్టుకింద ఏదో రాస్తూ కనపడ్డాడు యోగి కొద్దిగా పక్కగాఉన్న స్ట్రీట్ లైట్ వెలుతురు అతనికి ఎలా సరి పోతున్నదో తెలియదు కాని వెలుగునీడల మధ్యన ఉన్న అతను దూరం నించి గమ్మ త్తుగా కనపడుతున్నాడు. ఇలాంటి దృశ్యాలు బ్లాక్ అండ్ వైట్‌లో ఫొటో తీస్తే బాగుంటాయి అనుకుంది గీత.

టాంక్ బండ్ పైన ఉన్న తిక్కన్న పోజ్‌లో ఉన్నాడే అనుకుంది. ఇతను మాత్రం తిక్కన్నర అనికూడ అనుకుంది. ఆ ఊహ నవ్వు పుట్టించింది. ఆ నవ్వు లోని అందాన్ని స్వరంలో పలికిస్తూ 'హలో!' అంది గీత.

అయినా దీక్షగా రాసుకుంటున్న యోగి తలెత్తలేదు... 'హలో' అని అన్నాడంతే.

'నా పేరు గీత...'

ఆమె మాటలు పూర్తి కాకుండానే అతను అన్నాడు. 'సారీ! పని తొందరలో ఉన్నాను...నన్ను డిస్టర్బ్ చేయద్దు, ప్లీజ్!'

గీత నిర్ఘాంత పోయింది... అలా వేరెవ రైనా అని ఉంటే చివ్వున వెనక్కితిరిగేదే. కాని ఎందుకో ఆమె కదలలేకపోయింది.

అతనింకా రాస్తూనే వున్నాడు. చెట్టుని ఆనుకుని బాసింపట్టువేసి నిటారుగా కూర్చొని ఏకాగ్రతకి నిర్వచనంలాగా వున్న అతని మీద కోపం రావటం అంతతేలిక కాదనుకుంది గీత. మెల్లగా వెనుతిరిగింది.

వెనక్కి తిరుగుతుండగా అతను తల ఎత్తి తనని చూశాడని ఆమెకి తెలియదు. ఎవరా అని నుదురు చిట్లించి ఆలోచించిన అతనికి సమాధానం తెలిసింది కాబోలు, పెదవుల పైన చిరునవ్వు మెరిసింది.

'బై ది వే, మీ దగ్గర పదిరూపాయలు వున్నాయా?' అడిగాడు యోగి.

గీతకి స్వల్పంగా చిరాకు కలిగింది.. అయినా ఆమె నడక ఆగింది. వెనక్కి తిరిగి అతన్ని చూస్తూ 'ఉన్నాయి' అంది. చిరాకు ఆ మాటలో ఎందుకో ధ్వనించలేదు.

'గుడ్! ఏం అనుకోకుండా ఆ టీ కొట్టు దగ్గర వున్న కుర్రవాడికి ఆ పది యోగి పంపించాడని చెప్పి ఇవ్వండి' అతను రాస్తూనే ఉన్నాడు. తల ఎత్తలేదు.

గీతకి ఒక నిముషం అర్థం అవలేదు. ఈలోగా యోగి 'థాంక్స్' అని అన్నాడు.





గీతకి ఒళ్లు మండిపోయింది... వీర ముష్టి అంటే ఇదే కాబోలు. మొన్నటికి మొన్న పాపం వినాయక్ దగ్గర కూడా ఇలాగే అయిదు రూపాయిలు తీసుకున్నాడు. ఏమిటి ఇతని ఉద్దేశం?

గీత పదినోటు తీసి కుర్రాడికిచ్చింది.

బస్ స్టాప్‌లో నుంచుని ఆ కుర్రాడు ఏం చేస్తాడా అని అటే చూడసాగింది. కుర్రవాడు ఓ కప్పు టీ, సిగరెట్ పాకెట్ తీసుకుని యోగి కూర్చున్న దిక్కుగా వెళ్ళటం కనబడింది.

★ ★ ★

గీతని చూడగానే తార 'అక్కా! మూలికా ప్రయోగంలో స్వల్ప మార్పులు చేశాను. ఈరోజు..' అంది.

'ఏమిటా మార్పులు?'

'రామర్ వాడిన సిట్రిక్ యాసిడ్ బదులు నేను నిమ్మరసం వాడాను కదా... ఇప్పుడు నిమ్మరసం స్థానంలో లాక్టిక్ యాసిడ్ వాడితే ఎలా ఉంటుందా అని ఆలోచించాను...' తార చెప్పింది.

'లాక్టిక్ యాసిడ్ వద్దనుకుని పాలు వాడాను'

'చూస్తుంటే నువ్వు కెమిస్ట్రీలో పెద్దపేరు తెచ్చుకునేటట్లు ఉన్నావు...' అంది గీత నవ్వుతూ.

'అంతా గురువుగారి చలవ' అంది తార.

టీ తాగుతుండగా తార అంది. 'ఆ రోజున నేను హద్దుమీరి షారుఖ్ అంటే నీకు క్రష్ ఉందా అని అడిగాననుకున్నావు కదూ? అది సింపుల్ ఇన్నొసెంట్ క్యూరియాసిటీ అని నిరూపించటానికి ఆ రోజున నేనేం చేశానో తెలుసా?'

'ఏం చేశావు?' గీత ఆసక్తిగా అడిగింది.

'నువ్వు వెళ్ళగానే మమ్మీని కూడా అదే ప్రశ్న అడిగాను. నా అభిప్రాయంలో యు ఆర్ వన్ అమాంగ్ ది ఫ్యామిలీ... చనువుతో నేను నోరు జారినా డోంట్ గెట్ అఫెండెడ్... ప్లీజ్!'

గీత కదిలిపోయింది. టీ కప్పు కింద పెట్టి తారని దగ్గరగా తీసుకుంది. తార మొహం వెలిగిపోయింది.

'నాకు కూడా సింపుల్ ఇన్నొసెంట్ క్యూరియాసిటీ కలుగుతున్నది... మమ్మీ ఏం జవాబు చెప్పారు?' అరనిముషం తరువాత గీత అడిగింది.

తార పకపకా నవ్వింది. 'అప్పుడు మమ్మీ మొహం చూస్తే చెంప పగలగొడుతుందేమో అన్నంత భయం వేసింది. కాని మమ్మీ కంట్రోలు చేసుకుని, తారా! నీకు బాయ్‌ఫ్రెండ్స్ ఉన్నారా అని అడిగింది.'

నువ్వేం చెప్పావు?

'షారుఖ్ ఉండగా బాయ్ ఫ్రెండ్స్ ఎందుకమ్మా? అని అన్నాను...'

'తరువాత?'

'అపుడు చెంపమీద కొట్టింది...' నవ్వుతూ చెప్పింది తార 'నా రూమ్‌లో ఉన్న షారుఖ్ పోస్టర్లన్నీ చింపేసింది...'

'వెరీ శాడ్!'

'దట్స్ లైఫ్ అక్కా! ఏం చేస్తాం?' అంది తార.

'సరే, ఇక షారుఖ్‌ని మరచి చదువులో పడదాం... మొత్తం ఎసైన్‌మెంట్ అంతా చేశావా?' గీత అడిగింది.

'అన్నీ చేసేశాను.. ఆన్సర్లు వెరిఫయి చేశాను... సెంట్ పెర్సెంట్ కరక్ట్.'

'చూశావా? షారుఖ్‌ని మరిచిపోతే బుర్ర ఎలా పనిచేస్తుందో?'

'యు ఆర్ రాంగ్ అక్కా! నేనూ షారుఖ్ కలిసి ఇంటర్ చదువుతున్నట్లు ఊహించుకున్నాను... ఇద్దరం కలిసి లెక్కలు చేస్తుంటే ఎంత మజాగా ఉంటుందో అని ఇన్‌స్పైర్ అయ్యి హుషారుగా టకటకా లెక్కలన్నీ చేసేశాను...' కళ్లు పెద్దవిచేసి తాను చెప్పింది.

# శ్రీశ్రీశ్రీ జగద్గురు దత్తాత్రేయస్వామి మహోత్సవాలు(జిల్లా మహబూబ్‌నగర్)



## శ్రీశ్రీశ్రీ జగద్గురు దత్తాత్రేయస్వామి

కృష్ణానది ఒడ్డున వెలసిన శ్రీశ్రీశ్రీ జగద్గురు దత్తాత్రేయస్వామి

**40 రోజులదత్తాదీక్షలు**

**తేది:14.11.2007 నుంచి 26.12.2007**

**వరకు జరుగును.**



దత్తాదీక్షలు చేస్తున్న స్వాములు



శ్రీశ్రీశ్రీ విఠలానందసరస్వతి
మహారాజ్ (శ్రీవిఠల్‌బాబా)

### దత్తాదీక్ష నియమాలు:

- దత్తాత్రేయస్వామి యందు భక్తివిశ్వాసములు ఉండాలి.
- కాషాయరంగు వస్తువులను ధరించవలెను.
- మద్యపానం, మాంసాహారం భుజించకూడదు.
- నేలపై నిద్రించవలెను.
- బ్రహ్మచర్యము పాటించవలెను.
- మాలధారణకు రుద్రాక్ష, స్ఫటికమాల, ముత్యాల మాల, తులసిమాలలు ధరించవలెను.
- స్త్రీలు ముత్యములు, చందనముల మాల ధరించవలెను.
- ప్రతినిత్యం ఉదయం, సాయంత్రం దత్తాత్రేయున్ని పూజించి శ్రీదత్తాశరణమమ' అను మంత్రం 108 సార్లు జపించవలెను.

### శ్రీశ్రీశ్రీ విఠల్‌బాబాజీ గారి ప్రవచనములు:

- మహాత్ముల అడుగుజాడలో నడుచుకున్నప్పుడే మోక్షం లభిస్తుంది.
- శ్రీకృష్ణ భగవాన్ని స్మరించుటవలన ముక్తిమార్గం లభిస్తుంది.
- భగవత్ కైంకర్యం వలన సత్యగుణ వికాసం పొంది పాపవిముక్తి కలుగుతుంది.
- ధర్మాన్ని కాపాడండి- అది మిమ్మల్ని కాపాడుతుంది.
- భక్తి మార్గం అనుసరించండి - పెద్దలను గౌరవించండి
- బీదలను ఆదరించండి - సత్యాన్ని కాపాడండి
- గురువులను పూజింపుము
- శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతిమహారాజ్ (విఠల్‌బాబా) వారి ఆశీస్సులు పొందండి.

**విరాళాలు పంపేవారు ఈ అడ్రస్‌కు సంప్రదించండి:**

**శ్రీశ్రీశ్రీ జగద్గురు దత్తాత్రేయస్వామి మహాసంస్థాన పీఠం**
**శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతి మహారాజ్(శ్రీవిఠల్‌బాబా)**
శ్రీక్షేత్ర వల్లభపురం, పంచదేవ్‌పాడ్(పస్పుల), మం.మక్తల్, జిల్లా. మహబూబ్‌నగర్
**Ph: 08503–200914, 94400 52232**

గీత నవ్వు ఆపుకోలేకపోయింది.

★ ★ ★

ఇంకో పది రోజుల తరువాత...

శనివారం సాయంకాలం బాగా పొద్దు పోయాక గీత డిపార్ట్‌మెంట్ బయటకి వచ్చింది.

పక్కగా ఉన్న రాళ్ళ గుట్టల మీద చాలా మంది కూర్చుని ఉన్నారు. పలచగా ఉన్న వెన్నెలలో కబుర్లు చెప్పుకుంటున్నారు... పద్యాలు, పాటలు ఆలపిస్తున్నారు... కవి తలు వినిపిస్తున్నారు.

అదృష్టవంతులు... ఎంత హాయిగా జాలీగా గడుపుతున్నారు అనుకుంది కాసింత అసూయతో గీత. అప్పటికి చేయాల్సిన పని చాలా ఉన్నా విసుగుతో మర్నాటికి వాయిదా వేసి వచ్చిన గీతకి అసూయకలగటం సహజమేగా!

కుతూహలంతో ఆమె ఆగిందో లేక ఆ గుంపు మధ్య యోగి కనబడటంతో ఆగిందో చెప్పటం కష్టం.

రాత్రి చీకటిలో రాలిన నక్షత్రం అన్న శ్రీశ్రీ కవిత్వం ఒకతను చదవటం అలా నిలబడే వింది గీత.

'శ్రీశ్రీనేకాదు, తిలక్‌ని, దేవులపల్లిని చదివి ఎన్ని రోజులయింది!' చేదుగా అను కుంది గీత. 'కంఠస్థం వచ్చేవరకూ అమృతం కురిసిన రాత్రిని చదువుతూ అలా నిద్రలోకి జారుకోవటం ఎంత గొప్ప అనుభవం! ఇప్పుడు అలమారలో బహుశా ఆ పుస్తకం పైన దుమ్ము కప్పుకుని



ఉంటుంది... ఛా! ఈ రాత్రి ఏమయినా సరే, చదవాలి. అయినా కృష్ణశాస్త్రిని తెచ్చుకుని ఎక్స్‌పెరిమెంట్ తుస్సుమన్నపుడల్లా 'ఉపశమించని తపనయే నాకున్న భాగ్యము కన్నతండ్రీ' అని పాడుకుంటే ఎంత హాయి. గీత ఆలోచనలు అలా సాగుతూనే ఉన్నాయి.

'శ్రీశ్రీ కవిత ఇన్‌స్పిరేషన్‌తో నేను కూడా రాశాను...' అని యోగి అనటంతో గీత ఆలోచనల నుండి బయటపడింది.

అతను గొంతు సవరించుకుంటుంటే అతని దృష్టి గీతమీద పడింది. వెంటనే అతని మొహంలో చిరునవ్వు తళుక్కుమంది. ఆమెని కూర్చోమని సంజ్ఞ చేశాడు.



గీత సంకోచిస్తూనే కూర్చుంది.

యోగి శ్రావ్యంగా కవిత చదివాడు.

**'నిన్న రాత్రి అమెరికా వెళ్ళిన**
**సూర్యుడు పొద్దున్నే గుడ్ మార్నింగ్ అన్నాడు.**
**'నిన్న రాత్రి నిద్రలో పెరిగిన గెడ్డం**
**పొద్దున్నే గుడ్‌మార్నింగ్ అంది.**
**నిన్న రాత్రి నిద్రలో మరచిపోయిన**
**సమస్యలు**
**పొద్దున్నే గుడ్‌మార్నింగ్ అన్నాయి.**
**నిన్నరాత్రి కలలో మారిన జీవితం**
**పొద్దున్నే గుడ్‌మార్నింగ్ అని తన్నింది'**

చప్పట్లు మారుమోగాయి...

గీత ముగ్ధురాలయిపోయింది.

★ ★ ★

ఆ రోజున గీత మూడ్ అసలు బాగా లేదు. ఆమె ఎన్నిసార్లు రాసినా ప్రొఫెసర్ ప్రెజెంటేషన్ బాగాలేదు. ఇంకా ఇంప్రూవ్ చేయాలి అంటున్నాడు... 'సాయంకాలానికి ఈ పేపర్ పూర్తి కావాలి...' అని హెచ్చరించి ఆయన ఎంచక్కా లంచ్‌కి ఇంటికి వెళ్లాడు.

బాక్స్‌లో ఉన్న చపాతీలని మూడే నిముషాలలో తినేసి మూడోసారి రాయ సాగింది. చిరాకు పెరుగుతున్నప్పుడు బుర్ర సరిగ్గా పనిచేయదని అయిదు పేజీలు రాశాక తెలిసింది. అయిదు కాయితాలని కసిగా చింపింది.

ఇక లాభంలేదు అని సొరుగులోంచి 'అమృత వీణ' అందుకుని తెరిచింది.

'ఎటుల నిలవగలను కటకటా
శోక తమోవృత శూన్య లోకమున
ఎటుల నిలవగలను...' అని చదువుకుంటూ పోయింది. చిరాకు పారిపోయింది.

'నల్లమబ్బు మైచాయ అని



పుల్ల కమల నయనమ్ములని
మల్లెపువ్వు నవు పెదవులని మా
పల్లెకు దయచేసేవని...' అని చదువు తుంటే మనసు ఆహ్లాదంగా మారింది.

ఎందుకో వాచ్ వంక చూసింది. గీత గుండె గుభేలంది. కవితా పఠనంలో తెలియకుండా గంటన్నర గడిపింది... అసలే టైమ్ లేదు అని హైరానపడుతుంటే ఇలా అయితే ఎలా? 'నో...నో...నో...' అని అప్రయత్నంగా గట్టిగా అంది గీత.

'ఏయ్! ఏమయింది?' అడిగాడు పక్కనే పనిచేసుకుంటున్న వినాయక్.

రిలాక్స్ అవుదామని ఈ పుస్తకం చదవటం మొదలు పెట్టాను. టైమ్ ఎంతయిందో ధ్యాసే లేదు... ఇప్పుడు టైమ్ మూడు అవుతున్నది తెలుసా?

'మూడా...? నో...నో...నో...' అరిచాడు వినాయక్.

'ఏమయ్యింది?'

'ఈ రోజు డే అండ్ నైట్ మ్యాచ్ ఉంది తెలుసా? షార్జాలో ప్రతిసారీ హార్ జా అంటున్నారు కదా మనవాళ్లు! ఇప్పుడు టీవీ చూస్తూ వాళ్లని ఉత్సాహ పరచాలి...' వినాయక్ అన్నాడు. 'గీతా! ఎక్స్‌పెరిమెంట్ అంతా చక్కగా సెటప్ చేశాను... మాగ్నటిక్ స్టరర్ తిరుగుతుంటుంది.. అంతే.. నువ్వు దాన్నేం పట్టించుకోనక్కర లేదు.. నువ్వు వెళ్లేటప్పుడు టైమ్ రాసి స్టరర్ ఆపేస్తే చాలు... నేను రేపు వచ్చి శాంపుల్ తీసుకుంటాను.. ఆ సాయం చేస్తావు కదూ... థాంక్యూ...' గీత అంగీకారం కోసం ఎదురుచూడకుండా వినాయక్ వెళ్లిపోయాడు.

ఒంటరిగా మిగిలింది గీత. వినాయక్ అక్కడ క్రికెట్ చూస్తూ కేరింతలు కొడతాడు. అతని ఎక్స్‌పెరిమెంట్ ఇక్కడ నడుస్తూనే ఉంటుంది. తన స్థితి ఏమిటి? రాసే పని ముందుకు సాగటం లేదుకదా. ఓ చిన్న ఎక్స్‌పెరిమెంట్ మిగిలింది కదా అది మొదలుపెడదామా అనుకుంది గీత.

'గీతా...!' వినాయక్ ఎందుకో వెనక్కి వచ్చినట్లున్నాడు.. తల మాత్రం లోపలికి పెట్టి చెప్పసాగాడు. 'ఇందాకా నువ్వు పుస్తకం చదువుతున్నప్పుడు నిన్ను డిస్టర్బ్ చేయబుద్ధి కాలేదు. అందుకనే చెప్పలేదు... నీ మాగ్నటిక్ బీడ్ తీసుకుని వాడుతున్నాం... మళ్లీ నువ్వు వెతుక్కుంటావని చెబుతున్నాను...' మరునిమిషం మాయమయ్యాడు.

వినాయక్ దగ్గర ఒక్క బీడ్ కూడా ఎక్కువ కాలం నిలవదు. ఎలా పోగొట్టుకుంటాడో తెలియదు కాని గీత దగ్గర తీసుకుని అదీ పోగొడతాడు... ఇప్పుడు ఒక్కటే మిగిలింది... అది అతను వాడుతుంటే ఇక ఎక్స్‌పెరిమెంట్ సమస్యే లేదు!

చిరాకు పెరిగినా తప్పక మళ్ళీ కాయితాలు అందుకుని రాయసాగింది. పెన్ను ముందుకు పోనని మొండికేయసాగింది... దానికితోడు ఈసారి స్పెల్లింగ్‌ల గురించి కూడా సందేహాలు పెరిగాయి..

తలుపు దగ్గర శబ్దం అయ్యింది. గీత తల ఎత్తలేదు. మళ్లీ వినాయక్ వచ్చి ఏదో చెప్పాలనుకుంటున్నాడేమో..? ఆమెకి ఎందుకో యోగి గుర్తుకి వచ్చాడు. తల ఎత్తకుండా ఏకాగ్రతతో అతను రాసుకుంటూ పోయిన తీరు గుర్తుకి వచ్చింది. వచ్చింది ప్రొఫెసర్ అయినా తన ఏకాగ్రత చూసి ముచ్చట పడతాడులే అని తనకి తానే నచ్చ చెప్పుకుని 'ప్లీజ్! నేను చాలా ముఖ్యమయిన పనిలో ఉన్నాను... నన్ను డిస్టర్బ్ చేయకండి' అంది తల ఎత్తకుండా.

తలుపు మళ్లీ మూసుకుంది. వచ్చింది ఎవరో అన్న ప్రశ్నని విస్మరించి గీత రాయసాగింది... ఎందుకో తెలియదు కాని ఈసారి పెన్ను చకచకా కదిలింది... ఇంతకు మునుపు గందరగోళంగా చెప్పిన

విషయాలు ఇప్పుడు సులభగ్రాహ్యంగా కాయితంపైన రూపు దిద్దుకోసాగాయి.

గీత అలా రాస్తూనే ఉంది... మళ్లీ తలుపు తెరుచుకుంది.

గీత పంతంగా తల ఎత్తలేదు...వీసీ వచ్చినా సరే తను ఇప్పుడు లేచి నిలబడదు... వాక్య నిర్మాణం అంత బ్రహ్మాండంగా సాగుతున్న సమయంలో అటూ ఇటూ చూసి ఆ ఉరవడిని తనే ఆపటం ఎందుకు అన్నట్లు ఉండిపోయింది.

ఎవరో లోపలికి వస్తున్నారు.. దానికి తోడు కమ్మగా బ్రూ కాఫీ వాసన నాసికకి సోకింది. ఇక గీత నిగ్రహించుకోలేకపోయింది. ఎవరా అని తల ఎత్తి చూసింది.

క్యాంటీన్ కుర్రాడు...' యోగి సాబ్‌పంపిందు' అన్నాడు సంజాయిషి ఇస్తున్నట్లు.

బాగా చీకటి పడింది అని అప్పుడు గమనించింది గీత...

'అయితే ఇందాక వచ్చింది యోగి అన్న మాట !... ఎందుకు వచ్చాడో?... అతను అని తెలిసే కావాలని అతను అన్న మాటలని యథాతథంగా రిపీట్ చేశానని అనుకున్నాడేమో! ఛా..! యోగి అని తెలిసి ఉంటే ఎప్పటికీ అలా అనేదే కాదు... ఊహూ! అతను తప్పుగా భావించి ఉంటే ఇప్పుడు కాఫీ పంపించడు కదా... కాఫీ ఎందుకు పంపించినట్లో? ఐనా వేడి చల్లారేలోగా కాఫీ తాగకుండా ఈ శుష్క సందేహాలు ఎందుకు? ' అనుకుంటూ కాఫీ కప్పు అందుకుంది గీత.

కాఫీ నిజంగానే ఉత్తేజాన్నిచ్చింది. ఆ తరువాత పని ఇంకా బాగా చకచకా అయింది.

గీత డిపార్ట్‌మెంట్ బయటికి వచ్చేసరికి ఏడున్నర అయింది. ఈ సమయంలో బస్సులు సమయానికి వస్తాయా? పైగా తారకి ట్యూషన్ ఉంది అనుకుంటూ బస్ స్టాప్ వేపు నడవసాగింది గీత.

ఓ బైక్ ఆమె పక్కన ఆగింది. 'గీతగారూ! బాగా ఆలస్యం అయినట్లుంది... ఇంటి దగ్గర దింపమంటారా? ' మర్యాదగానే అడిగాడు యోగి.

'థాంక్స్... కాని మీకు శ్రమ అవుతుందేమో...' గీత మొహమాటంగా అంటూ బైక్ ఎక్కింది.

బైక్ కొద్దిదూరం వెళ్లాక యోగి అన్నాడు 'మీరు ఉపనిషత్తులు చదివారా? '

గీత ఉలిక్కిపడింది. తను వినాయక్‌తో నడిపిన సంభాషణ అతనికి ఎలా తెలిసింది? నవ్వేసి 'అబ్బే! అంత పెద్దపెద్దవి చదివేంత ఓపిక నాకు లేదండి. ఏవో అక్కడక్కడ కొన్ని ముక్కలు తెలుసు...' అంది.

గీత దారి చెబుతుంటే అతను మలుపులు తిప్పుతూ చివరికి తార ఇంటి ముందు ఆపాడు.

'థాంక్స్ యోగి! మీ వల్ల చాలా టైమ్ కలిసి వచ్చింది' అంది గీత గేట్ తీస్తూ.

'ఓకే! గుడ్‌నైట్...' అన్నాడు యోగి బైక్ స్టార్ట్ చేయకుండా.

జీరో వచ్చి మెత్తగా మొరుగుతూ కాళ్ల చుట్టూ తిరగసాగింది. 'ఏయ్! జీరో...' అంటూ పలకరించింది గీత. శబ్దం చేసుకుంటూ బైక్ కదిలింది.

★ ★ ★

ఆ తరువాత ఓ సాయంకాలం గీత బస్ స్టాప్‌లో నిలబడి ఉంది బైక్ మీద వెడుతున్న యోగి ఆమెను చూసి మర్యాద కోసం అన్నట్లు నవ్వాడు.

గీత మాత్రం 'హలో!...' అంది ఉత్సాహంగా. ఇంటి దగ్గర దింపనా అని అతను అడుగుతాడేమో అని గీత ఎదురు చూసింది. యోగికి ఆ ఉద్దేశం ఉన్నట్లు లేదు. ఏదో పని ఉన్నట్లు ఇబ్బందికర భావాన్ని మొహంలో ప్రకటించాడు. అది గమనించి గీతకి పట్టుదల పెరిగింది. బస్





వచ్చినా ఎక్కకుండా అతనితో కబుర్లు చెప్ప సాగింది. బస్ కదలగానే 'యోగి! బస్‌లో నుంచునే ఓపిక లేదు. ఇఫ్ యూ డోంట్ మైండ్...కుడ్ యు గివ్ మి లిఫ్ట్ ?'

యోగి చూపు ఎందుకో అక్కడ ఆగిన ఆటో వంక కదిలింది. ఏమనుకున్నాడో కాని 'రండి' అన్నాడు. ఈసారి తార ఇల్లు వచ్చేవరకు అతడు మౌనంగా ఉన్నాడు.

సమ్‌థింగ్ ఈజ్ రాంగ్ అన్న భావన గీతని ముంచెత్తింది... ఏమయింది ఇత నికి? ఎందుకిలా ముంగిలా మారాడు?

ఆ మర్నాడు గీత పని చేసుకుంటుంటే వినాయక్ వచ్చాడు. 'గీతా! ఇందాక యోగి కనబడ్డాడు. ఈ కవరు నీకు ఇమ్మన్నాడు..'

'ప్రేమ లేఖా..?' గీత గుండె లయ తప్పింది. ఊపిరి ఆగినట్లయింది. ఉక్కిరి బిక్కిరి అవుతూ కవర్ అందుకుంది.

ఇంకా చేయాల్సిన డ్యూటీ ఏదో మిగిలి నట్లు వినాయక్ నిలబడ్డాడు. 'ప్లీజ్ వినా యక్. వెళ్లిపో... యోగి ఏం రాశాడో అర్జెంట్‌గా చదవాలి...' అనుకుంది గీత.

కదిలే ఉద్దేశం లేనట్లు వినాయక్ అన్నాడు 'యోగితో సమస్య ఏమిటంటే... అతనికి మనం బాకీ ఉన్న లెవల్‌లో డబ్బులు అడుగుతాడు. నాతో సమస్య ఏమిటంటే ఇవ్వను అని అనకుండా ప్రతి సారీ ఇస్తాను...'

'నాకు వీలయితే యోగి నీకు ఇవ్వాల్సిన మొత్తం నేను ఇస్తాను కాని ప్లీజ్ గో ఎవే...' గీత మనసులోనే అరిచింది.

'నాకు తెలిసినంత వరకూ యోగి అంత తెలివి అయినవాళ్లు ఎవరూ లేరు.. బట్ హీ ఈజ్ హోప్‌లెస్...'

'నువ్వెంత హోప్‌లెస్ కేసో నీకేం తెలుసు బాబూ... ఇంకా ఎందుకు నుంచు న్నావు?' లోపల జరుగుతున్న ఘర్షణ అతనికి తెలియకుండా ఉండాలని గీత మొహంపైన నవ్వుని ఎక్కువ చేసింది.

'సివిల్స్ రాస్తే తప్పకుండా సెలక్ట్ అవు తాడు కాని గురుడికి ఆ ఉద్దేశం అస్సలు లేదు. నిజంగా నెంబర్ వన్ ఫూల్'.

'దిసీజ్ టూ మచ్ వినాయక్..!' అను కుంటూ గీత టక్కున లేచింది. 'వినా యక్! నాకు అర్జెంట్ పని ఉంది. బయ టికెళ్తున్నాను.. నేను రావటానికి పావు గంట పట్టచ్చు'

'రెండు గంటల లోపల అయితే నో ప్రాబ్లెమ్. నేను ఉంటాను...' వినాయక్ అన్నాడు.

ఏమో చెప్పలేను...యోగి రాసిన ఉత్తరం బట్టి ఉంటుంది మరీ ఎక్కువగా నచ్చేస్తే అరరోజు వరకూ ఈ డిపార్ట్ మెంట్ మొహం చూడను...' అనుకుంది గీత కళ్లు తెరిచి కలలు కంటూ. 'చెప్పలేను వినాయక్! ఎప్పటికయినా వస్తాను... సో... ఏమనుకోకుండా ఎంత సేపయినా ఉండు... సరేనా?'

కారిడార్‌లోకి అడుగుపెట్టగానే అటూ ఇటూ చూసి కవర్‌ని గుండెకి హత్తు కుంది. ఇప్పుడు ఈ కవర్ విప్పి లోపల ఉన్న ఉత్తరం ఎక్కడ చదవాలి? గీత మెద డులో ఆలోచనలు ఉరకలు వేశాయి. ఈ డిపార్ట్‌మెంట్ మొత్తంలో ఎక్కడా ప్రైవసీ లేదు, ప్రైవసీ దొరికినా ఇలాంటివి చదివేం దుకు బాగుండవు. క్యాంటీన్? వద్దు టూ మచ్ క్రౌడ్ అండ్ టూ మచ్ నాయిస్ లైబ్రరీ? ... ఇప్పుడు అన్ని మెట్లు ఎక్కే ఓపిక లేదు... డిపార్ట్‌మెంట్ వెనుక ఉన్న ప్లేగ్రౌండ్...? దూరం నుంచి ఎవరు చూసినా దొరికిపోతాను... వద్దు... మరి ఏం చేయాలి..?

తటిల్లున ఆలోచన మెరిసింది. లోపలికి వెళ్లింది.

'ఓ గీతా! అప్పుడే వచ్చేశావా?' అన్నాడు వినాయక్.

'నీ మొహం...' అనుకుంది గీత. 'ఇంకా

యూనిట్ ఒక్కింటికి Rs. 1000/- లకే

# ఫిక్స్‌డ్ సిరామిక్ దంతాలు అమర్చబడును




**సిరామిక్ దంతాల కొరకు (Per Unit)
రూ.4,000/-, రూ.3,000/-, రూ.2,000/-
లేదా రూ. 1,500/- చెల్లిస్తున్నారా?
అవసరం లేదు కేవలం రూ. 1,000/- లకే
అంతర్జాతీయ ప్రమాణాలతో కూడిన
ఫిక్స్‌డ్ సిరామెక్ దంతాలు అమర్చబడును.
ఇంత తక్కువ ధర అయితే తక్కువ క్వాలిటీ
అనే అనుమానం రావటం సహజమే!
సాధారణంగా ల్యాబ్ ఛార్జస్ ముంబాయి, ఢిల్లీ
వంటి నగరాల్లో సైతం సుమారు రూ. 500/-
నుండి రూ. 700/- వరకు వుంటాయి.**

గత 5 సం॥లుగా విజయవాడ, హైదరాబాద్, విశాఖపట్నం, నెల్లూరు, వరంగల్, ఒంగోలు, తిరుపతి వంటి నగరాలలోని ప్రముఖ దంత వైద్యులెందరికో మేము మా సొంత ల్యాబ్‌లో కేవలం రూ. 600/-లకే (ల్యాబ్ చార్జస్) VITA (జర్మని) సిరామెక్ మెటీరియల్‌తో సిరామిక్ దంతాలను తయారుచేసి అందిస్తున్నాము. ఇప్పడు నేరుగా పేషెంట్‌కే ఈ బెనిఫిట్ అందించే విధంగా కేవలం రూ. 1000/- లకే అత్యుత్తమ నాణ్యతా ప్రమాణాలతో విజయవాడలోని మా దంత వైద్యశాలలో ఈ అవకాశం కల్పించబడినది.

## రూ. 1000/-లకే వేరే వారు సైతం అందించవచ్చు! కాని ధరతో పాటు నాణ్యతా ప్రమాణాలను సరిచూసుకోండి:

- ☞ M.D.S. Prosthodontist (కట్టుడు పళ్ల ప్రత్యేక వైద్యనిపుణుల)చే చికిత్స
- ☞ రబ్బరు మెటీరియల్‌తో కొలతలు, టెంపరరీ దంతాలు అమర్చుట,

# శ్రీ కృష్ణ డెంటల్ కేర్

షణ్ముఖ కాంప్లెక్స్, విజయా టాకీస్ ఎదురుగా, ఏలూరురోడ్,
విజయవాడ. ఫోన్: 0866-6645454



వెళ్లలేదు బాబూ...' అంది పర్సు అందుకుని గిరుక్కున వెనక్కి తిరుగుతూ.

గబగబా నడుస్తూ బస్‌స్టాప్ చేరింది. అదృష్టవశాత్తు అక్కడో ఆటో ఉంది. మాట్లాడకుండా ఎక్కి కూర్చుంది.

ఇంకోసారి కవర్‌ని గుండెలకి హత్తుకుంది గీత. ఆటో వేగంగా వెడుతున్నది. చల్లటి గాలి గిలిగింతలు పెడుతూ త్వరగా కవరు విప్పి చూడరాదా అని బతిమిలాడుతున్నది. మెల్లగా కవరు చింపి లోపల ఉన్న కాయితం బయటికి తీసింది గీత.

ప్రేమలేఖ కాదు... అది పది రూపాయల నోట్...

అగ్ని పర్వతపు సెగ ఛెళ్లున మొహాన కొట్టినట్లయింది గీతకి. ఆరోజు చేసిన అప్పు తీర్చేయాలనా యోగి ఆలోచన?

'ఆటో ఆపు...' గీత అరిచింది.

రోషమో, ఉక్రోషమో, కోపమో, మోసం జరిగిందన్న భావమో ఆమెని నిలువెల్లా ముంచెత్తాయి. ఎంత ఊహించుకుంది..? ఎంతటి డిజప్పాయింట్‌మెంట్?!

సడెన్ బ్రేక్‌తో ఆటో ఆగింది. గీత చేతిలో ఉన్న నోట్ అందివ్వబోయి ఆగి పర్సులోంచి ఇంకో పది రూపాయల నోట్ తీసి అది ఇచ్చింది.

ఆలోచిస్తూ డిపార్ట్‌మెంట్ వేపు నడవసాగింది. అతనికి సోషల్ టెంపర్ లేదని, అన్నీ తెలిసి కూడా ఉపయోగం లేని పనులు చేస్తాడని అందరూ రకరకాల కామెంట్స్ చేస్తున్నా పట్టించుకోకుండా అతనికి దగ్గరవ్వాలని ప్రయత్నిస్తుంటే ఆ మాత్రం అర్థం చేసుకోలేడా...? పది రూపాయలు వెనక్కి ఇస్తాడా...? ఏమనుకుంటున్నాడు అతను? గీత నడక ఆగింది. అవునూ.. అతను తనకి ఓ బ్రూ కాఫీ ఇప్పించాడు కదా! ఆ డబ్బులు తను కూడా ఇవ్వాలి కదా? ఇప్పుడే ఇచ్చేస్తాను... వన్స్ ఫరాల్ బాకీ తీర్చేసుకుంటే సరిపోతుంది. ఆమె వేగంగా నడవసాగింది.

టీ కొట్టు దగ్గర అదృష్టవశాత్తు ఎక్కువ మంది లేరు. కుర్రాడు ఆమెని చూసి నవ్వాడు. 'యోగిసాబ్ ఎక్కడ ఉన్నాడో తెలుసా?' గీత అడిగింది.

'ఇప్పుడే ఆ దిక్కున వెడుతున్నాడు...'

'బ్రూ కాఫీ ఎంత?..' గీత అడిగింది. 'దానికి ఎన్ని సిగరెట్లు వస్తాయి?'

బార్టర్ పద్ధతి గురించి తెలియని కుర్రాడు బుర్ర గోక్కున్నాడు. 'నాలుగు...' అన్నాడు.

గీత డబ్బులు ఇచ్చింది. 'ఆ నాలుగు సిగరెట్లు అతనికి ఇచ్చేసి రా... బ్రూ కాఫీ బాకీ అని చెప్పు..'

కుర్రాడు పరుగున వెళ్లాడు. అదే పరుగున వెనక్కి వచ్చాడు 'సార్ దగ్గర అగ్గిపెట్టె లేదుట...'

గీత మొహం వెలిగింది. ఇంకో నోట్ ఇచ్చింది. 'పది అగ్గిపెట్టెలు తీసుకువెళ్లు. డిడి కాలనీకి రెండుసార్ల కిరాయి అని చెప్పు'




**బ్రూ** కాఫీ బాకీ, తార ఇంటిదగ్గర డ్రాప్ చేసినందుకు కిరాయి తీర్చేసినా గీత కసి తీరలేదు. ఏదన్నా చేయాలి... అదే ఊపున డిపార్ట్‌మెంట్‌కి వెళ్లింది. లంచ్‌కి వెడుతున్న ప్రొఫెసర్ కారిడార్‌లో ఆపాడు.

'గీతా! ఒక్క నిముషం...'

గీత తెగింపు పెరిగింది. 'సారీ సర్!

విపరీతమయిన తలనెప్పిగా ఉంది... జ్వరం కూడా ఉందని అనుమానం... జలుబు, దగ్గు కూడా ఉన్నాయి. ఇంటికి వెళ్లిపోతాను..'

ఆయన చిత్రంగా చూశాడు. భుజాలు ఎగరవేసి 'ఓకే! దట్సాల్రయిట్' అన్నాడు.

టకటకా నడుచుకుంటూ లోపలికి వెళ్లింది. 'భలే తొందరగా వచ్చావే!' అన్నాడు వినాయక్.

'నేను రాలేదు' అంది గీత ముక్తసరిగా.

'నువ్వు రాలేదా? అంటే...?' అయోమ యంగా అడిగాడు వినాయక్.

'వెళ్లిపోతున్నాను... ఎందుకంటే నాకు జలుబు, దగ్గు, తలనెప్పి జ్వరం వచ్చాయి...'

'టూ బ్యాడ్!' మళ్లీ స్పోర్ట్స్ స్టార్ చదవటంలో లీనమయ్యాడు వినాయక్.

'అది కాదు టూ బ్యాడ్!' గీత ఆవేశంగా అంది.

'వర్క్ బెంచ్ ఎలా పెట్టావో చూడు... నిన్న చేసిన ఎక్స్‌పెరి మెంట్ తాలుకా ఆనవాళ్లు ఇంకా ఈ మధ్యాహ్నాంకి కూడా కనబ డాలా? తీసి క్లీన్ చెయ్యి...'

'గీతా! ఏమయింది నీకు...?' సచిన్ సెంచరీ గురించి చదువు తుంటే ఆ నస ఏమిటి?'

'ముందు ఆ పుస్తకం పారెయ్...' గీత గద్దించింది.

ఆ స్వరంలో మార్పుని గమనించిన వెంటనే ఆ పనిచేసి నుంచున్నాడు.

'నువ్వు అసలు ఎమ్మెసీ కాపీకొట్టి పాస య్యావా అని నాకు అనుమానం వస్తూ ఉంటుంది...'

ఇంకో టాపిక్‌లోకి మారితేనే కాని వినా యక్‌ని ఘాటుగా చీవాట్లు వేయలేనట్లు గీత అంది.

'లిథియమ్‌ని ఎలా హాండిల్ చేయాలో తెలియక చేయి కాల్చుకున్నావు... ఎసయి లేషన్ రియాక్షన్‌ని నీట్‌గా ఎలా చేయాలో తెలియదు... చివరికి బీకర్లు కూడా టపటపా పగలగొడతావు... 'ఎక్ లడ్‌కి కో దేఖాతో ఐసా హువా' అని పాడుకుంటూ కళ్లు మూసుకుని రియాక్షన్ ఫ్లాస్కులు కడుగుతూ మాగ్నటిక్ బీడ్స్ పోగొడతావు... అసలు నువ్వు బాగుపడ తావా...? ఈ యన్‌యమ్‌ఆర్ బాగుందా గీతా అని అడగటం తెలుసుకాని ఏమన్నా నేర్చుకుందామని ఉందా నీకు?'

**'ఎక్ లడ్‌కి కో దేఖాతో ఐసా హువా' అని పాడుకుంటూ కళ్లు మూసుకుని రియాక్షన్ ఫ్లాస్కులు కడుగుతూ మాగ్నటిక్ బీడ్స్ పోగొడతావు...**

వినాయక్ బిత్తరపోయాడు.

'ఈ మధ్యాహ్నాం అంతా బుద్ధిగా మొత్తం రూమ్ అంతా సర్దిపెట్టు...'

'కాని గీతా... సర్ లెక్చర్‌కి వెళ్ల మన్నారు...' వినాయక్ మెల్లగా అన్నాడు.

'లెక్చరా...? ఏ లెక్చరు?'

'అవును ఎవరో నోబెల్ లారెట్‌ట...'

'ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ బయాల జీలో...'

నోబెల్ లారెట్లు లెక్చర్లు ఇచ్చినా, డ్యాన్స్ ఆడినా పట్టించు కునే ఓపిక నాకు లేదు అనుకుంది గీత.

వినాయక్ ఏదో వెతుకుతున్నాడు.

చివరికి ఓ కార్డ్ తీసి గీతకి ఇచ్చాడు.

'ఇది మన ప్రొఫెసర్‌కి ఇన్విటేషనట.'

'మనల్ని వెళ్లమని చెప్పాడు.'

కార్డ్ చదివింది గీత. వెంటనే గుటకలు మింగింది.

ఉపన్యాసం ఇచ్చే ఆయన బయోకె మిస్ట్... మాలిక్యులార్ బయాలజీలో ఆయన చేసిన పరిశోధనలు కొత్త విషయా లని ఆవిష్కరించాయి... అంతేకాదు

ఆయన అమెరికన్ ప్రెసిడెంట్‌ని ఖాతరు చేయకుండా నిష్కర్షగా తన అభిప్రాయాలు చెప్పిన మానవతావాది...

ఆయన లెక్చర్ మిస్ అయితే ఎలా..? యోగిమీద అలిగి ఈ అవకాశం పోగొట్టుకోవటం మూర్ఖత్వం. 'నేనూ వస్తాను...' అంది మెల్లగా.

'మరి నీ జలుబు, దగ్గు, జ్వరం, తలనొప్పి?' ఆశ్చర్యంగా అడిగాడు వినాయక్.

'గాయబ్!' మెత్తగా నవ్వింది గీత. తనేనా ఇలా నవ్వింది... ఈ స్థితిలో ఎలా నవ్వగలిగింది? మనసులోనే నిట్టూర్చింది.

వినాయక్ కూడా నవ్వాడు. 'నీ కోపం కూడా పోయినట్లుంది... అమ్మయ్యా! అదరగొట్టేశావు అనుకో... అయినా ఎందుకంత కోపం..? ఎవరిమీద?'

ఎర్రగా చూసింది గీత. 'తెలుసుకోవటం అంత అవసరమా?'

'అవసరమే...' అని పైకి అనలేదు వినాయక్... లోపలే అనుకున్నాడు.

'ఇక వెడదామా?' గీత అంది.

'అప్పుడే...? ఇంకా గంటపైగా ఉంది...'

'నీకు బుర్ర లేదు... ముందుగా వెళ్లకపోతే సీట్ దొరకదు...'

గీత ఊహ కరక్టే... వాళ్లు వెళ్లేసరికి ఆడిటోరియమ్ దాదాపుగా నిండిపోయింది.

నిర్వాహకులు అది ముందుగానే ఊహించినట్లున్నారు... బయట షామియానాలు వేసి క్లోజ్‌డ్ సర్క్యూట్ టీవీలు ఏర్పాటు చేశారు.

యోగి గురించి పూర్తిగా మరిచిపోయి ఆ లెక్చర్ విన్నది గీత. ఈ లెక్చర్‌కి తను చేసే పరిశోధనలకి ఏ విధమయిన సంబంధం లేదుకాని ఇలాంటి మహత్తరమయిన వ్యక్తి చెబుతున్న విషయాలు వింటుంటే ఏదో అనిర్వచనీయమైన నూతనోత్సాహం కలుగుతుంది.

పనిలో మమేకమయిపోవటానికి కావలసిన స్ఫూర్తి లభిస్తుంది.

ఇంత గొప్ప అనుభవం ఇచ్చిన అనుభూతి తరువాత యోగి వాపసు ఇచ్చిన పది గురించి తల బద్దలు కొట్టుకోవడం మూర్ఖత్వం అనిపిస్తున్నది.

లెక్చర్ అయ్యాక ప్రశ్నలు...

**ప్రొఫెసర్! జీవం అంటే సంక్లిష్టమయిన బయోకెమికల్ ప్రాసెస్ అని అన్నారు కదా... అయితే కృత్రిమంగా జీవిని ఎందుకు తయారు చేయలేకపోతున్నాం?'**

'ప్రొఫెసర్! జీవం అంటే సంక్లిష్టమైన బయోకెమికల్ ప్రాసెస్ అని అన్నారు కదా... అయితే కృత్రిమంగా జీవిని ఎందుకు తయారు చేయలేకపోతున్నాం?'

ఆయన నవ్వాడు. 'నా కారు గ్యారేజీలో నేను స్పేస్ షటిల్‌ని నిర్మించలేదు... అంతమాత్రాన స్పేస్ షటిల్ నిర్మాణం జరగటం లేదని అనలేను కదా... ప్రోటీన్లు రకరకాలుగా మడతలు పడతాయి. ఆ మడతల అమరికవల్ల వాటి స్వభావాలు, లక్షణాలు మారుతాయి... త్రీ డైమెన్షన్‌లో ఆ మడతల గురించి ప్రస్తుతం మన అవగాహన చాలా ప్రాథమిక దశలో ఉంది... మెల్లగానే కాని నిశ్చయంగా అది పెరుగుతుంది...' ఆయన జవాబు ఐదు నిముషాలపాటు కొనసాగింది.

తరువాతి ప్రశ్న ఆయన లెక్చర్‌లో అలా స్పృశించిన అంశం పైన.

'మానవుడి మెదడు దాదాపు ఒకటిన్నర కేజీలు ఉంటుంది. ఏప్స్‌లో కేజీకన్నా తక్కువే ఉంటుంది.

ఎవల్యూషన్ జరిగే ఉంటే మెదడు సైజ్ క్రమంగా పెరుగుతూ వచ్చి ఆ దాఖలాలు మనకి దొరికేవి కదా?'

ఈసారి ఆయన చాలా పెద్ద వివరణ ఇచ్చాడు. ఇంకా ఏ విధమయిన అధ్యయనాల వల్ల ఆ అంశాలు తేటతెల్లమవుతాయో విశదీకరించాడు.

ఇంకా ఇంకా నేర్చుకోవాలి అన్న తపన, జీవితాంతం అన్వేషణలో అలుపెరగక పయనం సాగించాలన్న దృఢ సంకల్పం ప్రతి జవాబులో ప్రతిఫలించింది అనుకుంది గీత.

ఆడిటోరియమ్ బయటికి వచ్చాక కూడా ఒక రకమయిన యుఫోరియాలో ఉండిపోయింది గీత.

అయితే అది బుడగ లాంటిదని వినాయక్ నిరూపించాడు. 'అరే! అక్కడ యోగి ఉన్నాడు... యోగీ, ఇటు... ఇటు...' చేయి ఊపుతూ పిలిచాడు.

దబ్బున ఈ లోకంలోకి పడింది గీత.

ఈయనగారు ఇక్కడికి కూడా వచ్చాడా...?

జర్నలిజం చదివే వాడికి సైన్స్ లెక్చర్లు ఎందుకు...?

'హలో!' అంటూ ఇద్దరినీ పలకరించాడు యోగి.

'ఏమిటి పాంట్ జేబులు అలా ఉబ్బాయి? లెక్చర్‌కి వస్తూ కారప్పూస గానీ, పల్లీలు గానీ తెచ్చుకున్నావా?' వినాయక్ అడిగాడు.

'కారప్పూస కాదు అగ్గిపెట్టెలు...' గీత మొహంలోకి చూస్తూ అన్నాడు యోగి.

తను కొని పంపించిన పది అగ్గిపెట్టెలూ జేబులో పెట్టుకుని తిరగటం ఏమిటి? ఇతనికి పిచ్చిగాని ఉందా...? గీత మొహం తిప్పుకుంది.

'అన్ని అగ్గిపెట్టెలు ఎందుకు?' వినాయక్ అడిగాడు.

'పొద్దున సిగరెట్లు ఉన్నాయి. మ్యాచ్ బాక్స్ లేదు... ఇప్పుడు అగ్గిపుల్లలు ఉన్నాయి... సిగరెట్లు లేవు...' యోగి ఆత్రేయలాగా నవ్వాడు.

'నా ప్రశ్నకి జవాబు చెప్పలేదు... అన్ని పెట్టెలు ఎందుకు?' వినాయక్ వదలలేదు.

గీత కంగారుపడింది.

ఇప్పుడు యోగి సత్యహరిశ్చంద్రుడిలాగా నిజం చెప్పేస్తే వినాయక్ ముందు పరువు పోతుంది. యోగి ఏమంటాడు?

'జవాబు చెప్పవా? పోనీలే... నేను సిగరెట్టు తాగను కాని బున్సెన్ బర్నర్ వెలిగించుకోవటానికి పనికి వస్తుంది... నాకు ఓ పెట్టె ఇవ్వు... నీ జేబు బరువు తగ్గుతుంది...'

'ఇవ్వను... నేను ఇలాగే తిరిగితే నీకు ఏమన్నా అభ్యంతరమా?'

'మొదటి ముక్క వినాయక్‌తో అన్నాడు... అందులో సందేహం లేదు... ఆ తరువాతది తనని ఉద్దేశించి అన్నాడా?' గీత ఆలోచనలో పడింది.

'ఆయనని అడిగిన మొదటి ప్రశ్నలు గుర్తున్నాయా?' యోగి అడిగాడు.

'ఈ ప్రశ్న ఎవరిని ఉద్దేశించి అడిగాడో తెలియదు కాని నేను మాత్రం నోరు విప్పను...' అనుకుంది గీత.

'గుర్తున్నాయి...' వినాయక్ అన్నాడు. 'కృత్రిమంగా జీవిని సృష్టించటం గురించి, ఎవల్యూషన్ గురించి కదూ...'

'అవును... అవి ఎందుకు అడిగారో అర్థమయిందా?'

వినాయక్ నుదురు చిట్లించాడు. 'అదేం సందేహం యోగి? ఎందుకు అడుగుతారు? సందేహాలు తీర్చుకోవటానికి !'

'ఆ సందేహాలు ఊరికే పుట్టలేదు బాబూ...' యోగి నవ్వాడు. 'ఈ విశ్వం ఉనికికి భగవంతుడు అనేవాడు ఉండటానికి సంబంధమే లేదని కచ్చితంగా ప్రకటించిన నాస్తికుడు ఆయన... ప్రశ్నలు అడిగినవారు సైన్స్ చేస్తూనే దేవుడినీ, స్వామీజీలని నమ్మేవాళ్లు...'





## మెదడు ఉత్సాహంగా ఉండాలంటే...

ఎంత వయసొచ్చినా కొంతమంది పైకి ఆరోగ్యవంతులుగానే కన్పిస్తుంటారు. ఇందుకు మంచి ఆహారం, వ్యాయామం, మంచి నిద్ర, వాకింగ్ కారణం. ప్రతిరోజూ ఒకేదారిలో, గ్రౌండులో నడుస్తుంటారు. ఇది ఆరోగ్యానికి మంచిది కావచ్చు కానీ, మెదడులో ఉండే 'గ్రే కణాలకు' మంచిది కాదని చెబుతున్నారు జాన్ హాప్‌కిన్స్ యూనివర్సిటీ నిపుణులు.

పరిశోధనల వలన ప్రతిరోజూ ఒకే రకమైన వ్యాయామం, ఒకే ప్రదేశంలో వాకింగ్ చేసే వాళ్లలో 56% వరకూ మెదడు వ్యాధులు వస్తున్నట్లు కనుగొన్నారు. మెదడులో ఉండే గ్రే కణాలు క్రమంగా చురుకుదనం కోల్పోతున్నట్లు కనుగొన్నారు.



ఒకే రకమైన వ్యాయామం, ఒకే రకమైన ఆలోచనలు, ఒకే విధమైన ఆహారం కాకుండా "మార్పు" వల్ల మెదడులో ఉండే అన్ని భాగాలూ చురుకుగా పని చేస్తాయి.

వయసు పైబడుతున్న కొద్దీ ఆరోగ్యం క్షీణించకుండా ఉండాలంటే ఆహ్లాదాన్నిచ్చే ప్రదేశాల్లో తిరుగుతూ, భిన్నమైన ఆటలు ఆడటం, వంటికి సరిపడే మంచి ఆహారం తీసుకోవటం, అనవసరపు ఆలోచనలను వదిలెయ్యటం చేస్తే మెదడు చైతన్యవంతంగా పనిచేస్తుందని శాస్త్రవేత్త 'లైకెట్ సాస్' అంటున్నారు.

గీత కళ్లు పెద్దవయ్యాయి... ఆ కోణంలో ఆమె ఆలోచించలేదు.

జీవం పుట్టటానికి ఓ అదృశ్య శక్తి అవసరం కదా అని, ఈ ప్రాణికోటి అంతా దేవదేవుడి సృష్టేకాని యాదృచ్ఛికంగా సంభవించిన ఎవల్యూషన్ కాదుకదా అని సవాలు చేస్తూ అడిగిన ప్రశ్నలవి. యోగి చాలా బాగా విశ్లేషిస్తాడు అనుకుంది గీత. సైన్స్ స్టూడెంట్ కాకపోయినా యోగి తమకన్నా బాగా అర్థం చేసుకున్నాడే! ఆమె మెచ్చుకోలుగా అతని వంక చూసింది.

జేబులో అగ్గిపెట్టెలు కనబడగానే ఆమె మొహంలో తిరిగి చిరాకు ప్రత్యక్షమైంది.

వాళ్లు బస్‌స్టాప్ వేపు వెడుతుంటే దారిలో ఇద్దరు ముగ్గురు యోగిని అగ్గిపెట్టెల గురించే అడిగారు.

గీతకి చాలా అసహనంగా ఉంది.

యోగి తిక్కన్నర అని నిజంగానే రుజువు చేసుకుంటున్నాడు... ఆ అగ్గిపెట్టె లని స్పాన్సర్ చేసింది తనే అని బయట పడితే మాత్రం సిగ్గుచేటుగా ఉంటుంది. ఏం చేయాలి?

ఇంటికి వెళ్లినా ఆ ఆలోచన వెంటాడుతూనే ఉంది.

'చపాతీలు కాలుస్తానని స్టవ్ వెలిగించకుండా ఆ అగ్గిపెట్టె చేతిలో ఉంచుకుని చూస్తూ నిలబడిపోయావు ఏమిటి...?' అని తల్లి గదమాయిస్తే ఈ లోకంలోకి వచ్చింది. 'ఛా! ఈ యోగి ఇలా సతాయిస్తున్నాడేమిటి...? గొప్ప లెక్చర్ విన్న అనుభూతిని కూడా మాయం చేసేశాడు...' అస్థిమితంగా అనుకుంది.

★ ★ ★

మర్నాడు లంచ్ తరువాత వినాయక్ నవ్వుకుంటూ వచ్చాడు.

'ఎందుకా నవ్వు?' గీత మామూలుగా అడిగింది.

'యోగి చాలా చిత్రంగా బిహేవ్ చేస్తున్నాడు... జేబుల్లో ఇంకా అగ్గిపెట్టెలు ఉంచుకునే తిరుగుతున్నాడు... ఎందుకు అంటే నోరు విప్పడు...' వినాయక్ నవ్వు స్థాయి పెరిగింది. 'మొత్తం కాంపస్‌లో అందరూ దాని గురించే మాట్లాడుకుంటున్నారు...'

గీత మొహం ఎర్రబడింది.

చూస్తుంటే యోగి తన పరువు తీసేటట్లు ఉన్నాడు... టీ కొట్టు కుర్రాడికి అసలు సంగతి తెలుసు... వాడు ఆ రహస్యం చెప్పేస్తే? ! గీత ఊపిరి బిగపట్టింది. 'దానికి నవ్వుతావా...? నీకు బుద్ధి లేదు వినాయక్...' విసుగ్గా అంది. యోగిని ఎలా కంట్రోలు చేయాలి?

'నీకు నవ్వు రావటంలేదా?' వినాయక్ అనుమానంగా అడిగాడు.

'లేదు. పైగా అస్తమానం ఆ అగ్గిపెట్టెల గురించి వినాలంటే విసుగ్గా ఉంది...'

'అయితే నాకు తెలిసిపోయింది...' వినాయక్ అన్నాడు.

గీత గుండె ఆగిపోయింది. గుటకలు మింగుతూ వినాయక్‌నే చూస్తుండిపోయింది.

'నీకు దగ్గు, జలుబు, జ్వరం, తలనెప్పి... ఇవేమీ లేవు కానీ బీపీ ఉంది... అందుకనే చాలా చిత్రంగా బిహేవ్ చేస్తున్నావు... ఓసారి బీపీ చెక్ చేసుకో...' వినాయక్ అన్నాడు.

'నాకేం బీపీ లేదు...' గట్టిగా అరిచింది గీత. అంతలో తమాయించుకుని 'సారీ..! సారీ..!' అంది.

'ఇప్పుడు యోగికి నిక్‌నేమ్ ఏమిటో తెలుసా... హ్యూమన్ బాంబ్!' అన్నాడు వినాయక్.

'హ్యూమన్ బాంబా?' అర్థం కాలేదు అన్నట్లు అడిగింది గీత.

'...జేబులో అన్నేసి పేలుడు పదార్థాలు పెట్టుకుని తిరుగుతున్నాడు కదా... అందుకని... బాగుంది కదూ హ్యూమన్ బాంబ్...' వినాయక్ నవ్వుతున్నా గీత అభ్యంతరం చెప్పలేని అశక్తురాలయింది. ఏ విషయంలోనయినా బాంబ్‌లాగా రియాక్ట్ అవుతాడు కదా. అందుకని కూడా ఈ నిక్‌నేమ్ చాలా ఆప్ట్‌గా ఉంది కదూ?'

పళ్లు పటపటా కొరుకుతూ, అవును అన్నట్లు తల ఊపింది గీత.

★ ★ ★

యోగి ప్లస్ అగ్గిపెట్టెల సమస్యని ఎలా ఎదుర్కోవాలో ఆ మర్నాటికి కాని గీతకి తోచలేదు. అయితే అలా చేయాలంటే యోగి ఒంటరిగా దొరకాలి. రెండు రోజుల తరువాత అది సంభవించింది.

ఏం మాట్లాడాలో ఇంకోసారి మనసులో మననం చేసుకుంది గీత. 'యోగీ! అయిదు నిముషాలు స్పేర్ చేస్తారా?'

యోగి తల ఊపాడు. జేబులో ఉన్న అగ్గిపెట్టెలపైన శబ్దం వచ్చేలాగా సన్నగా కొడుతూ ఆమె పక్కన నిలబడ్డాడు.

ఇద్దరూ మౌనంగా బస్ ఎక్కారు. 'యోగీ! ఇలా అగ్గిరాముడిలాగా తిరగటంలో మీ ఉద్దేశం ఏమిటి?' గీత బస్సు కదలగానే అడిగింది.

'అవి ఎందుకు పంపించారో మీరు ముందుగా చెప్పాలేమో కదా...' యోగి కూల్‌గా అన్నాడు.

'నాకు చాలా కోపం వచ్చింది. అందుకని బాకీ తీర్చుకోవాలని అనుకున్నాను. అయినా అలా బాకీ తీర్చాలని ముందుగా అనుకుంది మీరు... అలా ఎందుకు చేశారు?'

'ఆ ప్రశ్న ఆనాడే అడిగి ఉంటే ఇలా అగ్గిపెట్టెలని మోసే శ్రమ నాకు తప్పేది కదా?' యోగి సన్నగా నవ్వాడు.





'అవును... ఆ పది రూపాయలు కవరులో ఎందుకు పంపావు అని సింపుల్‌గా అడిగేస్తే సరిపోయేది కదా?' గీత తల తిప్పి కిటికీలోంచి బయటికి చూస్తూ అడిగింది. 'అయితే ఇప్పుడు చెప్పండి. ఎందుకు చేశారు అలా?'

'సాధారణంగా అప్పులు అంత త్వరగా తీర్చేయను.. కాని నా స్నేహితులు అంతా మామూలు వాళ్లు... ఐకెన్ నెవర్ బి కంఫర్టబుల్ విత్ రిచ్ పీపుల్.'

'రిచ్ పీపులా...? ఎవరి గురించి మాట్లాడుతున్నారు?' గీత అయోమయంగా అడిగింది.

ఓ! ఏం సింప్లిసిటి అనుకున్నాడు యోగి. 'పోష్ లొకాలిటీ బంగళాలో మధ్య తరగతి వాళ్లు ఉండరు కదా?'

అర నిముషం తరువాత గీతకి అర్థం అయింది. తార ఇల్లు చూసి తమ ఇల్లు అనుకున్నాడా? తను ధనవంతురాలు కాదు అని తెలిస్తే చేరువయ్యేందుకు ఇతనికి అభ్యంతరం ఉండదేమో... నోరు విప్పబోయి సంబాళించుకుంది. పొరపడి తద్వారా తనని ఎంత వేదనకి గురిచేశాడు?... అగ్గిపెట్టెలు జేబులో ఉంచుకుని తనని ఎంత సతాయించాడు? ఇతన్ని ఊరికే వదలకూడదు... కావాలని బరువుగా నిట్టూర్చింది గీత. 'మెరిసేదంతా మేలిమి కాదు యోగి!... పైన పటారం లోన లొటారం అన్న సామెత ఎప్పుడన్నా విన్నారా?' గొంతులో వేదన పలికిస్తూనే మనసులో నవ్వుకుంది గీత.

'అంటే...? అంటే...?' యోగి గజిబిజి అయ్యాడని స్పష్టంగా తెలిసింది గీతకి.

'క్రితం సంవత్సరం స్టాక్ మార్కెట్ క్రాష్ అయింది గుర్తుందా? అప్పుడు మా డాడీ అంతా పోగొట్టుకున్నారు... అంతా అంటే నిజంగా అంతా... ఇక అప్పటి నుండీ అప్పుల మీద బండి నడిపాం. అప్పులవాళ్లు ఎన్నాళ్లని ఆగుతారు? మొన్ననే ఆ బంగళా వేలం వేశారు. ఇప్పుడు ఓ చిన్న ఇంట్లోకి అద్దెకి దిగాం' కర్చీఫ్‌తో పొడికళ్లు అద్దుకుంది గీత.

యోగి ఆమెనే చూస్తుండిపోయాడు.

'మీరు నమ్మరు కదూ?... ఓ పని చేయండి. నాతో పాటు మా ఇంటికి, అదే మా కొత్త ఇంటికి రండి. మీ కళ్ళతో మీరే స్వయంగా చూడండి. నిజం యోగీ! మా డాడీ కారులో వెడుతూ అప్పుడప్పుడు దేవదాసు పాటలు వినేవారు. అప్పుడు ఓ పాటలో కలిమిలేములు కావిడికుండలు అని దేవదాసు పాడితే ఏదో తాగి నోటికి వచ్చింది పాడాడు కాబోలు అనుకుని నవ్వేదాన్ని... అలా ఎందుకు అంటారో అర్థం అయ్యేది కాదు. ఇప్పుడు తెలిసింది. అన్నట్లు ఆ కారు కూడా అమ్మేశాం'

యోగి జాలిగా ఆమె వంక చూశాడు.

బస్సు దిగి ఇంటివేపు వెడుతూ గీత అంది. 'ఈ పేద జీవికల ఈ ఎడారుల లోనే వేగిపోనీవోయి... ఈ చిన్ని సెలయేళ్ల ఈ కొండ కోననే ఎండిపోనీవోయి...' అని పాడుకోవాలనిపిస్తుంది. అంతకంటే ఏం చేయగలం చెప్పండి.'

యోగి నడక ఆగింది. 'మీకు కృష్ణశాస్త్రి ఇష్టమా?'

'ఇష్టమా...? చాలా చాలా చాలా చాలా ఇష్టం... మా బంగళా నుండి నేను తెచ్చుకున్నవి ఆ పుస్తకాలే...'

చాలా సాదాసీదాగా ఉన్న ముందు గదిని చూసి కొన్ని రోజులలోనే ఎంత మార్పుని చూసింది ఈ అమ్మాయి అని అనుకున్నాడు యోగి.

ఆమె లోపలికి వెడితే అతను సీలింగ్‌కు ఉన్న బూజుని చూస్తూ ఆలోచనలో పడ్డాడు.

ఆమె అందించిన మంచినీళ్లు తాగాక అతనికి ఓ సందేహం వచ్చింది. 'జీరో...

అదే మీ కుక్కపిల్ల ఏమయింది...?'

'అది కూడా చూశావా బాబూ!' అనుకుంది గీత. గొంతుని గద్గదం చేసి 'ఇప్పుడు దాన్ని పోషించే స్థోమత లేదు యోగి బాబు...! ఆ బంగళా వాళ్లకే ఇచ్చేశాం...' అంది.

అతని మనసు కలచివేసింది. అన్యమనస్కంగా పేపర్ అందుకున్నాడు.

రెండు నిమిషాల తరువాత ఆమె కాఫీ కప్పులతో వచ్చేసరికి పెన్నుతో పేపర్ పైన ఏదో రాస్తున్నాడు. ఆమెని చూసి నవ్వి పేపర్ యథాస్థానంలో ఉంచాడు.

'కాఫీ బాగుంది' అన్నాడో గుక్క తాగి.

'ఈ నెల తరువాత ఈ అలవాటు కొనసాగించగలమో లేదో బడ్జెట్ వేయాలి...' అంది గీత.

'మిమ్మల్ని మెచ్చుకోవాలి గీతా! చాలా స్థయిర్యంగా ఉన్నారు...'

'అన్నీ పోగొట్టుకున్నవాళ్లకి మిగిలేది అదేకదా యోగి బాబూ...' అంది గీత.

అతను సెలవు తీసుకుని వెళ్ళిపోయిన అరగంట తరువాత రాఘవ వచ్చాడు. కూతురు అందించిన కాఫీ తాగి అతను పేపర్ అందుకున్నాడు. క్రాస్ వర్డ్ పజిల్ పేజి చూడగానే అతని భ్రుకుటి ముడిపడింది. 'గీతా! ఇవన్నీ ఎవరు నింపారు? ... పొద్దున చాలా సేపు ప్రయత్నించాను. నాకు కొరుకుడు పడలేదు.. భలే!'

గీత నివ్వెరపోయింది. రెండు మూడు నిముషాల సమయం మాత్రమే యోగి ఒంటరిగా ఉన్నాడు. ఆ కొద్దిసేపటిలో అతను తండ్రికి తెలియనివన్నీ నింపాడా? గీత పేపర్ అందుకుంది. సగానికి పైగా గడులు నింపాడు అతను !

'యోగి అనీ.. జర్నలిజం చేస్తున్నాడు నాన్నా... ఈ మధ్యనే పరిచయం అయ్యాడు. అతను చాలా తెలివిగలవాడు. అతనే చేసి ఉంటాడు...' అంది గీత.

అంత తెలివిగలవాడిని కూడా బురిడీ కొట్టించాను కదా అనుకుంది గర్వంగా.

ఆ తరువాత రెండు మూడుసార్లు ఆమెని బైక్‌పైన ఇంటి దగ్గర దింపాడు యోగి. ఆ బైక్ అతనిదే కాని ఎవరు అడిగినా నో అనకుండా ఇచ్చేస్తాడుట... నెలలో ఓ వారం రోజులు అతని దగ్గరా మిగిలిన రోజులు ఇతరుల దగ్గర. 'అలా ఓ ప్రయోజనం కూడా ఉందండి. కొంత మంది పెట్రోలు పోయించి మరీ తిరిగి ఇస్తారు...' అన్నాడు నవ్వుతూ.

రోజు రోజుకి యోగికి గీత అంటే అడ్మైరేషన్ పెరగసాగింది. జీవితంలో ఎదురుదెబ్బలని ఎలా తట్టుకుని నిభాయించుకుంది!

★ ★ ★

ఓ సాయంకాలం గీత తార ఇంటికి వెళ్లటానికి బస్‌స్టాప్‌లో నుంచుంది. బైక్‌పైన యోగి వచ్చాడు. గీత గతుక్కుమంది. ఇప్పుడు తార ఇంటికి వెడితే తన నాటకం బట్టబయలవుతుంది. ఏం చేయాలి...? వెంటనే కోలుకుంది. 'ఈ రోజు నా మూడేం బాగాలేదు యోగి బాబూ!' అంది.

సాధారణంగా యోగి అనే సంబోధిస్తుంది కాని అప్పుడప్పుడు ఈ యోగి బాబూ ఏమిటి?... బాగాలేదని చెప్పాలి అనుకున్నాడు అతను. అంతలోనే వద్దులే. అసలే బాధలలో ఉంది. అలా చెబితే నొచ్చుకుంటుందేమో అనుకుని 'ఏమయింది గీతా!' అని అడిగాడు.

'పొద్దున నుంచి జీరో గుర్తుకి వస్తూనే ఉంది. ఎలా ఉందో ఏమిటో? చిరిగిన నా జోలెలో వరమేది అగపడదు. బిగిసి ఏకతార గొంతు పెగలనే పెగలదు' గొంతుకి ఏదో అడ్డుపడ్డట్లు మాటలు ఆపేసింది.

యోగి కదిలిపోయాడు. 'ఛా! గీతా! అలా అధైర్యపడకు. కమాన్! ఓ సారి జీరోని చూస్తే నీకూ తృప్తిగా ఉంటుంది.'

గీత కళ్లు మెరిశాయి. 'ఏమంటున్నావు యోగి బాబూ?... మా బంగళాకి... అదే మా పాత బంగళాకి వెళ్లి జీరోని చూడమంటున్నావా? నిజమే అలాగే చేస్తాను...' గీత బైక్ ఎక్కింది.

తార ఇంటి ముందు బైక్ ఆపి 'నేను బయట వెయిట్ చేయనా?... మళ్లీ ఇంటి దగ్గర దింపుతాను' అన్నాడు యోగి.

'వద్దు, వద్దు..' అంది గీత.'నీ సమయం అంతా వృథా అవుతుంది. ఇక్కడ నుంచి నేను వెళ్లిపోతానులే' బైక్ మలుపు తిరిగిందని రూఢి చేసుకుని అప్పుడు గేట్ తీసింది గీత. ట్యూషన్‌కి రెండు గంటలు పడుతుంది. అంతసేపు వెయిట్ చేస్తే అతనికి అనుమానం రావచ్చు!

ఎప్పుడూ నవ్వుతుండే తార గంభీరంగా ఉంది. 'ఏమయింది తారా' అంది గీత.

'షారుఖ్ సినిమా చూడాలని ఫ్రెండ్స్ అందరమూ ప్లాన్ చేసుకున్నాం. ఆ సినిమాకి వెడితే కాళ్లు విరగ్గొడతానని మమ్మీ నన్ను ఆపేసింది. అందరి ఎదురుగా నాకు ఎంత షేమ్!' వెక్కుతూ అంది తార.

తారని ఎమ్యూజ్ చేయాలని అనుకుంది గీత. 'తారా! నేను ఓ విషయం చెబుతాను. ఎంత ఫన్నీగా ఉంటుందో... మొన్న ఒకరోజున నా ఫ్రెండ్ నన్ను మీ ఇంటి దగ్గర డ్రాప్ చేశాడు. ఇదే మా ఇల్లు అనుకుని పొరపడ్డాడు. అతన్ని మా ఇంటికి తీసుకువెళ్లేముందు నేనో కథ చెప్పాను. స్టాక్ మార్కెట్‌లో మేం పూర్తిగా నష్టపోయాం. ఈ ఇల్లు, కారు అన్నీ అమ్మేశాం అని, అద్దెఇంట్లోకి మారాం అని చెప్పాను. అతను నమ్మేశాడు. నేను కనబడినప్పుడల్లా జాలిచూపులు చూస్తున్నాడు. ఇప్పుడు ఇక్కడికి వస్తుంటే మళ్లీ ఎదురయ్యాడు.'

'మరి నువ్వేం చేశావు అక్కా?' తార ఆసక్తిగా అడిగింది.

యోగిని తను ఎలా మాయ చేస్తున్నదో

వివరంగా చెప్పింది. తార పగలబడి నవ్వింది. చాలా బాగా చేశావు అక్కా!' అంటూ టక్కున ఆగింది. 'నవ్ ఐ నో వై యు హేడ్‌నో క్రష్ ఆన్ షారుఖ్'.

'ఏం మాట్లాడుతున్నావు? '

'యు ఆర్ ఆల్రెడీ ఇన్ లవ్ మేడమ్... దట్స్‌వై!'

గీత సిగ్గు పడింది. 'సరేలే! పుస్తకాలు తియ్యి...' అంది తేరుకుని.




**త**ను యోగిని ఇష్టపడుతున్నదని బయటి వాళ్లకి కూడా తెలిసిపోతు న్నదా? ... గీత ఆలోచనలో పడింది. ఇష్ట పడటం వరకూ ఓకే... నో ప్రాబ్లెమ్... గుడ్డిగానో, కళ్ళు మూసుకునో దబుక్కున స్తంభాన్ని గుద్దుకున్నట్లుగానో, హఠాత్తుగా గోతిలో పడ్డట్లుగానో, కెరటాలలో మునిగి నట్లుగానో, వెన్నెలలో తడిసినట్లుగానో ఎలాగో ఒకలాగా ఇష్టపడచ్చు దాన్ని ఇంకా ముందుకి లాజికల్ ఎండ్‌కి తీసుకు వెళ్ళాలంటేనే కాస్త స్పృహలో ఉండా లేమో!? స్పృహ అంటే లెక్కలు బేరీజులు వేయనక్కరలేదు. నిజమే... కాని... అస్సలు ఆలోచన కూడా వద్దా? గీతకి రాస్తున్న పేపర్ మీద ఆసక్తి తగ్గిపో యింది. 'వినాయక్! ఈ ఇరవయి పేజీ లలో తప్పులు ఉన్నాయేమో కాస్త జాగ్ర త్తగా వెతికి పట్టుకుంటావా? ... పది పట్టు కుంటే టీ... ఇరవయిపైన పట్టుకుంటే టీ... ప్లస్ సమోసా... సరేనా? '

'ముప్పయి పట్టుకుంటే...' వినాయక్ ఉత్సాహంగా అడిగాడు.

'తన భాషా ప్రావీణ్యం గురించి ఏం అనుకుంటున్నాడు ఈ వినాయక్? ' గీత అతన్ని తినేసేలాగా చూసింది. అంతలోనే మొహాన్ని ప్రసన్నంగా మార్చి నవ్వుతూ అంది. 'ముప్పయి తప్పులు పట్టుకుంటే నువ్వే నాకు టీ ప్లస్ సమోసా ఇప్పించాలి'

'అదేమిటి? ' అయోమయంగా అడిగాడు వినాయక్.

'అంత దరిద్రంగా రాసినందుకు నా మీద నీకు జాలి పుట్టాలి కదా? ! ఆ జాలితో నువ్వే ఇప్పిస్తావన్నమాట...' అంది గీత. 'అసలు యోగి గురించి ఆలో చిస్తూ రాయటం వల్ల అనుమానం గాని లేకపోతే అయిదు తప్పులు దొరికితే డిన్నర్ ఇప్పిస్తానని సవాలు చేసేదాన్ని!' అనుకుంది. 'నేను లైబ్రరీకి వెడుతున్నాను.' అని పైకి అంది.

మెల్లగా లైబ్రరీ వేపు నడుస్తూ ఆలోచ నలో పడింది. యోగి పర్‌ఫెక్ట్ జంటిల్ మన్. అందులో సందేహం లేదు. అంత కుమించి అతను ఎందులోనూ పర్‌ఫెక్ట్ కాదు... అయితే ఆ అసలు స్వరూపాన్ని బహిరంగ పర్చటానికి అతను ఏమాత్రం సిగ్గుపడడు... ఎక్కడయినా, ఎప్పుడయినా అతను అతనిలాగానే ప్రవర్తిస్తాడు... ఏవో లేనిపోని మర్యాదల కోసమనో, ఇబ్బం దులు తప్పించుకోవటానికనో ముసుగులు వేసుకోవటం, లౌక్యంగా ప్రవర్తించటం అత నికి తెలియదు. అన్నీ బాగానే ఉన్నాయి కాని అసలు పేచీ మాత్రం బొత్తిగా ఫైనా న్షియల్ డిసిప్లిన్ లేదు అతనికి.

పరిచయం కాస్త పెరిగాక గీత ఒకసారి అతన్ని అడిగింది. 'యోగీ! మొదటిసారి నిన్ను పలకరించినప్పుడు నీకేమో మాట్లా డేందుకు కూడా టైమ్ లేదన్నావు. కాని



పది రూపాయలు ఉన్నాయా అని అంత చులాగ్గా ఎలా అడిగావు?'

'నా దగ్గర లేవు కాబట్టి...' అని అది ఎంతో సహజమయిన విషయం లాగా చెప్పాడు యోగి.

ఆ జవాబుకి గీత ఫోర్స్ కాస్త తగ్గింది. 'సరే... లేవనుకో... లేకపోతే మాత్రం... మాట్లాడటానికి సమయం లేదు. అన్న వాడికి ఎవరు ఇస్తారు...? ఎందుకు ఇవ్వాలి...? పిచ్చివాళ్లు కూడా ఇవ్వరు...' ప్రశ్నలు అడుగుతూనే కొంత సమాధానాన్ని కూడా తనే అందించింది గీత.

'మరి నువ్వు ఇచ్చావు కదా...'

'నేను పిచ్చాతి పిచ్చిదాన్ని కాబట్టి ఇచ్చాను బాబూ...' అనుకుంది గీత అతనివంక ఆప్యాయంగా చూస్తూ. పైకి మాత్రం 'నేను మంచిదాన్ని కాబట్టి ఇచ్చాను. అసలు నేను ఇస్తానని నువ్వు ఎలా అనుకున్నావు?' అంది.

'ఓకే మేడమ్! నాకు కావలసినది అదే! ఇవ్వటం ఇష్టం లేనివాళ్ళు ఇంకోసారి నా మొహం చూడరు. వాళ్ళతో నాకే సమస్యా లేదు. నాతో వాళ్ళకీ ఏ సమస్యా రాదు... ఇకపోతే అర్థం చేసుకున్న వాళ్ళే ఇస్తారు... లేకపోతే ఇచ్చాక అర్థం చేసుకుంటారు...' నవ్వేశాడు యోగి.

తిరుగులేని ఆ లాజిక్‌కి గీత కూడా నవ్వింది. అంతకంటే ఏం చేయగలదు?

ముక్కుకి సూటిగాపోయే అతని తత్వం, నిజాయితీగా ఉండాలనుకునే అతని భావాలు బాగా నచ్చాయి కదా. వాటికి ప్రాధాన్యం ఇవ్వకుండా.. అతను డబ్బుని హేండిల్ చేసే విధానం గురించి ఆలోచించటం బాగాలేదేమో?! అతనిలో నచ్చనివి కొన్ని ఇప్పటికే కనబడ్డాయి... ఇంకొన్ని మెల్లమెల్లగా తను తెలుసుకుంటుందేమో!? కాని వాటిని విస్మరించక తప్పదు... అలాంటి వ్యక్తిత్వం కాదా యోగిది?

'ఇదేమిటి నేను లైబ్రరీ మెట్లు ఎక్కాలి గాని ఇలా దిగుతున్నాను?' అనుకుని గీత నడక ఆపింది.

ఆమె లైబ్రరీవేపు తిరగనే లేదు... లాండ్ స్కేప్ గార్డెన్‌లోకి నడుస్తున్నది... 'అంటే ఇప్పుడేం చేయాలి? లైబ్రరీకి వెళ్లాలా వద్దా? ఆలోచనలు ఓ రూపానికి వచ్చాయికదా. ఇక లైబ్రరీకి ఎందుకు? డిపార్ట్‌మెంట్‌కి వెడితే సరి...! అంతే!'

ఈసారి ఇంకా తీరికగా సమీక్షించుకుంటూ నడిచింది గీత.

ఆమెని చూడగానే వినాయక్ అన్నాడు. 'గీతా! నువ్వు అనవసరంగా ఆశ పెట్టావు... ఇంతవరకూ ఒక్క తప్పు కూడా దొరకలేదు...'

'డోంట్ వర్రీ..!' గీత నవ్వింది. 'ఇదుగో సమోసాలు... టీ అయిదు నిముషాల తరువాత వస్తుంది...'

'వాటార్యూ సెలబ్రేటింగ్?'

'నా ఇంగ్లీష్ ప్రావీణ్యాన్ని...' అబద్ధం చెబుతూ అంది గీత.

అబద్ధమని తెలిసిపోయినా సమోసా బాగుండటంతో మాట్లాడకుండా ఇంకోటి అందుకున్నాడు వినాయక్.

★ ★ ★

నవంబర్ చివరి వారం... మబ్బుగా ఉందేమో మధ్యాహ్నం సమయంలో కూడా చల్లగా ఉంది.

యోగి పక్కన కూర్చుని అతని ద్వారా పరిచయం అయిన మిత్రులతో మాట్లాడుతోంది గీత.

'బాబూ నువ్వు ఇక్కడ ఉన్నావా?' అంటూ పోస్ట్‌మాన్ వెతుక్కుంటూ వచ్చాడు. 'నీకు ఎం.వో వచ్చింది...'

'నాకా...?

'ఎంవోనా?' అంటూ ఫారం అందుకున్నాడు యోగి.

నిముషం తరువాత పోస్ట్‌మాన్ ఇచ్చిన



వెయ్యి రూపాయలు తీసుకున్నాడు.

'బహుమతి కథదా?' ఓ స్నేహితుడు అడిగాడు. 'తొందరగా పంపారే...'

యోగి ఆ పది వంద నోట్లు ఎత్తి పట్టుకున్నాడు. 'నాకు గుర్తు ఉండదని తెలుసు కదా... ప్లీజ్ తీసుకోండి...'

అతనికి అటు పక్కన కూర్చున్న రాజు అవి తీసుకుని రెండు నోట్లు జేబులో ఉంచుకుని పక్కతనికి ఇచ్చాడు.

అలా తరుక్కుంటూ చివరికి మూడు నోట్లు గీత దగ్గరికి వచ్చి ఆగాయి.

గీతకి ఏం చేయాలో తెలియలేదు... యోగి మూడు నాలుగుసార్లు కలిపి దాదాపు నూట యాభయి వరకూ తీసుకున్నాడు... ఆ సంగతి ఇప్పుడు బయటపెట్టాలా? గీత చనువుగా ఆ నోట్లు అతని జేబులో ఉంచింది. యోగి అభ్యంతరం చెప్పలేదు.

ఆ తరువాత ఇద్దరే ఉన్నప్పుడు గీత అడిగింది, 'యోగీ! నాకేం అర్థం కాదు... నీ జేబులో డబ్బులు ఉంటే అవి అయిపోయే వరకూ ఇంకొకరిచేత ఖర్చు పెట్టించవు'

చుట్టూ తెలిసిన వాళ్ళు ఉంటే నీ దగ్గర డబ్బులు లేవన్న ఆలోచన నీకు కలగదు. ఏమిటిది? వై ఆర్యూ సో ఇన్‌డిఫరెంట్ టువర్డ్స్ మనీ?'

అతను నవ్వాడు. 'నేనేదో ఆదర్శవాదిని అని అనుకోని ఈ ప్రపంచంలో అన్ని సమస్యలకీ కారణం డబ్బు కదా... ఎక్కువగా ఉండటమో... తక్కువగా ఉండటమో... అది కావాలని తాపత్రయ పడటమో... తేలికగా సంపాదించాలన్న తపనో... ముందు తరాలకి కూడా దాచేసుకోవాలన్న తహతహో... ఈ తిప్పలు అన్నింటికీ కారణం అదేకదా! పూర్తిగా కుదరదు కాని రోజుకూలీ చేసుకునే వాళ్లలాగా ఈనాటి సంపాదనతో ఈనాడే ఎంజాయ్ చేయటం అన్నది ఉత్తమమయిన మార్గం అని నాకు తోస్తుంది...'

'కాని రేపటికి కావాలి కదా?'

'గీతా! నిన్న ఇలాగే రేపు అని నువ్వు అనుకున్నది ఈ రోజుగా వచ్చేసింది కదా?!. నువ్వు రేపటి కోసం దాయాలి అంటున్నావు... నేనేమో ఒక్కరోజు ముందుగా ఈ రోజే ఖర్చు చేస్తున్నాను... అంతేకదా...' చాలా సింపుల్‌గా తేల్చేశాడతను.

వినటానికి అది బాగానే ఉంది... కాని సమర్థనీయమా? గీతకి భయం కలిగింది. ఆర్థికంగా తండ్రి తమని ఎన్ని ఇబ్బందులు పెట్టాడో గీత ఎలా మరిచిపోతుంది?! కాని యోగి విషయం వేరు... సిగరెట్లు తప్పితే ఇంకో అలవాటు లేదు... సమస్య ఎదురయితే తండ్రిలాగా పలాయన వాదాన్ని ఆశ్రయించే తరహా కాదు ఇతనిది... అని తనకి తానే ధైర్యం చెప్పుకుంది గీత.

'ఓకే బాబూ! నీ ఫిలాసఫీ చాలా బాగుంది... కాని...'

యోగి అడ్డు తగిలాడు. 'ఎంత బాగుందో నీ సంబోధన వింటుంటేనే తెలిసిపోతున్నది... సరే చెప్పు...'

'సాయంకాలం ప్రళయం వస్తుంది. ఈలోగా జేబులో ఉన్న డబ్బులన్నీ ఖర్చు పెట్టాలన్నట్లు తొందరలో ఎందుకు ఉంటావు? పొద్దున ఎంత తెచ్చినా సాయంకాలానికి నీ దగ్గర పైసా ఉండకపోవటం నేను చాలాసార్లు చూశాను...'

'యు ఆర్ రైట్!' అన్నాడతను. 'జేబులోంచి మూడు వందలు తీసి ఆమెకి ఇచ్చాడు. 'నాకు బుద్ధి ఉండదు. లేకపోతే ఆర్థికంగా బాగా దెబ్బతిన్న నీ నుండి కూడా అప్పు తీసుకోవటం ఏమిటి?'

రహస్యాన్ని బట్టబయలు చేయనా వద్దా అని తర్జన భర్జన పడింది గీత.



**ఆర్థికంగా తండ్రి తమని ఎన్ని ఇబ్బందులు పెట్టాడో గీత ఎలా మరిచిపోతుంది?! కాని యోగి విషయం వేరు... సిగరెట్లు తప్పితే ఇంకో అలవాటు లేదు...**



ఇప్పుడు కాదు... ఏదన్నా హోటల్‌లో కూర్చుని ఉండగా కాఫీ తాగుతూ చెప్పాలి...

ఆమె మౌనంగా ఉండటం చూసి యోగి అన్నాడు. 'మీ న్యూక్లియర్ కెమిస్ట్రీలో హాఫ్ లైఫ్ అని అంటారు. చూడు... అలా నా దగ్గర డబ్బులకి హాఫ్ లైఫ్, మూడు నిముషాలో అయిదు నిముషాలో కాబోలు' అన్నాడు. అంటే అతని దగ్గర వంద రూపాయలు వుంటే అవి యాభైగా మారటానికి అయిదు నిముషాలు, పాతికగా అయిపోవటానికి ఇంకో అయిదు నిముషాలు తీసుకుంటూ దాదాపుగా గంటలో ఆ వందా మాయమయిపోతుందన్న మాట.

అతను అలా సైంటిఫిక్ పదాలు తరచూ వాడటం ఆమెకి చాలాసార్లు అనుభవమే కాబట్టి వెంటనే అడిగింది. 'నువ్వు చదివిందేమో బీఏ లిటరేచర్... సైన్స్ అంటే నీకు అంత ఇష్టమా?'

'చాలా... ఆ ఇష్టం ఎలా కలిగిందో తెలుసా?' అన్నాడతను. వినాయకచవితికి తనకి కలిగిన సందేహం... ఆ తరువాత

జరిగిన కథ చెప్పాడు.

గీత నవ్వుతూ ఏదో చెప్పబోయింది. అతను అడ్డుతగిలాడు.

హఠాత్తుగా అతని మొహం గంభీరంగా మారింది. 'గీతా! నీకు మా నాన్న గురించి...కాదు కాదు నీకు నా గురించి, మా నాన్న గురించి పూర్తిగా చెప్పలేదు. ఇప్పుడు చెప్పింది నథింగ్... ఎప్పుడో తీరిక చేసుకుని సవివరంగా చెబుతాను...'

'చెప్పటం ఎందుకు? ఓ సారి మీ ఇంటికి పిలవచ్చు కదా? !' అతను ఇంతవరకూ ఇంటికి ఆహ్వానించలేదన్న సంగతిని అన్యాపదేశంగా అతనికి గుర్తుచేస్తూ అంది.

'ఊహూ! అలా కాదు... నువ్వు వచ్చే ముందు అది వినాలి... నిజానికి అందుకనే నిన్ను ఇంతవరకూ నేను రమ్మనమని పిలవలేదు...'

గీత 'థాంక్ యూ...' అంది.

'థాంక్స్ ఎందుకు?' అయోమయంగా అన్నాడు యోగి.

'నా బాధ్యత గుర్తు చేసినందుకు... నేనూ నా తండ్రి గురించి నీకు చెప్పాలి అన్న బాధ్యత గుర్తు చేసినందుకు నీకు థాంక్స్...' అని మనసులో అనుకుంది.

అంతలో ఆమెకి కావలసిన బస్సు వచ్చింది... ఆ స్టాపులో తిరుగు ప్రయాణానికి బస్సు మలుపు తీసుకుంటుంటే గీత లేచింది.

'ఇక నేను వస్తాను యోగీ... సీయూ టుమారో... బై...'

బస్సులో కూర్చుని గీత కిటికీలోంచి చూసింది. ఇంకా అక్కడే నిలబడి ఉన్నాడు. తండ్రి గురించిన ప్రస్తావన వల్ల నేమో అతని మొహం గంభీరంగా ఉంది.

బస్సు కదలబోతుంటే గీత ఒక్క ఉదుటున లేచింది.

'స్టాప్...' అంటూ హడావిడిగా బస్సు దిగింది.

పరుగున దగ్గరవుతున్న గీతని చూసి యోగి విస్తుబోయాడు. 'ఏమయింది?'

గీత నవ్వింది. 'నువ్వు అన్నది చాలా కరక్ట్ యోగీ! డబ్బు గురించి ఆలోచించి మనం చాలా పోగొట్టుకున్నాం...'

'అదేమిటి? మూడో నెంబరు బస్సులో కూర్చుంటే ఇలా జ్ఞానోదయం అవుతుందా?' అతడు నవ్వుతూ అడిగాడు.

'నీకు ప్రైజ్ వచ్చిందని తెలియగానే నేను కంగ్రాట్స్ చెప్పాల్సింది పోయి నువ్వు ఆ మొత్తాన్ని ఎలా ఖర్చు చేశావా అని ఆలోచించటం మొదలు పెట్టాను... అందరూ వెళ్లాక కూడా నీతో డబ్బు గురించే చర్చించాను. ఆ తరువాత ఇంకో టాపిక్... ఇంకో టాపిక్. అలా ఎక్కడికో సాగిపోయాం. కాబట్టి ఇప్పుడు నా తప్పుని సరిదిద్దుకుంటున్నాను. కంగ్రాచ్యులేషన్స్...' అతని చేయి అందుకుని ఆప్యాయంగా ఊపింది.

యోగి మొహం వెలిగింది. 'థాంక్యూ!'

'ఆ కథ ఎప్పుడు ప్రింట్ అవుతుంది?'

అతను తన చేతిలోని ఫైలు తెరిచాడు. 'ఇదుగో ఇందులో ఓ కాపీ ఉంది. నువ్వు చదువుతానంటే తీసుకో...'

చటుక్కున అందుకుంది గీత.

ఆ కథని రాత్రి పడుకునే ముందు చదివింది.

వినాయకుడి విగ్రహాలు పాలు తాగుతున్నాయి అన్న వార్త దావానలంలా పాకటంతో దేశంలో వేలం వెర్రిగా జనాలు గుళ్ల ముందు క్యూలు కట్టటం బ్యాక్ డ్రాప్‌గా కథ రాశాడు యోగి... క్లాసులో ఫస్ట్ వచ్చినందుకు ఓ పాపకి ఫైవ్ స్టార్ చాక్లెట్ ఇస్తాడు తండ్రి. స్కూల్ నుంచి రాగానే అన్నం తినకుండా ఆ చాక్లెట్ తింటానని పంతం పడుతుంది పాప. తల్లికి కోపం వచ్చి అన్నం తింటేనే చాక్లెట్ అంటుంది. పాప అలిగి ఏమీ తినకుండా గదిలోకి వెళ్ళి కూర్చుంటుంది. ఈలోగా తల్లికి వినాయక విగ్రహాలు పాలు తాగు






## మిత్రలాభం!

సామాన్యంగా ఇతర చేపలను తమ అంటెన్నాలతో కుట్టి, చంపే సీ - అనిమోన్లు ఈ చేపను మాత్రం అక్కున చేర్చుకుంటాయి. ఎందుకంటే ఎర్రగా బుర్రగా ఉన్న ఈ చేప రంగును చూచి ఆకర్షితమై దగ్గరికి వచ్చే ఇతర ప్రాణులను అవి ఎంచక్కా భోంచేయొచ్చు కనుక. అంతేకాదండోయ్! ఈ చేప తనను తాను కాపాడుకునేందుకు ఎల్లప్పుడూ ఈ అనిమోన్లను అంటిపెట్టుకు తిరుగుతుంటుంది. శత్రువులు వస్తే ఒక్కసారిగా ఈ అంటెన్నాల మధ్యలోకి జొరబడి 'ఇక కాచుకోండి' అంటుంది.

## హృదయం పదిలం...

చిన్న గుండెనొప్పో, గ్యాస్ట్రిక్ ప్రాబ్లమ్‌తోనో, అధిక బరువు కోసమో డాక్టరు దగ్గరకెళితే, వాళ్ళు అనేక రకాల పరీక్షలు జరిపి, మీకు హైపర్‌టెన్షన్ ఉందో, మీ ఎల్.డి.ఎల్. కొలెస్ట్రాల్ అధికంగా ఉందనో, బాడీమాస్ ఇండెక్స్ ఎక్కువైందనో వైద్య పరిభాషలో చెప్పటం గమనిస్తాం. అలా కాకుండా డాక్టర్ వద్దకు వెళ్ళినపుడు మీ "హార్ట్-హెల్త్' గురించి ఈ కింది ప్రశ్నలు అడగండి. జవాబులు రాబట్టండి.

☆ నా రక్తపోటు ఎంత? తక్కువ, ఎక్కువలుంటే ఏం చెయ్యాలి? ఎలాంటి మందులు, ఎప్పుడెప్పుడు వాడాలి? ☆ నా రక్తంలో కొలెస్ట్రాల్ ప్రమాణాలు ఎంతెంత? ☆ బాడీమాస్ ఇండెక్స్ అంటే ఏమిటి? నా శరీరపు బరువుకి ఎంత ఉండాలి? తగ్గించుకునే మార్గాలు, మందులు ఏమిటి? ☆ నా రక్తంలో షుగర్ ఎంత ప్రమాణంలో ఉంది? మధుమేహవ్యాధి రిస్క్ ఉందా? ☆ ఎన్ని నెలలకోమారు పరీక్ష చేయించుకోవాలి? ☆ ఆరోగ్యంగా ఉండటం కోసం రోజూ ఎంతసేపు వ్యాయామం, వాకింగ్ చెయ్యాలి. ☆ ఆరోగ్యవంతమైన హార్ట్ కోసం ఎలాంటి ఆహారం తీసుకోవాలి?, డయటీషియన్ సంప్రదింపు అవసరమా?

పై ప్రశ్నలకు సమాధానాలు తెల్సుకుని వాటికి తగినట్లు మసలుకుంటే హార్ట్ స్మార్ట్‌తో బాటు అవగాహన ఏర్పడుతుందని కెనడాకు చెందిన కార్డియాలజిస్ట్ డా॥ జేమ్స్ చెబుతున్నారు.

తున్నాయి అని తెలుస్తుంది. ఇంట్లో ఉన్న పాలు తీసుకుని గుడికి వెళుతుంది. తల్లి వచ్చేసరికి పాప ఆకలితో, నీరసంతో ఏడుస్తుంటుంది... నీరసాన్ని త్వరగా తగ్గించటానికి గ్లాసెడు పాలు ఇద్దామన్నా ఇంట్లోనే కాదు పక్కవాళ్ల ఇంట్లో కూడా పాలు ఉండవు. అందరూ వినాయకుడిచేత తాగించారు. మరి... అన్నం తిను ఆకలి తగ్గుతుంది అని తల్లి పాపని బుజ్జగిస్తుంది. 'అయినా నన్ను వదిలి నువ్వు ఎక్కడికి వెళ్ళావు?' అని అడుగుతుంది పాప. 'గుళ్ళో వినాయకుడు పాలు తాగుతున్నాడమ్మా! అక్కడికి వెళ్లాను... ఎంత ఆశ్చర్యమో తెలుసా?... నిజంగా పాలు తాగుతున్నాడు' అంటుంది తల్లి. అందులో ఆశ్చర్యం ఏముంది అని అడుగుతుంది పాప. మరి రాతి విగ్రహం పాలు తాగటం ఆశ్చర్యమే కదా అంటుంది తల్లి. 'అది రాతి విగ్రహమా? మరి నాతో దేవుడు అని ఎందుకు చెప్పావు?' అని పాప అమాయకంగా అడుగుతుంది.

బాలవాక్కు అన్న పేరుతో ఉన్న ఆ కథ గీతను బాగా ఆకట్టుకుంది.

ఆ తరువాత అతను రాసిన రచనలు అన్నీ చదివింది గీత.

★ ★ ★

ఆదివారం ఆబిడ్స్‌లో పాత పుస్తకాల షాపుల దగ్గర సందడిగా ఉంది.

యోగితో పాటు పుస్తకాలు కొనటానికి మొదటిసారిగా గీత అక్కడికి వచ్చింది. ఆమెకి కూడా పుస్తకాలు చదవటం అలవాటే కాని ఆమెకి కొన్ని నియమాలలాంటివి ఉన్నాయి. ఫలాన ఫలాన వారి రచనలు తప్ప మిగిలినవి చదవనే చదవదు.







యోగి అలా కాదు. అతను అభిమానించే రచయితల రేంజ్ గీత ఊహకి అంద లేదు. అసలు ఆ పేర్లు గల రచయితలు ఉన్నారని మొదటిసారిగా ఆమెకి తెలి సింది. పైగా కొన్ని పుస్తకాలు కొంటున్న ప్పుడు అతని గురించి కొత్త విషయాలు తెలిసినట్లయింది.

'ఈ మహాప్రస్థానం చూడు... దాదాపు కొత్తదానిలాగా ఉంది. ఎవరో శ్రీశ్రీని చద వటం ఫ్యాషన్ అనుకుని కొనుక్కొని చలం ముందుమాట కూడా చదవకుండా అలమా రలో ప్రదర్శించి చివరికి ఇక్కడికి పంపార న్నమాట...' అంటూ బేరమాడి కొన్నాడు.

'అంటే? అంటే నీ దగ్గర మహాప్రస్థానం లేదా?' గీత ఆశ్చర్యంగా అడిగింది.

యోగి రెండో పేజీ తిప్పాడు. అక్కడ మొదటి ముద్రణ దగ్గరనుంచి వరుసగా ఉన్న లిస్ట్‌పైన వేలితో కొడుతూ అన్నాడు. 'ఈ పుస్తకం ఎన్నిసార్లు ప్రింట్ అయ్యిందో దానికి రెట్టింపు సార్లు కొని ఉంటాను. ప్రతిసారీ ఎవరో ఒకరు తీసుకుంటారు. ఈసారి నువ్వు తీసుకుంటావా?'

ఇంట్లో అదే పుస్తకం ఉందని ఆమె సంశయించలేదు. వెంటనే అందుకుని హత్తుకున్నట్లు గుండెల దగ్గర ఉంచు కుంది. మొదటిసారి యోగి కొని ఇస్తున్న దానిని కాదని ఎలా అంటుంది?

అతను ఆ తరువాత ఇంకో రెండు పుస్త కాలు కొంటూ ఏదో అన్నాడు కాని గీత మహాప్రస్థానం వంక మురిపెంగా చూస్తూ ఏమీ వినిపించుకోలేదు.

ఉన్నట్లుండి యోగి వంగి ఓ డిటెక్టివ్ పుస్తకం తీశాడు. 'ఈ పుస్తకం చదివావా?'

అట్ట ఊడిపోయిన ఆ పుస్తకం వంక గీత చూసింది. గణగణ మోగిన గంట. చూపుని అతని వంకకి తిప్పి ప్రశ్నార్థకంగా తల ఊపింది.

అతను నవ్వాడు. 'చిన్నప్పుడు ఈ పుస్తకం నాకు చాలా ఫేవరేట్. ఎన్ని సార్లు చదివానో నాకు గుర్తు లేదు... ఇది చదువుతూ ఓ సారి నాన్నకి దొరికిపో యాను. ఆనాడు నాన్న ఎంతసేపు కొట్టాడో!?'

'ఇప్పుడు కొంటున్నావా?' అంది గీత.

'కొనాలి... కొని నాన్నకి చూపించి ఆ సంగతి గుర్తు చేసి మళ్లీ ఆయన ఎదు రుగా చదువుతాను...' యోగి అదోలా నవ్వాడు.

'చిన్న పిల్లాడి చేష్టలాగా అదేమిటి యో గీ...? అలా చేస్తే ఆయన నొచ్చుకుంటా డేమో?!' అని గీత అంది. కాని అతను విననట్లే ఉండిపోయాడు.

రెండు గంటలు అయ్యేసరికి గీతకి కాళ్ళు నొప్పులుగా అనిపించాయి. అదేమి పట్ట నట్లు అతనింకా ఇంకా ఏవేవో చూస్తూనే ఉన్నాడు. కొంటూనే ఉన్నాడు. ది ఆర్ట్ ఆఫ్ స్క్రిప్ట్ రైటింగ్ అన్న పుస్తకాన్ని బాగా బేరం చేసి కొన్నాడు.

గీతకు చాలా ఆశ్చర్యంగా ఉంది. నువ్వు... నువ్వు... ఇంత గొప్పగా బేరం చేస్తావా?' అంది

అతను పగలబడి నవ్వాడు. 'నా దగ్గర మిగిలింది అంతే మేడమ్... బేరం ఆడక తప్పదు మరి...' అన్నాడు.

గీత నవ్వింది. 'అయితే ఇక మన వేట అయిపోయినట్లేనా... తాజ్‌కి వెళ్ళి కాఫీ తాగుదాం రా...'

'సరే' అంటూ అటు కదిలాడు యోగి. అయిదారు అడుగులు వేసి ఆగాడు. అతని కళ్లల్లో ఆరాధనాభావం స్పష్టంగా కనబడుతున్నది. ఏమిటా అని అతను చూస్తున్న దిశకి తిరిగింది గీత. అక్కడ ఏవో పుస్తకాల వ్యాల్యూమ్స్ ఉన్నాయి.

'ఏమిటి యోగి...?' గీత అడిగింది.

'కాఫ్కా...' అన్నాడు అతను. ఏదో సంశయం నుండి విముక్తుడయినట్లు అటు

## పర్వతాల్లో నత్తగుల్ల శిలాజాలు

సరికొత్త డిజైన్లతో నాణేల్లా కనిపిస్తున్న ఈ ముద్రల్ని చూస్తే అచ్చెరువు కలుగుతోంది కదూ! ఇవి ఏ వెండితోనో, రాగితోనో చేసిన ముద్రలు కావండీ! ఎప్పుడో అనంత సాగర గర్భంలో జీవించిన నత్తగుల్లల జాతికి చెందిన శిలాజాలు. మొదట్లో ఎంతోమంది భూగర్భ శాస్త్రవేత్తలు వీటిని చూసి ఆశ్చర్యానికి గురయ్యారు. కోట్లాది సంవత్సరాల క్రితం సముద్రంలో ఏర్పడిన వివిధ కల్లోలాల కారణంగా భూపొరలు పైకిలేచి నేడు ఎత్తైన ప్రదేశాలుగా కన్పిస్తున్నాయి. వాటిపై ఆనాటి సముద్ర జీవుల అవశేషాలు శిలాజాల రూపంలో దర్శనమిస్తున్నాయి.





వెళ్ళి ఆ పుస్తకాలు అందుకున్నాడు.

'కాఫ్కా అంటే? '

నోరు విప్పబోయి ఆగాడు యోగి. 'వద్దులే... తెలిసీ తెలియక నేనేదో చెబితే ఆ మహానుభావుణ్ణి అవమానించినట్లవుతుంది. ఈయన గురించి చాలా విన్నాను. ఇంతవరకు చదవలేదు. చదివి అనుభవించి అప్పుడు నీకు చెప్పాలి...' ఆ పుస్తకాలని అప్యాయంగా తడిమి పేజీలు తిప్పి కొంతసేపు తరువాత పెట్టేశాడు. వాటి వంక ఇంకోసారి చూసి 'రా గీతా!' అన్నాడు.

'అదేమిటి... కొనవా? '

అతను నవ్వాడు. 'నా దగ్గర డబ్బులు లేవు మేడమ్...'

'నా దగ్గర ఉన్నాయి బాబూ!' అంది.

'కాని... కాని నా సంగతి నీకు తెలుసు... మళ్లీ ఈ డబ్బులు ఇవ్వగలనో లేదో నాకు తెలియదు. అసలే ఇబ్బంది

లలో ఉన్న నీకు ఎందుకా భారం?'

రెండు నెలలు గడిచినా గీత ఇంకా దివాళా అబద్ధాన్ని కొనసాగిస్తూనే ఉంది. అందుకనే అతని వంక వినోదంగా చూస్తూ 'నో ప్రాబ్లమ్ యోగి బాబు!' అంది పర్సు తీస్తూ.

ఐస్‌క్రీమ్ కొనుక్కున్న చిన్నపిల్లాడిలాగా సంబరంగా ఆ పుస్తకాల వంక చూశాడు యోగి. అలా ఉన్న అతన్నే చూస్తూ ఉండాలని గీతకి అనిపించినా నిమిషం తరువాత అంది 'యోగి బాబు! తాజ్ కి వెళ్లాల్సిందే తప్పదు...'

కాఫీకి ఆర్డర్ ఇచ్చాక ఒక్కొక్క పుస్తకం తీసి చూడసాగాడు. అతను హఠాత్తుగా అడిగాడు. 'నా చిన్నప్పటి డ్రీమ్ ఏమిటో తెలుసా? చిన్నప్పుడు అంటే... టెన్త్... ఇంటర్ చదివే వయసులో...'

'మూడు ఛాన్స్‌లు ఇస్తావా?' అంది గీత. తను తల ఊపటం చూసి కళ్లు మూసుకుంది. 'నెంబర్ వన్... డిటెక్టివ్ అవాలని అనుకున్నావు... టూ... కవిత్వం రాసి పేరు తెచ్చుకోవాలని... త్రీ... సినిమా యాక్టర్ ఊహూ... నీకూ సినిమాలకి అస్సలు పడదు. కాబట్టి ఇంజనీర్ అవ్వాలని ఉండేది' గీత కళ్ళు తెరిచింది. 'ఏం మాట్లాడవేం యోగిబాబు! కరెక్టేనా?'

'ఆ సంబోధన ఏమిటి? ... బాగాలేదు గీతా! ప్లీజ్...' అన్నాడు యోగి.

'నిజమే ఈ సందర్భానికి అది సరిపోదు. ఆస్తులు పోగొట్టుకున్నానని నీతో అబద్ధాలు చెబుతున్నప్పుడు మెలోడ్రామాగా ఆ సంబోధన బాగుంటుంది కాని, ఇలాంటప్పుడు కాదు...' అనుకుంది గీత. 'ఇంతకీ నా ఊహలలో ఏది కరెక్ట్?'

'ఏదీ కాదు... చాలా దగ్గరకి వచ్చినట్లే వచ్చి ఎటో వెళ్లావు. నా డ్రీమ్ ఏమిటంటే సినిమా డైరెక్ట్ చేయాలని...'

'నువ్వు సినిమాలా? నేను నమ్మను... ఈ ఏడాది నువ్వు ఒక్క సినిమా అన్నా చూశావా?'

'ఈ సినిమాస్క్రిప్ట్ పుస్తకం ఎందుకు కొన్నానో తెల్సా? చిన్నప్పటి వ్యామోహం గుర్తుకి వచ్చింది. ఆ పిచ్చి ఇప్పుడు నాకు లేదు. అప్పుడు మాత్రం సినిమాలు బాగా చూసేవాడిని. చాలా స్క్రిప్టులు మనసులోనే రాసుకున్నాను కూడా. ఆ సంగతి ఇప్పుడు ఎందుకు చెబుతున్నానో తెలుసా? ఆ పిచ్చి ఇప్పుడు ఉంటే నీ కథని ఆధారంగా తీసుకుని ఓ సినిమా కథ అల్లేవాడిని. ఓ స్నేహితురాలు ఆస్తి కోల్పోతే హీరో రకరకాల ప్లాన్లు వేసి ఆ ఆస్తిని తిరిగి సంపాదిస్తాడన్నమాట... ఎలా ఉంది కథ?'

అతని మాటలని జాగ్రత్తగా విన్న గీతకి పట్టరాని సంతోషం కలిగింది. అంతలో ప్రేమలేఖ అని తను ఊహలో తేలిపోతే అతను కర్కశంగా పది రూపాయలని పంపిన సంఘటన గుర్తుకి వచ్చింది. ఇంకో డోస్ ఇవ్వాలి అనుకుంది. రుమాలుతో పొడికళ్లని అద్దుకుంది. గొంతులో జీరని పలికిస్తూ 'యోగి బాబు! మా దురదృష్టాన్ని నీకు సినిమా తీయాలన్నంత వినోదంగా ఉందా?' అంది. ఇంకోసారి కళ్లు అద్దుకుంది గీత.

అతని మొహం పాలిపోయింది. 'సారీ గీతా! సారీ! నా ఉద్దేశం నిన్ను గాయపరచాలని కాదు' కంగారుపడ్డాడతను.

బేలగా మారిన అతని వదనాన్ని చూస్తే గీతకి జాలి వేసింది. 'ఇక చాలు... ఈ నాటకానికి తెర దించాలి. అప్పుడెప్పుడో అనుకున్నట్లు హోటల్.. కాఫీ.. అన్నీ సమకూడాయి. అంతేకాదు.. కాఫీ చాలా బాగుంది కూడా. ఇదే మంచి సమయం. పకపకా నవ్వింది. 'యోగి బాబూ అని ఎందుకు పిలుస్తున్నానో తెలుసా?'





ఆమె నవ్వుకి, ఆ ప్రశ్నకి అతను బిత్తర పోయాడు.

'ఆ బంగాళాలో తార అనే అమ్మాయికి నేను ట్యూషన్ చెబుతాను. అంతే! అది మా ఇల్లు కాదు. నువ్వు వచ్చింది మా ఇంటికే. అర్ధమయిందా?'

యోగి మొహం ఎర్రబడింది. మెల్లగా రంగుమారి మొహంలో చిరునవ్వు ప్రత్యక్ష మయింది. 'మరీ అంత నాటకమా?' అన్నాడు. కొంచంసేపు ఆగి చెప్పాడు. 'ఆ రోజున మీ ఇంటికి వచ్చిన రోజున సీలిం గ్‌కి ఉన్న బూజుని, ఇంట్లో సామానులు అమర్చిన విధానం చూశాక కొన్ని రోజుల క్రితమే మీరు ఆ ఇంట్లోకి వచ్చారంటే నమ్మలేం అనుకున్నాను. కాని నీ యాక్షన్ ముందు నా అనుమానాలు దూదిపింజలు లాగా ఎగిరిపోయాయి. నువ్వు ఆ బంగళాలోకి వెళ్లటం, జీరో నిన్ను మొరు గుతూ ఆహ్వానించటం చూశాను. ఆ ఇల్లు మీదే అని బలంగా అనిపించింది.

అలాంటి ఇంట్లో ఉండే నువ్వు బస్సు లలో ఎందుకు తిరుగుతున్నావు. నీ వస్త్ర ధారణ సీదాసాదాగా ఉందేమిటా అన్న సందేహాలని పక్కకి నెట్టేశాను. ఆ తరు వాత నువ్వు స్టాక్ మార్కెట్ గురించి చెప్పాక పూర్తిగా నమ్మేశాను. అలాగే రామర్ చేసిన ప్రదర్శన చూసిన ఓ ఐఐటి ప్రొఫెసర్ తన కళ్లనే నమ్మి సాధ్యాసా ధ్యాల గురించి విస్మరించి, ఏవేవో భాష్యాలు చెప్పటానికి ప్రయత్నించి ఇప్పుడు నవ్వులపాలయ్యింది.. అంటే నేను చూశాను కాబట్టి నిజం అన్న గాఢ విశ్వాసం అన్నమాట.. కొన్ని రోజుల క్రితం ఓ నదీతీరంలో ఇసుక నుండి ఓ స్వామీజీ భగవద్గీతపుస్తకాన్ని తీయటం చూసిన ఓ పేరుపడ్డ సైంటిస్ట్ ఆ స్వామీజీకి అతీత శక్తులు ఉన్నాయన్న నిర్ణయానికి వచ్చి అనుంగు భక్తుడ య్యాడు. అద్భుతంగా ప్రత్యక్షమయిన ఆ పుస్తకం ఎక్కడ ప్రింట్ అయిందో స్పష్టంగా రాసి ఉందేమిటా అన్న సంశయం కాని అంత పవిత్రంగా ఉద్భ వించిన ఆ పుస్తకంలో అచ్చుతప్పులు ఉన్నాయి ఏమిటా అన్న సందేహం కాని అంత పెద్ద సైంటిస్ట్‌గారికి కలగకపోవటం దురదృష్టం...'

'ఆ ప్రొఫెసర్‌లాగా, ఆ సైంటిస్ట్‌లాగా నువ్వూ పప్పులో కాలు వేశావన్నమాట...' అంది గీత. 'అందుకనే ఇంకో కాఫీ తాగుదాం సరేనా?' కాఫీ ఆర్డర్ చేసింది.

తనకి తట్టిన సినిమా కథ గురించి చెబుతూ హీరోకి ఓ ప్రే...అని తమాయిం చుకొని, ఓ స్నేహితురాలు ఉంటుంది అని యోగి ఎందుకు అన్నాడో ఆమె ఊహించ గలిగింది. హీరోకి ఓ ప్రేయసి ఉంటుంది అని చెప్పబోయి అతను స్నేహితురాలిగా మార్చాడని ఆమె సరిగ్గానే ఊహించింది. తమ మధ్య ఉన్నది ప్రేమ అన్నది తెలి యజేయటానికి ఇది సమయం కాదని అతను అనుకుంటే తను మాత్రం ఎందుకు బయటపడాలి?

'గీతా! ఏమిటీ ఉన్నట్లుండి ఏదో ఆలోచ నలో పడిపోయావు?'

గీత నవ్వింది. 'నువ్వు చెప్పిన సినిమా కథ గుర్తుకి వచ్చింది... అవునూ... మరి నువ్వు ఇప్పుడు సినిమాలలో పనిచేయటం గురించి ఆలోచించటం లేదా?'

అతను నవ్వాడు. 'ఇప్పటి నా టెంపర్ మెంట్‌కి అది సరిపడదు...'

'...ఒకే యోగి! ఇక నేను వస్తాను'

అప్పుడే? అతను వాచ్ చూసుకున్నాడు. 'సరే నేనూ నీతోపాటు బస్సులో మీ ఇంటి వరకూ వస్తాను...' అంటూ చనువుగా గీత పర్సు తీసి బిల్‌కి సరిపోయే డబ్బులు ప్లేట్‌లో ఉంచాడు.

'నో! నువ్వు నాతోపాటు రావటంలేదు'

చూపుడు వేలు ఆడిస్తూ అంది గీత.

'నేనొక్కదాన్నే బస్సులో కూర్చుని సీరియస్‌గా ఆలోచించాలి. అర్థమయిందా?

'దేని గురించి? '

'సారీ! ఐ హేవ్ మై ఓన్ సీక్రెట్స్... ఇప్పుడు చెప్పను... తరువాత ఎప్పుడయినా చెప్పాలనిపిస్తే నీకు తెలుస్తుంది.'

లేకపోతే పంతొమ్మిది వందల తొంభై ఆరు డిసెంబరు ఇరవైరెండు ఆదివారం నాడు గీత సిటీబస్సులో కూర్చుని ఏం ఆలోచించిందా అన్నది నీకు ఎప్పటికీ తెలియని మిస్టరీగానే మిగిలిపోతుంది.'

'ఇది చాలా అన్యాయం గీతా! ఇద్దరం కలిసి ఇన్ని పుస్తకాలు కొన్నామా, ఇప్పుడు అవన్నీ నన్నే మోసుకుంటూ వెళ్లమనటం ఏ బాగాలేదు... సగం దూరమయినా నువ్వు ఆ భారం మోస్తావనుకున్నాను.'

అతను ఇంకా తండ్రి గురించి పూర్తిగా చెప్పలేదు...

అందుకనే ఇంటికి రమ్మనమని అడగడంలేదు... సగం దూరం వరకయినా రమ్మనమని అంటున్నాడు!

'నో ఛాన్స్! నో ఛాన్స్..!' అంది గీత. 'నువ్వో పని చేయవచ్చు యోగీ... నేను ఉన్నానని ఇందాకటి నుంచి మొహమాటపడి సిగరెట్ తాగలేదు కదా. కొంతసేపు పొగ తాగి అప్పుడు బస్సు ఎక్కు... బై!'

బస్సులో కూర్చుని గీత ఆలోచనలో పడింది. అలా ఒంటరిగా కూర్చుని ఆలోచించే అవకాశం కోసమే ఆమె అర్థాంతరంగా యోగికి బై చెప్పి వచ్చింది.

ఈ రోజు ఎందుకో కుదరలేదు. కాని రేపో, వచ్చే వారమో కాకపోతే త్వరలోనే యోగి పెళ్ళి ప్రస్తావన తెస్తాడు. ఈలోగా తల్లికి ఈ సంగతి గురించి చిన్న హింట్ ఇస్తే మంచిదేమో! పెళ్లి గురించి ఓ నిర్ణ

యానికి వచ్చాక ఆ సంగతిని తల్లికి చెప్ప కుండా దాయటం తప్పే!... తను రహస్యంగా ఉంచానని తల్లికి తెలిస్తే బాధపడుతుంది. ఆమె అనుభవించిన బాధలు చాలు... తనవల్ల తల్లికి కించిత్తు ఇబ్బంది కూడా కలగకూడదు. అలాగని త్వరపడి చెప్పేయటం కూడా సరి కాదు... ఎందుకంటే తల్లికి యోగి గురించి చెబితే ఏమంటుందో, ఎలా రియాక్ట్ అవుతుందో ఊహించాలి... ఆ ఆలోచన రాగానే ఆమె ఏకాంతాన్ని అభిలషించింది. ఒంటరిగా కూర్చుని తల్లికి ఏమన్నా అభ్యంతరాలు ఉంటాయా అని ఆలోచించాలి అనుకుంది. అతను రేషనలిస్ట్... హేతువాది... అని చెబితే అమ్మ 'మీ నాన్న లాగానా?' అని తప్పకుండా అంటుంది. ఆ ప్రశ్నని ఎలా ఎదుర్కొంటుంది? ... లాభం లేదు... తన దగ్గర సమాధానం లేక కాదు... తల్లి నొచ్చుకోకుండా, తన కూతురు తొందరపడి నిర్ణయం తీసుకుందా అన్న ఆందోళన తల్లికి కలగకుండా సామరస్యంగా తల్లికి నచ్చచెప్పాలి... అదీ ముఖ్యం...

అలా గీత ఆలోచనలు గజిబిజిగా సాగాయి. అవి స్పష్టమైన రూపు దాల్చకుండానే ఆమె దిగాల్సిన స్టాప్ వచ్చింది.

'కొత్త సంవత్సరంలో వీలయినంత త్వరలో తల్లికి చెప్పాలి... మరీ ఆలస్యం చేయకూడదు...' అనుకుంటూ ఇల్లు చేరింది గీత. ఇంటి ముందుకి రాగానే గీతకి ఓ సంగతి గుర్తుకి వచ్చింది. స్క్రిప్ట్ రైటింగ్ పుస్తకం కొన్నాక ఇక నా దగ్గర డబ్బులు లేవు మేడమ్ అన్నాడు యోగి. హోటల్ బిల్ చెల్లించటానికి అందుకనే మొహమాట పడకుండా తన పర్సులోంచి డబ్బులు తీశాడు... ఇంటికి వెళ్ళటానికి అతని దగ్గర డబ్బులు ఉన్నాయో లేదో? ... లేకపోతే అన్ని పుస్తకాల బరువుతో ఏం చేశాడో? !...

'ఏమిటే గీతా! అలా నిలబడ్డావేమిటి? ...' తల్లి ప్రశ్నిస్తుండటంతో ఈ లోకంలోకి వచ్చింది గీత. 'ఏమీ లేదమ్మా...' అంది.

పాపం యోగి!!...




**'ఈ** రోజు జనవరి రెండు...' అన్నాడు యోగి.

'పనీ పాటా లేని రాజకీయవేత్త ఈ రోజు పంద్రాగస్ట్ అన్నట్లు ఏమిటా ప్రకటన? ' గీత అడిగింది.

'కారణం ఉంది మేడమ్... ఈ రోజున నా గురించి, మా నాన్న గురించి చెబుతాను... అసలు నిన్ననే చెప్పాలని తయారయ్యాను. కానీ కొత్త సంవత్సరం మొదటి రోజునే నీ మూడ్ చెడగొట్టటం ఎందుకు అని ఆగాను... అందుకని తేదీల ప్రస్తావన... అర్థమయిందా? '

గీత బుద్ధిమంతురాలిలాగా చేతులు కట్టుకుంది.

యోగి మెల్లగా చెప్పసాగాడు. చిన్ననాటి జ్ఞాపకాలతో మొదలుపెట్టి మొన్న మొన్నటివరకూ జరిగిన ముఖ్యమైన సంగతులన్నీ చెప్పాడు. '... ఎప్పుడయితే నేను స్వతంత్రంగా ఆలోచించి నా అభిప్రాయాలని కచ్చితంగా చెప్పేవాడినో అప్పటి

నుండి మా ఇద్దరి మధ్యా పోట్లాటలు పెరిగాయి... ఫలానా పనిచేసి ఎంత తప్పు చేశానో, ఇంకోపని చేయకుండా ఎంత ఘోరమైన పొరపాటు చేశానో ప్రతిరోజూ ఓ రివ్యూ మీటింగ్ పెట్టేవాడు నాన్న. ఇప్పుడయితే ఇలా నవ్వుతూ చెబుతున్నాను గాని అప్పుడయితే నా రక్తం సలసలా ఉడికిపోతుండేది... బాగా ఎదురు తిరిగాను... నిజానికి చాలా రోజులు ఓ రెబెల్ లాగా ప్రవర్తించాను. అది తప్పేమో అన్న విచక్షణ వచ్చేసరికి చాలా డామేజి జరిగింది...' అన్నాడతను ముక్తాయింపుగా.

ఆ మాటలు చెబుతూ కూడా అతను నవ్వుతూ ఉన్న మాట వాస్తవమే గాని కళ్లల్లో స్వల్పంగా మార్పు వచ్చిందన్న అనుమానం గీతకి కలిగింది... జరిగిన దానికి అతను పశ్చాత్తాప పడుతున్నాడా? తల్లిలేని లోటు తెలియకూడదని ఎక్కువ శ్రద్ధ తీసుకున్న తండ్రిని సరిగా అర్థం చేసుకోలేదని ఇప్పటికయినా అనుకుంటున్నాడా..? ఇంకో పెళ్లి చేసుకోకుండా తన కోసమే జీవితం గడిపిన తండ్రికి దాదాపుగా శత్రువుగా మారటంలో తన తప్పు ఎంతో ఇప్పుడు అంచనా వేసుకుంటున్నాడా...?

యోగి మీదే కాదు ఇంకా తాను చూడకపోయినా అతడి తండ్రి రంగారావు మీద కూడా జాలి కలిగింది గీతకి.

★ ★ ★

ఆ మర్నాడు సాయంకాలం యోగితో కలిసి అతని ఇంటికి వెళ్లింది గీత. బస్సు దిగాక దారిలో మెడికల్‌షాప్ దగ్గర ఆగాడు యోగి. 'నాన్నకి దగ్గుగా ఉంది. కాఫ్ సిరప్ కొనాలి' అన్నాడు.

'డాక్టరు దగ్గరికి తీసుకువెళ్లక పోయావా?' అడిగింది గీత. 'ఇలా స్వంత వైద్యం ఎందుకు?'

'ఈ స్వంతవైద్యం కూడా నా తృప్తికే...' ఆయన ఈ సీసా ముట్టుకోకపోవచ్చు.. ఎప్పుడో సిగరెట్లు ఎక్కువగా తాగితే నాకే అవసరం రావచ్చు..' ఆ మాటలు చెబుతూ యోగి ఎలా నవ్వాడో గీతకి అర్థం కాలేదు.

కాంపౌండ్‌కి ఉన్న గేట్ తీస్తుంటేనే రంగారావు దగ్గు వినబడింది.

వీళ్లు వెళ్లేసరికి రంగారావు భగవద్గీత చదువుతూ ఉన్నాడు.

'నాన్నా! నీ దగ్గు బయటికి వినబడుతోంది... మందు వేసుకోవాల్సింది...' అన్నాడు యోగి.

అతని వీపుమీద సుతారంగా గిల్లింది గీత...

ఇద్దరికీ అంతా పొసగనప్పుడు కనబడ

## మరోసారి..

ఓ కేసులో తనవాదనలు విన్పిస్తున్న ఓ న్యాయవాది కోపావేశానికి లోనై 'నా సోదరుడు (అవతల పార్టీ లాయరు) చెప్పింది న్యాయశాస్త్రానికి విరుద్ధంగా ఉంది. చట్టమే గనక అంత అవకతవకలుగా ఉంటే దాన్ని తగలెట్టాల్సిందే' అన్నాడు.

'అంతకంటే ఆ చట్టాన్ని మీరు మరో మారుచదవడం మంచిదేమో?' సున్నితంగా సలహాఇచ్చాడు న్యాయమూర్తి.





గానే సలహాలు ఇవ్వటంకాని, విమర్శ చేయటంకాని మంచిపని కాదనీ... ఏన్నో తెలిసిన ఈ అబ్బాయికి తెలియదా..? మొదటగా తనని పరిచయం చేయచ్చు కదా..? రెండు మూడు నిముషాల తరువాత మెల్లగా ఇప్పుడు నీ దగ్గు ఎలా ఉంది అని ఆరాతీయచ్చు కదా..? గీత మనసులో ఈ పాయింట్లు అన్నీ గుర్తుంచుకుంది... అతనికి అర్జెంట్‌గా ఈ విషయంపైన క్లాసు పీకాలి అనుకుంది.

'నేను మందు వేసుకున్నాను...' అన్నాడు క్లుప్తంగా రంగారావు.

'వేసుకున్నావా...? ఏ మందు?' ఆత్రుతగా అడిగాడు యోగి.

'మందు అంటే టెర్బుటలైన్ సల్ఫేట్ ఐ.పి. అనీ, బ్రామ్ హెక్సయిన్ హైడ్రోక్లోరైడ్ ఐ.పి. అని పేర్లుండనక్కరలేదు... పావలా బిళ్లకి అర్థరూపాయి తగరం చుట్టి నాలుగు రూపాయలకి అమ్మక్కరలేదు... అడ్డమైన కెమికల్సుతో శరీరాన్ని పాడుచేసుకోవటమే మందులు వేసుకోవటం కాదు...'.

గీతకి ఆ ప్రవచనాలు ఎందుకో అర్థం అవలేదు. యోగి ఆమెకి చాలా సంగతులు చెప్పాడు కాని, జరిగినవన్నీ ఏకరవు పెట్టలేదు.

యోగి తమాయించుకున్నాడు. సరే నాన్నా! ఇంతకీ నువ్వు వేసుకున్న మందు ఏమిటి?'

'కరక్కాయ...'

గీత విస్తుబోయింది.

యోగి నిట్టూర్చాడు... అతనికి అప్పుడు తెలిసిందేమో వాదనని ఇక పొడిగించలేదు. 'నాన్నా! ఈమె గీత అని యూనివర్సిటీలో రీసెర్చ్ చేస్తోంది...' అని పరిచయం చేశాడు.

గీత నమస్కరిస్తే ఆయన తల ఊపి మర్యాదకోసం రెండు మూడు ప్రశ్నలు అడిగాడు.

యోగి ఆపిల్ ముక్కలున్న ప్లేట్లను ఇద్దరికీ అందించాడు.

రంగారావు ఓ ముక్క తిన్నాడో లేదో దగ్గు ముంచుకు వచ్చింది.

ఆయన తేరుకున్నాక మంచినీళ్లు ఇచ్చి యోగి అన్నాడు, 'కరక్కాయ మందు ఎలా అవుతుంది నాన్నా?'

'ఎందుకు కాదు... నాకు ఎంత ఉపశమనంగా ఉందో తెలుసా... పొద్దున అయిదు నిముషాలకి ఒకసారి దగ్గు వచ్చింది...

'ఇప్పుడు ఆ వ్యవధి పెరిగింది...'

'నిజమే! కాని యాంటీబయాటిక్స్ లాంటివి వేసుకుంటే కాస్త తొందరగా తగ్గుతుందేమో కదా అంకుల్...' అంది గీత.

'తగ్గటం నిజమే... ఏమిటనుకున్నావు? ఒంట్లో జబ్బు కాదు... మన జేబులో డబ్బు... మల్టీ నేషనల్ కంపెనీలు, కార్పొరేట్ హాస్పిటల్స్ కలిసి జబ్బులభయం పెట్టి జనాల డబ్బులు కాజేస్తున్నారు...'

గీత నాలిక కరుచుకుంది... అలోపతి మందుల పైన ధ్వజం ఎత్తటం బహుశా ఈయన అభిమాన విషయం కాబోలు.

'మాట వరసకి అది కాజేయటమే అనుకుందాం. దోపిడీనే జరుగుతుందని అంగీకరిద్దాం. నువ్వొక్కడివి మానినంత మాత్రాన ఆ దోపిడీ ఆగుతుందా? ఆలోచించు నాన్నా' సానునయంగా అన్నాడు యోగి.

'ఇది నా ప్రిన్సిపుల్! దీనికి నేను కట్టుబడి ఉంటాను. అయినా నువ్వు కొత్తగా మాట్లాడుతున్నావేంటి? ఎవరికీ లేని శాస్త్రీయ దృక్పథం నాకుంది అని నువ్వు ఒక్కడివి భుజాలు ఎగరవేయకపోతే దేశానికి జరిగే నష్టం ఏమిటి అని నీ చిన్నప్పటి నుంచి నేను మొత్తుకున్నాను... నువ్వు విన్నావా?' రంగారావుకి మళ్ళీ దగ్గు తెర వచ్చింది.

## విరేచనకారులతో ఇబ్బందులు...

"మలబద్ధకమా?" అయితే... వాడండి. అంటూ తరచూ మన బజార్లో కరప త్రాలు, పోస్టర్లు చూస్తుంటాం. ఎక్కువ కాలం ఈ విరేచనకారి (లాగ్జేటివ్స్) మందులు వాడటం వలన మలాశయపు నరాల కణాలు నశిస్తాయి. అంతేకా కుండా పెద్ద ప్రేగు సంకోచించకపోవటం, దానివల్ల మలవిసర్జన కష్టమవటం జరుగుతుంది.

ఎక్కువరోజులు విరేచనకారి మందులు వాడటం వలన మలద్వారం దగ్గర కండరాలు, శరీరపు ఆజ్ఞలకి స్పందించడం నిలిపి, విరేచనకారి ఆజ్ఞలనే శిరసావహిస్తాయి. దీనివలన ప్రతిరోజు విరేచనకారులను వాడటం తప్పనిసరి అవుతుంది. అంతేకాక మినరల్ నూనెలు ఎప్పుడూ విరేచనకారులుగా వాడటం వలన మన శరీరంలో ఉండే కొవ్వులో కరిగే ఎ.డి. ఇ.కె. విటమిన్లు నశిస్తాయి.

ప్రతిరోజూ మలవిసర్జన చెయ్యకపోతే చాలామంది తమకు మలబద్ధకం ఉన్నట్టు అపోహ పడతారు. అది నిజం కాదు. ఇది ఒక వ్యక్తికి మరో వ్యక్తికి మారుతుంటుంది. అదెలాగంటే రోజుకు మూడు సార్లైనా కావొచ్చు. వారానికి మూడు సార్లైనా కావొచ్చు.

కాబట్టి విరేచనకారుల్ని వాడి విపత్కర పరిస్థితులు ఎదుర్కొనే కంటే... మంచి ఆహారం, వ్యాయామం, అలవాట్లు మలబద్ధకాన్ని, మన బద్ధకాన్నీ వదిలిస్తుందని నిపుణులు చెబుతున్నారు.

గీత నిట్టూర్చింది. యోగికికాని, రంగారావుకికాని విడివిడిగా లేదా కలిసి కానీ క్లాసులు ఎన్ని తీసుకున్నా ప్రయోజనం ఉండదేమో అని ఆమెకి తోచింది. ఇద్దరి మధ్యా సంబంధాలు పాయింట్ ఆఫ్ నో రిటర్న్ అంటారే ఆ దశకి చేరాయి కాబోలు అనుకుంది.

దగ్గు తగ్గాక రంగారావు గీత వంక తిరిగాడు. 'నేను చాదస్తంగా మాట్లాడుతున్నానని అనుకోకు. మావాడితో స్నేహం చేసినపుడు ఆదర్శాలు, అభ్యుదయాలు, హేతువాదాలు, రేషనల్ థింకింగులూ గట్రా చాలా ఆకర్షణీయంగా కన్పిస్తాయి. కాని నగ్న సత్యం ఏమిటంటే ఇవేవి కడుపుకి కూడు పెట్టవు. అవసరానికి పనికి రావు. మనిషిని ఉలిపికట్టెలాగా ఏకాకిగా మార్చి చుట్టూ అగాధాలు సృష్టిస్తాయి. అంతే...'

★ ★ ★

మొదటిసారిగా యోగి ఇంటికి వెళ్లినపుడు నీ భావాలు ఎలా ఉన్నాయి అని ఎవరయినా ఇంటర్వ్యూ చేస్తే ఏం చెపుతానో తెలియదుకాని కచ్చితంగా గజిబిజి, గందరగోళం అన్న పదాలు మాత్రం ఉపయోగిస్తాను అనుకుంది గీత. ఆ మర్నాడు వినాయక్‌తో మాట్లాడుతున్నా, ప్రొఫెసర్‌తో చర్చిస్తున్నా, లైబ్రరీలో కావలసిన సమాచారం సేకరిస్తున్నా రంగారావు అన్న మాటలు జ్ఞాపకానికి వచ్చి ఆమెని ఇబ్బంది పెట్టాయి.

అందువల్లే కాబోలు సాయంకాలానికి తలనొప్పిగా అనిపించింది ఆమెకి. ఇక దుకాణం కట్టేసి ఇంటికి వెళ్ళి విశ్రాంతి తీసుకోవటం బెస్ట్ అని అనుకుంటుంటే ప్రొఫెసర్ నుండి కబురు వచ్చింది. చచ్చా

## చచ్చుప్రశ్న

**ఓ** కేసులో సాక్షి నేరం జరిగిన సమయాన్ని నిమిషాలతోసహా చెప్పాడు.
న్యాయవాది 'నిముషాలతో సహా అంత కచ్చితంగా ఎలా చెబుతున్నావు?' అని ప్రశ్నించాడు.
'నా చేతికి వాచీ ఉంది సార్' అన్నాడు సాక్షి.
'టైము చూడాల్సిన అవసరం ఏమొచ్చింది?'
'ఇలాంటి చచ్చుప్రశ్న ఎవడోఒకడు వేస్తాడని ముందే ఊహించాను సార్. అందుకే చూశాను' సాక్షి జవాబు.




నురా బాబూ' అనుకుంది గీత. తలనొప్పి పీడిస్తున్నా, తల అనేది అసలు లేకపోయినా ఇప్పుడు ఆయన ఎదురుగా నవ్వు మొహంతో కూర్చుని ఆయన చెప్పేవన్నీ వినక తప్పదు.

ఆయన ఊరు వెళుతున్నాడట. నాలుగు రోజుల తరువాత వస్తాడట.. గీతకి కొన్ని సూచనలు ఇచ్చాడు. ఆమె తల ఊపి లేవబోతుంటే ఆయన అన్నాడు. ఈ సంక్రాంతి మ్యాగజైన్‌లో యోగి కథ పడింది.. చూశావా? చాలా బాగుంది...'

'ఓహో ఈయనకి ఈ టాలెంట్ కూడా ఉందా అనుకుంది గీత. వినాయక్‌ని అప్పుడప్పుడు క్రికెట్‌స్కోర్ అడగటం తప్పితే ఆయన కెమిస్ట్రీ తప్ప మిగిలిన విషయాల జోలికి సాధారణంగా వెళ్లడు మరి'

'నిజానికి నాకు యోగితో పరిచయం అయింది, వినాయకుడు పాలు తాగాడని పుకారు వ్యాపించిన రోజునే...'

గీత తలనొప్పి మాయమయింది. ఆసక్తిగా వినసాగింది.

ప్రొఫెసర్ మాటలలోనే చెప్పాలి అంటే ఆయన కొన్ని సందర్భాలలో హేతువాది. కొన్నిసార్లు కాదు. వినాయక విగ్రహం పాలు తాగుతున్నది అని విన్నప్పుడు ఆయనకి కుతూహలం పుట్టింది. ఓ సీసాలో పాలు తీసుకుని భార్యాసమేతంగా ఆయన దగ్గరలో ఉన్న గుడికి వెళ్లాడు.

యోగి కొంతమంది స్నేహితులతో వచ్చాడు. విగ్రహాలు పాలు తాగటం అసాధ్యం అనీ... కాపిలరీ యాక్షన్ వల్లను, సర్ఫేస్ టెన్షన్ వల్లను విగ్రహం పాలు తాగిన భ్రాంతి కలుగుతుంది అని చెప్పసాగాడు.

కొంతమంది విసుక్కున్నారు. 'దేవుడన్నాక మహిమలు ఉండవా... ఆ మహిమలు కళ్లారా చూసి తరించటం తప్పా? అడ్డుపడి అపరాధం చేయకు...' అన్నారు.

అప్పుడు యోగి దృష్టి ప్రొఫెసర్ పైన పడింది. ఆయన దగ్గరకి వచ్చి 'సర్! మీరు కూడానా? అని అడిగాడు. ప్రొఫెసర్ సమాధానం చెప్పడానికి తత్తరపడ్డాడు. 'యోగీ.. ఐన్‌స్టీన్ లాంటి గొప్ప శాస్త్రవేత్త సైన్స్ వితవుట్ రిలీజియన్ ఈజ్ లేమ్... రిలీజియన్ వితవుట్ సైన్స్ . ఈజ్ బ్లయిండ్ అన్నాడు. ఆయనే మతాన్ని, మతం బోధించే విషయాలని నమ్మాడు.. ఇక మనమెంత?' అన్నాడు.

యోగి మొహం మారింది. 'ఐ థింక్ దిసీజ్ ది మోస్ట్ ఎబ్యూజ్‌డ్ కొటేషన్ సర్. ఆయనకి ఒకరకమైన ఆధ్యాత్మిక భావన ఉన్నమాట నిజమే! దాన్ని ఆయన కాస్మిక్ రిలీజియన్ అని పిలిచేవాడు. స్తోత్రాలకి అనుగ్రహించే దేవుడిపైనకాని,

కోపించి శపించే దేవుడిపైనకాని నమ్మకం లేదని చాలాసార్లు సుస్పష్టంగా చెప్పాడు. ఈ విశ్వం అంతా కొన్ని నియమనిబంధనలకి లోబడి నడుస్తున్నదని ఆయన నమ్మాడు. శ్రమతో, విచక్షణా వివేకాలతో అలుపెరగక ఆ అంతర్‌లీల అదృశ్య అమరిక గురించి శోధించడమే ఆయన దృష్టిలో దైవారాధన అద్భుతాలు, మిరకిల్స్‌పైనా ఆయనకి నమ్మకమే లేదు...'

ప్రొఫెసర్ దెబ్బతిన్నాడు.

'యోగి అంతటితో ఊరుకోలేదు. ఆ తరువాత రోజు నా దగ్గరికి వచ్చాడు. న్యూయార్క్ టైమ్స్ మ్యాగజైన్‌లో ఐన్‌స్టీన్ రాసిన వ్యాసాన్ని, ప్రిన్స్‌టన్ థియోలజికల్ సెమినార్‌లో ఆయన చదివిన ఉపన్యాసాన్ని నాకు ఇచ్చాడు. అది చదివాక ఐన్‌స్టీన్ కొటేషన్‌ని అన్ని రోజులూ ఎంత తప్పుగా అర్థం చేసుకున్నానో అవగతం అయింది. మతం ఆవశ్యకత గురించి ఆయన బాగా చర్చించాడు. మనిషి నీతి నియమాలతో ప్రవర్తించడానికి మతం అవసరంలేదని ఆయన అన్నాడు. స్వర్గం ఆశ చూపించో, నరకభయం కలిగించో మనిషిని ప్రలోభపెట్టటం అధమం అని ఆయన అన్నాడు' ప్రొఫెసర్ చెప్పుకుపోయాడు. 'అప్పటి నుండి నాకు యోగి అంటే అభిమానం... ఆ సంఘటన జరిగి ఏడాది దాటింది. ఈ ఏడాదిలో నా దృక్పథం మారింది అంటే దానికి కారణం యోగి...'

యోగి గురించి ప్రొఫెసర్ ఎందుకంత ఎక్కువగా మాట్లాడాడో గీతకి సరిగ్గా తెలియలేదు. ఈ మధ్య కాలంలో తాము సన్నిహితంగా తిరుగుతున్నామని గమనించాడా అన్న సందేహం ఆమెకి కలిగింది.

ఎవరూ ఆలోచించని విధంగా ఆలోచించటం, కొంతమందికే చేతయినట్లు ప్రతిస్పందించటం అతని తత్వం అని ఇంకోసారి స్పష్టంగా తెలిసింది. మిగతావాళ్లు అసలు పట్టించుకోని విషయాలకి, అంతగా గమనించని...గమనించినా ఓపికగా భరించే విషయాలకి కలవరపడటం అతని లక్షణం. అది కచ్చితంగా సుగుణమయినా అప్పుడప్పుడు దుర్గుణంగా తోచవచ్చు. ఆ లక్షణం ఉండటం వరమయినా అప్పుడప్పుడూ శాపంగా మారచ్చు. అయితే గియితే సోషల్ టెంపర్ లేకపోవటం అతనిలోని లోపం కావచ్చు.అయినా అది లోపం ఎలా? అతన్ని విలక్షణంగా చేసింది అదే కదా? అనుకుంది గీత.

ఆ ఆలోచనలు ఇచ్చిన ధైర్యంతో ఆ రాత్రి గీత తల్లికి బాలవాక్కు కథ చూపించింది. చిన్నకథ కాబట్టి జయ వెంటనే చదివింది. చదవటం అయ్యాక తల్లి ఏమన్నా అంటుందా అన్నట్లు ఆమె మొహంలోకి చూసింది గీత.

'గుడిలో ఉన్న విగ్రహాన్ని దేవుడు అని అంటాం... విగ్రహం కాబట్టి పాలు తాగితే అద్భుతంగా తోస్తుంది. ఇందులో వింత ఏముంది...? నాకు అర్థం అవటంలేదు' జయ అంది.

'నిజమే... యోగి అంత సులువుగా అర్థం అవడు' అనుకుంది గీత. విగ్రహం అని తెలిసినప్పుడు దేవుడు అందులో ఉన్నాడని ఎలా భావిస్తున్నావు...? విగ్రహంలో దేవుడున్నాడని నీ ప్రార్థనలు వింటున్నాడని బలంగా నమ్మితే పాలు తాగితే ఆశ్చర్యం ఎందుకు కలగాలి? అనుకుంది గీత.

'అయినా ఈ కథ మూలంగా ఉపయోగం ఏమిటి?'

'ఉపయోగం ఉందమ్మా... నేను తొందరపడి యోగి గురించి నీకు చెప్పకపోవటం మంచిది అన్న సలహా నాకు దొరకటమే దాని ఉపయోగం...' అనుకుంది గీత.

ఆ తరువాత ఆమె యోగి గురించి







ఇంట్లో ఎప్పుడూ ప్రస్తావించలేదు. పెళ్లి గురించి ఓ నిర్ణయానికి వచ్చాక ఆ సంగతిని తల్లికి చెప్పకుండా దాయటం కూడా తప్పే అనుకున్న గీత అభిప్రాయాన్ని మార్చుకుంది.

★ ★ ★

యోగి పరీక్షలు బాగా రాశాడు. ఉద్యోగాన్వేషణలో పడ్డాడు. గీత థీసిస్ కూడా ఓ రూపానికి వచ్చింది. రెండునెలల తరువాతకూడా యోగికి ఉద్యోగం రాలేదు కానీ గీత పిహెచ్‌డి వైవా అయిపోయింది.

ఇంకో రెండునెలల తరువాత కెమికల్ టెక్నాలజీ ఇన్‌స్టిట్యూట్‌లో సైంటిస్ట్‌గా ఉద్యోగం వచ్చింది గీతకి. ఉద్యోగంలో చేరాక వారంరోజుల పాటు యోగిని చూడటం, మాట్లాడటం కుదరలేదు. అందుకనే మొదటి సెలవు రోజున యోగి ఇంటికి వెళ్ళింది గీత.

'ఆయనగారు పొద్దున్నే బయటికి వెళ్ళాడు... ఏదో హడావిడిగా టిఫిన్ తయారు చేశాడు... లంచ్‌టైమ్‌కి వస్తానన్నాడు...' రంగారావు అన్నాడు. 'వస్తాడనే అనుకుంటున్నాను... ఎందుకంటే వంట తనే చేస్తానని నన్ను వంటగదిలోకి అడుగు పెట్టద్దని హెచ్చరించాడు మరి...'

'అయితే నేను కాసేపు ఎదురుచూస్తాను అంకుల్' అంది గీత. రంగారావు తలూపాడు.

'కాఫీ తాగుతావా? '

'మీరు తాగుతానంటే నేను కలుపుతాను...' అంది గీత కొంగు బిగిస్తూ.

'సరే!' అన్నాడు రంగారావు.

కాఫీ తాగుతుంటే సంభాషణ మెల్లగా యోగి వైపే వెళ్లింది. ఈ ప్రపంచంలో ఎవరినయినా అర్థం చేసుకోవచ్చు కాని మా వాడ్ని మాత్రం అర్థం చేసుకోలేం...' ప్రకటించాడు రంగారావు.

'యోగి చాలా తెలివిగలవాడు...' గీత అంది.

'తెలివి తేటలకి తక్కువలేదు... వాడి చిన్నప్పటి తెలివితేటలు చూసి నేను మురిసిపోయేవాడిని. ఐఏయస్ అవుతాడని కలలు కన్నాను... కాని గాలికి ఎగిరే చిత్తుకాయితంలా ఓ నియంత్రణ లేకుండా అటూ ఇటూ అవుతున్నది వాడి కెరీర్' రంగారావు నిట్టూర్చాడు. సైన్స్ అంటాడు... సైంటిఫిక్ టెంపర్ అంటాడు... ఐన్‌స్టీన్ అంటాడు... వాడు మాత్రం సైన్స్ చదవలేదు... ఈ క్లిష్టమయిన విశ్వరహస్యాలని అర్థం చేసుకోవటం ఎవరికయినా కష్టమే... దాంతో ఎవరికి తోచిన పరిధిలో వారు ఏవేవో జవాబులు ఇవ్వటానికి ప్రయత్నించారు... ఆధ్యాత్మికతని గాని, సైన్స్‌ని గాని అధ్యయనం చేయటం మానవుడు అలాగే మొదలు పెట్టాడు... ఇంత చిన్న విషయం వాడికి ఎందుకు అర్థం కాలేదో నాకు ఇప్పటికీ తెలియదు... వాడు నమ్మిన సైన్స్‌లోనే జవాబులన్నీ లభిస్తాయని మొండిగా అనుకోవటం మూర్ఖత్వం కాదా..? ఏ విషయంలోనైనా ప్రశ్నలు వేసుకుంటూ వెడితే ఏదో ఒక అడ్డుగోడ తప్పకుండా ఎదురవుతుంది... మానవ నేత్రం ఎలా పనిచేస్తుందో నేను ఒకసారి వివరంగా చదివాను. కంటిలో ఉన్న రెటినాపైన సిస్ రెటినల్ అనే కెమికల్ ఉంటుందిట... దానిపైన కాంతిలో ఉన్న ఫోటాన్ పడగానే సెకన్‌లో లక్షోవంతు సమయంలో అది ట్రాన్స్‌రెటినల్‌గా మారుతుందిట... అలా రెటినా పైనా ఒక ఆకారం ఏర్పడుతుందిట. సిస్ రెటినల్‌గా ఎందుకు మారుతుంది అంటే శాస్త్రవేత్తలు ఫోటాన్ నుంచి గ్రహించిన శక్తి వల్లనో, మరోటనో ఏదో ఒక సమాధానం ఇస్తారు... ఎందుకు గ్రహిస్తుంది అంటే

ఇంకో వివరణ... ఆ వివరణలో చెప్పిన విధంగానే ఎందుకు జరగాలి అంటే ఇంకో వివరణ... అలా అనంతంగా సాగిపో తూనే ఉంటుంది... అంటే ఏమిటి? ఆబ్స ల్యూట్ ట్రూత్ అనేది మానవ మేధకి అందేది కాదు అని తెలిసిపోతున్నది కదా...? అటువంటప్పుడు ఎవరికి తోచిన ఉజ్జాయింపులతో వారు కొత్త ఫిలాసఫీ చెప్పుకుంటే యోగి లాంటి వాళ్లకి ఎందుకు అభ్యంతరం? పరమత సహనం లేకపో వటం లాంటిదే కదా ఇది కూడా...!'

సాధారణంగా కనబడే రంగా రావు అంత లోతయిన విషయా లని అలవోకగా ప్రస్తావించటం గీతకి ఆశ్చర్యం కలిగించింది. బహుశా తెలివితేటల విష యంలో యోగికి తండ్రి పోలిక కాబోలు.

రంగారావు ధోరణి మార్చలేదు. 'ఏమన్నా అంటే ఐన్‌స్టీన్.. ఐన్ స్టీన్ అని జపిస్తాడు... ఐన్‌స్టీన్ ఒకసారి సైన్స్‌ని నిర్వచించటం చాలా తేలిక అన్నాడు. మానవు డికి అందుబాటులో ఉండి గ్రాహ్య సాధ్యమైన విషయాల గురించి జ్ఞానార్జన చేసి ఆ జ్ఞానాన్ని క్రమ బద్ధీకరించటం సైన్స్ అని అన్నాడు. అదే ఆధ్యాత్మికత అంటే ఇదీ అని చెప్పటం చాలా కష్టం అన్నాడు. ఒక వేళ నేను ఎంతో శ్రమపడి ఓ నిర్వచ నాన్ని పొందుపరిచినా అందులో ఒక లోపం ఉంటుంది... ఆధ్యాత్మికత గురించి జిజ్ఞాసతో తపించిన ఎందరో మహానుభా వుల ఆలోచనలని అన్నింటినీ స్వల్పంగా నయినా ఆ నిర్వచనంలో స్పర్శించలేను అని అన్నాడు. అంతేకాదు సైన్స్ గురించి చెబుతూ అది గత వంద ఏళ్లుగా సాగు తున్న శోధన అన్నాడు. అది చెప్పి

**ఎవరికి తోచిన ఉజ్జాయింపులతో వారు కొత్త ఫిలాసఫీ చెప్పుకుంటే యోగిలాంటి వాళ్లకి ఎందుకు అభ్యంతరం? పరమత సహనం లేకపోవటం లాంటిదే కదా ఇది కూడా!'**

డెబ్బయి ఏళ్లు అయిందనుకున్నా ఆయన ఉద్దేశంలో సైన్స్ వయసు రెండు వందల ఏళ్లు... మరి ఆధ్యాత్మికత కొన్ని వేల ఏళ్లుగా మనిషికి మార్గదర్శకతం ఇస్తు న్నది. అటువంటి దాన్ని మూఢనమ్మకం అని కొట్టిపారేయటం ఏమిటమ్మా? '

గీతకి నోట మాట రాలేదు. నిశ్చేష్టురా లయి రంగారావునే చూస్తుండిపోయింది.

'దేవుడు లేడు అంటాడు. సరే ఒప్పు కుందాం. ఆ భావన కొన్ని కోట్ల మందికి ఆనందాన్నిస్తుంటే వీడికి ఏమిటి అభ్యం తరం? '

ఈయనకి నేను జవాబు చెప్ప లేను అనుకుంది గీత. చెప్పటా నికి ప్రయత్నించవచ్చు కాని ఆయన నొచ్చుకునే ప్రమాదం ఉంది. బహుశా యోగి ఆ దారిలో వెళ్లే ఈయన్నిఎంతో గాయపరిచాడేమో కూడా.

టాపిక్ మార్చాలని గీత అంది. 'అంకుల్! యోగి రావటం ఆలస్యం అవుతుందేమో నేనే వంట చేస్తాను...'

'నీకు ఎందుకమ్మా శ్రమా? '

'శ్రమ లేదు అంకుల్... మీతో కలిసి తినాలన్న ఆశ... అంతే!'

గీతతో పాటు రంగారావు కూడా నవ్వాడు. అంతేకాదు ఆమెతో పాటు వంట గదిలోకి వచ్చి కబుర్లు చెబుతూ ఆమెకి సాయం చేశాడు.

యోగి వచ్చేసరికి ఘుమఘుమలాడు తున్న భోజనం తయారయింది. 'సెలవు రోజున రెస్ట్ తీసుకోకుండా ఎందుకీ బాధలు? నాకయితే ఎలాగూ పనీపాటా లేదుకదా, నేను చేసేవాడిని' అన్నాడతను.

గీత నొచ్చుకుంది. ఆ తరువాత అంది, 'నీకు పనీపాటా లేదని నీకు నువ్వే ఎందుకు తక్కువ చేసుకుంటావు? '







'తక్కువ కాదు... ఉన్నమాట అది...' అన్నాడు యోగి. ఆ రోజున అతను రెండు ఇంటర్వ్యూలకి వెళ్లాడు కాని వారి తీరు అతనికి ఏ మాత్రం నచ్చలేదు. అంత్య నిష్ఠూరం కన్నా ఆది నిష్ఠూరం మేలు అనుకుని ఒక ఆఫర్‌ని తిరస్కరించాడు. అది తప్పు అన్న భావన క్షణకాలం అతని మనసులో మెదిలింది.

యోగి వద్ద ఉన్న పుస్తకాల కలెక్షన్‌ని అబ్బురంగా చూసింది గీత. ఉన్నట్లుండి ఆమె నుదురు చిట్లించింది. 'ఏయ్! ఆ రోజు సంబరపడుతూ కొన్నావు కదా. ఆ కాఫ్కా పుస్తకాలు అవి ఎక్కడా లేవే?'

'అవా... నరేశ్ తీసుకున్నాడు...'

'నరేశా?' గీత కనుబొమ్మల ముడి ఇంకా పెరిగింది. 'అతను పుస్తకాలు వాపస్ ఇవ్వడని అంటారుగా?'

'గీతా! లైట్ తీసుకో... నేను చదివాను. నోట్స్ కూడా రాసుకున్నాను. మిగిలిన వాళ్లల్లో ఆసక్తి ఉంది వాడికే. ఇచ్చేస్తే నష్టం ఏమిటి?'

ఇచ్చుటలో ఉన్న హాయి వేరెచ్చటనూ లేదని అన్న పాట ఆ సమయంలో ఏ టేప్‌లో కాని రేడియోలో కాని రావటం లేదు కాని గీతకి స్పష్టంగా వినబడింది!

'వీడు జీవితంలో చేసిన ఒకే ఒక మంచి పని ఈ అమ్మాయితో స్నేహం చేయటం...' అనుకున్నాడు రంగారావు ఆమె వెళ్లిపోయాక. 'ఈ స్నేహం ఇంతటితో ఆగకుండా ఇంకా గట్టిదయ్యి...' అని ఏదో ఊహించుకోబోతున్న ఆయన ఎవరో వీపుపైన చెళ్లున చరిచినట్లు ఉలిక్కిపడ్డాడు. 'వద్దు... వద్దు... ఊహాగానాలు వద్దు... నేను ఆశించినవేవీ జరగలేదు. అందుకనే భవిష్యత్తు గురించి ఏ ఆశలూ పెట్టుకోకపోవటం మంచిది...'

8



కాలం పరుగు తీస్తూనే ఉంది. ప్రభుత్వాలు మారుతున్నాయి.. నూతన శతాబ్దం కూడా వచ్చేసింది. గీతకి అప్పుడే ఓ ప్రమోషన్ వచ్చింది. ఈ మధ్యకాలంలో యోగి మూడో నాలుగో ఉద్యోగాలు మారాడు. అతను ఏ ఉద్యోగంలోనూ స్థిరంగా ఉండకపోవటంతో పెళ్లి గురించి ప్రస్తావించటానికి అతను వెనకడుగు వేస్తున్నాడేమో అన్న సందేహం గీతకి కలగసాగింది.

ఓ సారి గీత కనబడగానే 'నా మూడేం బాగాలేదు గీతా!' అన్నాడతను.

'ఏమయ్యింది' గీత ఆత్రుతగా అడిగింది.

'ఏముంది...' చేదుగా నవ్వాడు యోగి. 'నాన్నతో గొడవ పడ్డాను. ప్రాబ్లెమ్ ఏమిటంటే తల్లి లేదని నన్ను మొదట్లో ఎంతో ప్రేమతో పెంచాలనుకున్నాడు కాబోలు. కొన్ని రోజులు అతి గారాబం చేశాడు. నేను ఏం చేసినా అడ్డుచెప్పేవాడు కాదు. అలా అయితే లాభం లేదు. పిల్లాడు చదువు మీద సరైన శ్రద్ధ చూటంలేదని మరీ స్ట్రిక్ట్‌గా పెంచాలని ప్రయత్నం చేశాడు కొన్ని రోజులు. ఆ రోజులు చాలా అన్యాయంగా ఉండేవిలే. ట్రైన్ వచ్చు సమయం, ట్రైన్ వెళ్లు సమయం లాగా నాకు ఒక టైమ్ టేబుల్ వేసి ఏ రోజు ఎన్ని నిముషాలు ఆలస్యంగా ఫలానా పని

ఎంతో మెత్తగా మాట్లాడుతారు. నీ సమక్షంలో ఆయన పూర్తిగా మారిపోతారు. మీ ఇద్దరికి ఒక్క క్షణం కూడా ఎందుకు పడదో నాకు ఎప్పుడూ అర్థం కాదు. ఎందుకు ఎలా మొదలవుతుందో కాని రెండో నిముషంలో మీరు ఏదో విషయంలో వాదించుకుంటూ ఉంటారు. రాజీ ఎలా కుదర్చాలో తెలియక నేను తల పట్టుకుని కూర్చుంటాను. అయినా ఎందుకు పెద్దాయనని అలా విసిగిస్తావు? '

'నువ్వు సరిగా గమనించటం లేదు. ఆయన నన్ను సతాయించి చివరికి నా సహనం పోగొడతాడు. దాంతో మా కేకలు... అరుపులు తప్పవు. అప్పుడు గాని శాంతించడు' అన్నాడు యోగి.

'ఆ సంగతి మీకు తెలిసినపుడు ఆయనని గౌరవిస్తున్నట్లు మౌనంగా ఉండచ్చు కదా? '

'మేడమ్! అదీ ప్రయత్నించాను. లాభం లేకపోయింది. ఒక విధంగా చెప్పాలంటే నన్ను దోషిలాగా నిలబెట్టకపోతే ఆయనకి తృప్తిగా ఉండదు. అలా జరగటానికి ఆయన ఏదన్నా చేస్తాడు. సరేలే అని చెప్పి ఆయన సంతృప్తికోసం నేనూ జగడం వేసుకుంటాను. ఈసారి నువ్వు జాగ్రత్తగా అబ్జర్వ్ చేయి'

ఆలోచిస్తే యోగి చెప్పింది చాలావరకు నిజమే అనిపించింది గీతకి. 'కాని ఓ సంగతి ఆలోచించు యోగి! పెళ్లి అయ్యాక కూడా నా ఎదురుగా మీ ఇద్దరూ అలా ఉంటే నాకు ఎంత ఇబ్బందిగా ఉంటుంది? !'

అతను నిట్టూర్చాడు. 'ఓకే! గీతా! నేను రిఫార్మ్ అవుతాను. నాన్న ఏమన్నా నేను మాట్లాడను. సరేనా? '

'ఇంకో రెండు మూడేళ్లల్లో ఆయన రిటైర్ అవుతాడు. ఆయనని సంతోషంగా ఉంచటం నీ బాధ్యత కాదా? '

'ఆదర్శ కోడలు పాత్ర మరీ సీరియస్‌గా పోషిస్తున్నావని నాకు అనుమానంగా ఉంది కాని ఇక ఆ టాపిక్ బంద్ చెయ్యి...' అన్నాడు యోగి.

★ ★ ★

పది రోజుల తరువాత యోగి ఇంటికి వెళ్ళింది గీత. హిందూ పేపర్‌లో ఎడిటోరియల్ చదువుతున్నాడు రంగారావు. ఆయన్నే చూస్తూ తమ పెళ్ళి సంగతి ఎలా ప్రస్తావించాలా అని ఆలోచిస్తూ ఉండిపోయింది. అప్పుడే ఆమెకి ఓ ఆలోచన వచ్చింది. ఇంకో పాతికేళ్ల తరవాత యోగి అచ్చు తండ్రిలాగా అవుతాడేమో? ! గొంతు సవరించుకుని 'మామయ్యా!' అని మొదలు పెట్టింది గీత. అంతవరకూ అంకుల్ అనే పిలిచేది. సంబోధనలో మార్పు రావటం ఇదే ప్రథమం.

రంగారావు పిలుపులోని తేడాని పసికట్టాడో లేదో గీతకి అర్థం కాలేదు. తలెత్తి మామూలుగా 'ఏమిటమ్మా' అన్నాడు.

'మామయ్యా! నేను యోగిని పెళ్ళి చేసుకుందాం అనుకుంటున్నాను' అంది గీత.

చాలాసేపు రంగారావు మౌనంగా ఉన్నాడు. చివరికి కొడుకుని చూస్తూ అన్నాడు, 'వద్దమ్మా! వద్దు! అంత పొరపాటు చేయకు. వాడి సంగతి నీకు తెలియదు. అమ్మో! దేవాంతకుడు. ఏం చేస్తున్నాడో వాడికే సరిగా తెలియదు. ఎందుకు నీ జీవితాన్ని చెడగొట్టుకుంటావు? ! వద్దు'

గీత ఆశ్చర్యపోయింది. యోగి మాత్రం నవ్వుతూ చూస్తున్నాడు. ఆయనకి నచ్చచెప్పటానికి ప్రయత్నించింది గీత- 'యోగి ఏదో చెడ్డవాడు అన్నట్లు మాట్లాడుతున్నారు ఏమిటి మామయ్యా! అతను నాకు నాలుగేళ్లుగా తెలుసు'

'నాకు ఇంకో పాతిక ఏళ్లు ఎక్కువ తెలుసు. నాతోటి వాళ్ళ పిల్లలందరూ ఇంజనీర్లు, డాక్టర్లు అయ్యారు. వీడో...?

రంగారావు, మీ అబ్బాయి ఏం చేస్తున్నాడు అని నలుగురూ అడిగితే నాకు తెలియదు అని చెప్పటానికి ఇప్పుడు నేను సిగ్గుపడటం లేదు. వాడికే తెలియదు అని చెప్పటానికి కూడా అలవాటుపడుతున్నాను. తెలివి తేటలకా తక్కువ లేదు. ఎంత బాగా చదివేవాడో తెలుసా? ఏమయ్యిందో ఏమిటో? వాడి వయసులో వాళ్లు ఎవరూ చదవని పుస్తకాలు చదువుతుంటే ఎంత సంబరపడ్డానో తెలుసా? నాకు అర్థంకానివి కూడా చదువుతుంటే అయ్యే యస్‌కి తక్కువగా నేను ఊహించుకోలేదు. పుస్తకం చదవటం మొదలుపెడితే అయ్యేంతవరకూ నిద్ర కూడా పోడు అని గర్వంగా నా స్నేహితులతో చెప్పుకునే వాడ్ని'

మౌనంగా ఉండటం మేలనుకుంది గీత.

'చూడమ్మా! వాడు నా కొడుకే... అయినా చెబుతున్నాను. నువ్వు లక్షణంగా ఉన్నావు. ఎందుకు నీ జీవితాన్ని చెడగొట్టుకుంటావు? నీ మూలంగా అయినా వాడు బాగుపడతాడేమో అని ఒక మూల ఏదో ఆశగా ఉంది. కాని నా ఆశ కోసం, మా స్వార్థం కోసం అసలు సంగతి చెప్పకపోవటం నిన్ను మోసం చేయటమే అవుతుంది. అందుకనే ఇంకోసారి నిన్ను ప్రార్థిస్తున్నాను. వీడిని పెళ్ళి చేసుకుందామన్న ఆలోచన రానీయకు. ప్లీజ్!'

గీత ఆశ్చర్యం తగ్గలేదు. ఇలాంటి తండ్రీ కొడుకులు ఇంకా ఎక్కడన్నా ఉంటారా?

'అది కాదు మామయ్యా! యోగి చాలా మంచివాడు...'

ఆయన అడ్డు తగిలాడు 'అది నీ భ్రమ...'

ఎప్పుడు తయారు చేశాడో టీ కప్పులు అందిస్తూ యోగి అన్నాడు 'నాన్నా! చెప్పావుగా... మరీ ఎక్కువగా చెబితే తను నిజం అనుకుని నమ్మేస్తే నాకు ఇబ్బంది'

'నీకు ఇబ్బంది ఎప్పుడూ రాదురా...నీ మూలంగా అందరికీ ఇబ్బందులు వస్తాయి...' రంగారావు కచ్చితంగా అన్నాడు.

'మామయ్యా! యోగితో పంచుకున్న జీవితం సంతోష భరితంగా ఉంటుందన్న నమ్మకం నాకుంది. అతనంటే ఎంత ప్రేమ లేకపోతే మీరు ఇంత కలవరపడతారు? మీరు మన స్ఫూర్తిగా ఒప్పుకుంటే మాకు తృప్తి' గీత సానునయంగా అంది.

కొంచెంసేపు ఆలోచించి రంగారావు అటునించి నరుక్కువచ్చాడు. 'నువ్వో పని చెయ్యమ్మా! నేను చెబితే నీకు అర్థం అవటంలేదు... వీడిని మీ నాన్నగారికి పరిచయం చెయ్యి... నాలుగయిదుసార్లు వీడితో మాట్లాడాకా ఇలాంటివాడిని పెళ్ళి చేసుకోవటం మంచిది కాదని ఆయనే నీకు నచ్చచెప్పుతారు'

**నేను చెబితే నీకు అర్థం అవటంలేదు. వీడిని మీ నాన్నగారికి పరిచయం చెయ్యి. నాలుగయిదుసార్లు వీడితో మాట్లాడాకా ఇలాంటివాడిని పెళ్ళి చేసుకోవటం మంచిది కాదని ఆయనే నీకు నచ్చచెప్పుతారు**

యోగి చాలా నాలెడ్జబుల్ అని తండ్రి అనటం గుర్తుకి వచ్చి గీత నవ్వుకుంది. 'ఈ విషయం నేను మా ఇంట్లో చెప్పానండి... వాళ్ళకి అభ్యంతరం లేదు'

'సరేనమ్మా! నీ రాకతో అయినా వాడి జీవితం మారితే నాకు సంతోషం'

రంగారావు ఘాటుగా హెచ్చరించటంతో గీతకి కొత్త ఆలోచనలు కావుగాని పాత ఆలోచనలే కొత్తగా కలిగాయి. యోగికి ఉన్న నిర్దిష్టమయిన అభిప్రాయాలు చూసి విస్తుపోవటంలో ఆశ్చర్యం లేదుకాని ఆ





## ఏం ఫర్వాలేదు

'ముద్దాయి అప్పుడన్న మాటలు పెద్దమనుష్యుల ఎదుట చెప్పడానికి వీల్లేనివండి' తటపటాయిస్తూ అన్నాడు సాక్షి.

'ఫరవాలేదులే, ఆ మాటలేమిటో వివరంగా మేజిస్ట్రేటుగారి చెవిలో చెప్పవచ్చు. తప్పేంకాదు' సలహా ఇచ్చాడు న్యాయవాది.

అయితే తను పెద్దమనిషి కాదన్న మాట అనుకున్నాడు మేజిస్ట్రేట్.




సంభ్రమంలో వాస్తవ స్థితిని విస్మరించకూడదు అని గీత అనుకుంది. 'నువ్వు నమ్మే సైంటిఫిక్ టెంపర్ గురించి నాకు ఏ విధమయిన ఫిర్యాదు లేదుగాని నీకు సోషల్ టెంపర్ లేకపోవటంతో ఎన్నెన్నో సమస్యలని అనుకోకుండా ఆహ్వానిస్తున్నావు' అని యోగితో ప్రొఫెసర్ ఒకసారి అన్న మాటలను గీత గుర్తు చేసుకుంది. అతనికి దగ్గరయిన కొద్దీ ప్రొఫెసర్ మాటలలో ఎంతో సత్యం ఉందని ఆమెకి తెలియసాగింది. యోగిని మోడరేట్ చేయకపోతే లాభం లేదని గీత దృఢంగా అనుకుంది. 'నా నమ్మకాల కంటే మా జీవితానికి, ఆనందానికి ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వాలి కదా!' అనుకుంది గీత. 'అంటే... అంటే... నాకు ఉన్న నమ్మకాలని నేను మరిచిపోవాలి. అవసరాన్ని బట్టి కొత్తవి అలవరుచుకోవాలి... సందర్భాన్ని బట్టి నా పాత నమ్మకాలకి మేకప్ చేయాలి'

'పెళ్లి చాలా సింపుల్‌గా జరగాలి...' అన్నాడు యోగి. ఏ రకమయిన తతంగం పైనా నాకు నమ్మకం లేదు, కాని లీగల్‌గా కూడా అవసరం అవుతుంది అంటున్నారు కాబట్టి రిజిస్ట్రార్ ఆఫీసులో దండలు మార్చుకోవటం సరిపోతుందనుకుంటాను...' అన్నాడు యోగి.

మోడరేషన్ ఆలోచనలని ఆచరణలో పెట్టే సమయం ఇదే. గీత తల దించుకుంది. ఎలా చెప్పాలి? మనసులోంచి కాకుండా పెదవులపై నుంచి పలికే మాటలని ఆప్తుల ఎదురుగా అనటం చాలా కష్టం అని ఆమెకి తోచింది. 'యోగి! నాకు ఓ కోరిక ఉంది... నువ్వు మంగళసూత్రాలు కట్టాలి...' గీత స్థిరంగా అంది.

అతను విస్తుపోయాడు. 'ఏమంటున్నావు నువ్వు... నీకు ఆ నమ్మకాలు ఉన్నాయా?'

'కొన్ని సంప్రదాయాలు, ఆచారాలు ఉంటాయి. వాటిల్లో లాజిక్ వెతకటం చేయకూడదు. పొద్దున్నే లేచి ఆ సూత్రాలని కళ్లకి అద్దుకోవటం కోసం ఇలా అడుగుతున్నానని మాత్రం నువ్వు భ్రమపడకు' గీత నవ్వుతూ అంది.

'కాని గీతా! నువ్వు కూడా ఇలాంటివి ఆశిస్తున్నావా?'

'పెద్ద పెద్ద కమ్యూనిస్టు దేశాలలో కూడా అతిథులకి తుపాకులతో గౌరవ సైనిక వందనం చేస్తారు. దానికి ఏమన్నా లాజిక్ ఉందా? అంతదాకా ఎందుకు? మన కాన్వొకేషన్‌లో నవ్వు పుట్టించే డ్రెస్సు వేసుకుని డిగ్రీలు ఎందుకు తీసుకున్నాం? ఈ రోజులలో కూడా అలాంటి వస్త్రధారణ అవసరమా అని ఎవరూ ఎందుకు అడగరు?' గీత గట్టిగా వాదించింది. మంగళసూత్రాలని ఆడదాన్ని కట్టి పడెయ్యటానికి

మగవాడు కనుక్కున్న అందమయిన పలు పుతాడు అని కొందరు అంటారు. ఆ సంగతి నేను నమ్మను. కాని జీవితాలని పంచుకుని ముడి వేసుకుంటున్నప్పుడు జరిగే మాంగల్యధారణ సింబాలిజంలో నాకు నమ్మకం ఉంది...'

యోగి ఒప్పుకున్నాడు.

గీత నవ్వుకుంది. అతను ఊహించలేదు కాని ఇదంతా తన కోసం మాత్రమే ఆమె చేసింది. భార్యాభర్తలుగా హాయిగా జీవించటానికి ఉపయోగపడే సూత్రాలు చాలా ఉండచ్చు కాని మంగళ సూత్రాల అవసరం మాత్రం లేదని ఆమెకి నమ్మకం. అయితే బ్రేక్‌లు వేయకపోతే యోగి రెచ్చిపోతాడని గీత భయపడింది... ఆల్రెడీ తను నమ్మిన విషయాల కోసం అతనెంత పోగొట్టుకున్నాడో ఆమెకి బాగా తెలుసు...

పెళ్ళి యోగి కోరినట్లే చాలా సింపుల్‌గా జరిగింది... ఎక్కువగా వచ్చింది యూనివర్సిటీ స్నేహితులే...

రాఘవ, జయ వచ్చారు. రంగారావు రానని ముందే చెప్పాడు.

తార వచ్చింది...తార అప్పుడు ఎంబీఏ చేస్తోంది. తారతో పాటు ఓ యువకుడు కూడా ఉన్నాడు. బెరుకుగా ఉన్న అతన్ని పరిచయం చేసింది తార. 'అక్కా! ఇతను రాజా అని నా స్నేహితుడు... క్లాస్‌మేట్...'

అతను స్నేహితుడు, క్లాస్‌మేట్ కన్నా ఎక్కువే అని గీత పసికట్టటానికి అయిదు నిముషాలు కూడా పట్టలేదు.

గీత, యోగి ఇంటికి వెళ్ళేసరికి రంగారావు ఇంట్లో లేడు. అరగంట తరువాత వచ్చాడు... అనాథాశ్రమంలో పిల్లలకి విందు భోజనం పెట్టించి వస్తున్నాడుట. అది విని గీత కదిలిపోయింది... ఎంత మంచి ఆలోచన!

మిగిలిన ప్రపంచం అనేది ఒకటి ఉంది అన్న సంగతిని పూర్తిగా మరిచి అరకులో గడిపిన వారం రోజులు జీవితాంతం మరవలేను అనుకుంది గీత.

వాళ్లు తిరిగి వచ్చేసరికి ఇంటికి రంగులు వేయించాడు రంగారావు. కొత్త ఫర్నిచర్ కొన్నాడు.

సాయంకాలం టీ తాగాక ఆయన 'గీతా! మీ ఇద్దరితో మాట్లాడాలి...' అన్నాడు.

మీ ఇద్దరు అని అన్నా ఆయన ఎక్కువగా గీతతోనే మాట్లాడాడు. 'నేను వలంటరీ రిటైర్‌మెంట్ తీసుకున్నాను...'

'చాలా మంచి పని చేశారు మామయ్యా! ఇక మీరు హాయిగా ఇంటి పట్టున ఉండి విశ్రాంతి తీసుకోండి' అంది గీత.

రంగారావు చిత్రంగా నవ్వాడు. 'విశ్రాంతి తీసుకుంటున్నాను కాని ఇంటి పట్టున ఉండి కాదు. కాశీలో ఒక ఆశ్రమం ఉంది. ఇక నా శేష జీవితం అక్కడే గడపదల్చుకున్నాను...'

'అదేమిటి మామయ్యా! మీరు అలా వెళ్లిపోవడం బాగా లేదు' గీత బాధగా అంది.

'గీతా! ఎవరినీ నొప్పించాలని నా ఉద్దేశం కాదు పైపెచ్చు ఇలా చేయటం వల్ల మీకూ నాకూ హాయిగా ఉంటుందని నేను నమ్ముతున్నాను...' అంటూ ఆయన బ్యాంకులో ఏయే డిపాజిట్లు ఉన్నాయో ఆ వివరాలు అన్నీ చెప్పాడు. 'మీ వివాహ సందర్భంగా ఈ ఇంటిని యోగికి ఇవ్వాలని గిఫ్ట్‌డీడ్‌గా రిజిస్ట్రేషన్ చేయించాను...'

మొదటిసారిగా యోగి నోరు విప్పాడు. 'నాన్నా! ఇవన్నీ అనవసరమయిన వివరాలు... అసలు మీరు ఎందుకు దూరంగా వెళ్ళాలనుకున్నారో అది చెప్పండి ముందు...?

రంగారావు కొద్ది నిముషాలసేపు మౌనంగా ఉన్నాడు. చెప్పాలా వద్దా అని తర్జనభర్జన పడుతున్నట్లు కనబడ్డాడు. చివరికి మెల్లగా అన్నాడు. 'తొందరపాటు







తోనో, ఆవేశంతోనో, ఎవరిమీదనో, కోపం తోనో తీసుకున్న నిర్ణయం కాదు ఇది... అసలు యోగితో జీవితం పంచుకోవటం అంటే అంత సులువు కాదు అని నేను పెళ్లికి ముందే చెప్పాను కదా. ఇక నేను నీకు చేయగలిగే సాయం ఒక్కటే తల్లీ! వీడితో నువ్వు పడే కష్టాలు చాలు... వాటికి మామగారికి చేయాల్సిన సేవలని కలపటం నాకు ఇష్టం లేదు. ఇన్ని రోజులుగా వీడు జీవితంతో ఆడిన ఆటలు చూసి చూసి అలసిపోయాను. ఇప్పుడు కూడా అదే కొనసాగిస్తే... నిన్ను పెళ్ళి చేసుకున్న తరవాత కూడా బాధ్యత లేని జీవితాన్నే గడుపుతున్నాడని తెలిస్తే నేను భరించలేను... మనవడో, మనవరాలో పుడితే తెలియజేయండి. వీలయితే తీసుకు వచ్చి చూపించండి అది చాలు...'

ప్రశ్న అడిగింది తను... కాని సమాధానం చెప్పింది మాత్రం గీతకి! యోగి బాగా దెబ్బ తిన్నాడు.

గీత కంట నీరు పెట్టుకుంది. ఇద్దరూ ఆయన్ని బతిమిలాడారు. ఆయన ససేమిరా అన్నాడు. 'ఇంకో గంటలో నా ట్రైన్ ఉంది... నవ్వుతూ నాకు సెండాఫ్ ఇవ్వండి. అంతే... ఇంకేం చెప్పకండి. ప్లీజ్!' అన్నాడు.

ట్రైన్ దూరమై కనబడకుండా అయ్యేంత వరకూ యోగి చేయి ఊపుతూనే ఉన్నాడు. 'గీతా! ఈ వేదనని ఇంటికి తీసుకురావటం నాకు ఇష్టం లేదు... మనసు కుదుట పడేంతవరకూ ఇక్కడే కూర్చుందాం...' అన్నాడు యోగి. అతన్ని అంత బేలగా ఎప్పుడూ చూడలేదు గీత.

ఖాళీ అయిన ప్లాట్‌ఫారం పైన దూరంగా ఉన్న ఓ బెంచ్ పైన అతనికి అతి దగ్గరగా కూర్చుంది గీత. యోగి చేతులు అందుకుని తన ఒడిలో ఉంచుకుని ఇంకో చేయి అతని భుజంపైన ఓదార్పుగా ఉంచింది. చాలా సేపు ఇద్దరూ ఏమీ మాట్లాడుకోలేదు... ఎవరి ఆలోచనలో వారు ఉన్నారు.

మళ్లీ ఇంకో ట్రైన్ వస్తుందేమో. మెల్లగా జనం రాసాగారు. అయినా అలాగే ఉండిపోయారు. చివరికి గీత మృదువుగా అంది 'మామయ్య గురించి తలచుకుంటే బాధగా ఉంది. ఆయన అంతగా ఎందుకు విసిగిపోయాడు? నువ్వు అంత చెడ్డవాడివి, క్రూరుడివి కాదే!'

యోగి గొంతులో పశ్చాత్తాపం ధ్వనించటం ఈసారి స్పష్టంగా తెలిసింది. 'గీతా! నువ్వు మరిచిపోయింది ఏమిటంటే నీకు ఆయన నా గురించి, నా వల్ల ఆయనకి కలిగిన మనోవేదన గురించి రెండు గంటలలో చెప్పాడు... నేను అప్పుడప్పుడు రెండు మూడు సంఘటనలు చెప్పానుగాని అది ఓ ఇరవై పాతిక ఏళ్ళపాటు జరిగిన రామాయణం... దానికితోడు నాకయితే ఎన్నో వ్యాపకాలు... చదువు, పుస్తకాలు, స్నేహితులు. కాని ఆయనకో? నేను, ఇల్లు ఆ భగవద్గీత, ఏవో కొన్ని పుస్తకాలు తప్పితే ఆయనకి ఇంకా ఏమీ తెలియదు... దాంతో ఆయన నిరంతరం జరిగిన సంగతులే స్మరిస్తూ గడిపాడేమో? ! నేను చేసిన తప్పుని పదే పదే తలుస్తుంటే అది భూతద్దంలో కనబడుతుంది. అందుకనే ఆయన ఇంత కఠోర నిర్ణయం తీసుకున్నాడు అనుకుంటాను... నన్ను నేను సమర్థించుకోవటానికి ఇలా చెప్పటం లేదు... నా తప్పు లేదు అని అనను. నా తప్పు తప్పకుండా ఉండి ఉండచ్చు కాని మరీ ఇంత తప్పు చేశానా? ... బహుశా ఆయన అంచనాలకి తగ్గట్లుగానో, ఆయన ఆశలకి తగ్గట్లుగానో నేను తయారవ్వ లేదు. దానికి అంతా నా నిర్లక్ష్యం కారణమనీ, బతుకుమీద నాకో అవగాహన లేదనీ ఆయన అనుకున్నాడు కాబోలు...'

అన్నాడు.

ఆలోచిస్తే యోగి ఎనాలిసిస్ సరి అయినదిగానే తోచింది గీతకి. అతనన్నట్లు రంగారావు తీసుకున్నది కఠోర నిర్ణయమే కాదు, కొడుకును దోషిగా నిరూపించే నిర్ణయం... యోగిని ఎలా ఓదార్చాలో తెలియక గీత సతమతమయింది.

రెండు నిముషాల తరువాత యోగి చెప్పిన మాటలలో అతను నిజ పరిస్థితితో మెల్లగా రాజీ పడుతున్నాడని తెలిసింది. 'గీతా! ఆయన హాయిగా ఉన్నాడని, తనకి కావలసినట్లు పోస్ట్ రిటైర్‌మెంట్ జీవితం గడుపుతున్నాడని అనుకుంటే మనకి శాంతిగా ఉంటుంది... నేను బాధ పడటం లేదని కాదుగాని ఇంతకు మించి చేయగలిగింది లేదు...'

9



**త**ండ్రి చేసిన పని యోగిని చాలా రోజులే వేధించింది. 'గీతా! నువ్వు మటుకు నిజం చెప్పాలి... ఎప్పుడయినా నేను చేసిన పని నీకు నచ్చకపోతే నాకు వెంటనే చెప్పాలి... మళ్లీ మనసులో ఉంచుకుని అసంతృప్తి దాచుకుని ఏదో ఒక రోజు మా నాన్నలాగా విపరీతంగా రియాక్ట్ అయితే నేను తట్టుకోలేను' అని తరచూ గీతతో అంటుండేవాడు.

మొదటిసారి 'ఏయ్ యోగీ! అలా ఎందుకు అనుకుంటున్నావు? ' అంది గీత.

తరువాత ఇంకోసారి 'యోగి బాబూ! నేను కూడా మామూలు మనిషినే. నాకు కూడా అప్పుడప్పుడు నీ మీద కోపం వస్తుంది. వెంటనే అరిచి మరీ దాన్ని ప్రకటిస్తాను. మనసులో దాచుకోను. సరేనా? ' అంది.

మూడోసారి అతను అదే ప్రసక్తి తెచ్చినప్పుడు 'నీకు అప్పుడే చాదస్తం వస్తున్నదని నాకు భయంగా ఉంది. రెండు నెలలలో మొదటి మ్యారేజ్‌డే వస్తున్నది. ఇంకా నీకు నేను పూర్తిగా అర్థం కాలేదా? అంటే పెళ్లికి ముందు మనం గడిపిన నాలుగేళ్లూ నువ్వు గమనించలేదేమో అన్న అనుమానం వస్తుంది. పెళ్లయిన ఈ ఏడాదిలో నన్ను సరిగ్గా పట్టించుకోలేదా అన్న సందేహం వస్తున్నది.. నన్ను గమనించినా అర్థం చేసుకున్నా ఇలా అడగవు' అంది గీత.

అంత బలంగా చెప్పినా యోగి నెల రోజుల తరువాత తిరిగి ఆ ప్రసక్తి తెచ్చాడు.. అనుమానం అదే. కాని ఎప్పటికప్పుడు కొత్తగా బుజ్జగించాలి. 'నాకు నచ్చలేదని చెబితే నువ్వు నీ పంథా మార్చుకుంటావా? ' గీత కావాలనే అలా అడిగింది.

'అది చెప్పలేనుగాని అలా నేను ఎందుకు చేశానో చెప్పి నిన్ను ఒప్పించే ప్రయత్నం చేస్తాను...'

'ఒకవేళ నేను కన్విన్స్ కాకపోతే? !'

అతని నుండి చాలాసేపటివరకు సమాధానం రాలేదు. తరవాత మెల్లగా అన్నాడు 'నీకు నచ్చకపోతే ఎందుకు నచ్చలేదో నువ్వు చెబుతావు. నా వాదన నేను వినిపిస్తాను. ఇద్దరం పరిస్థితి ఇదీ అని అర్థం చేసుకుంటాం. అంతటితో ఆ విషయానికి ఫుల్‌స్టాప్ పడాలి. అంతేగాని మన అభిప్రాయాలని ఎదుటి వారిమీద రుద్దాలనుకోవటం తప్పు. పెళ్లి చేసుకున్నాక ఒకరి అభిప్రాయాలని ఇంకొకరు గౌరవించాలి. కాదనను కాని నా ఆలోచనలు నీ కాలికి సంకె





ళ్లుగా మారటం, నీ ఊహలు చెర్నాకోల అయి నన్ను నియంత్రించటానికి ప్రయత్నించటం సబబు కాదు కదా?'

యోగిని అర్థం చేసుకోవటం చాలా కష్టం అని గీతకి ప్రస్ఫుటంగా అర్థమయింది. బయటివారికి చిత్రం అనిపించవచ్చు గాని ఆమెకి అతని మీద కోపం మటుకు రాలేదు. పైపెచ్చు జాలి కలిగింది. తండ్రి గురించి అతను ఎంత బాధపడుతున్నాడో ఇంకోసారి తెలిసినట్లయింది. అతని మూడ్ మార్చటానికి ప్రయత్నించింది. 'అదలా ఉంచు యోగీ! మన మ్యారేజ్ డే త్వరలో రాబోతున్నది. ఎలా సెలబ్రేట్ చేయాలో ఆలోచిద్దామా?'

'సెలబ్రేషనా? ... అంటే?'

'కేకులు కట్ చేయటం, ఫైవ్ స్టార్ హోటల్‌లో డిన్నర్ చేయటం అని నేను అనటం లేదు. అది ఒక ప్రత్యేకత సంతరించుకున్న రోజుగా పరిగణించి వినూత్నంగా గడపాలి...'

'చాలా బాగుంది కాని ఇలాంటి వాటిల్లో నా బుర్ర సరిగా పని చేయదు...' అతను నవ్వుతూ అన్నాడు. 'తారని, ఆమె స్నేహితుడు రాజాని భోజనానికి ఆహ్వానిద్దాం. సరదాగా గడుపుదాం... సరేనా?' గీత అంది.

'డబుల్ ఓకే!' అన్నాడు యోగి 'కాని ఏ సందర్భంగా పిలుస్తున్నామో చెప్పకు...' అన్నాడు.

ఆ మర్నాడు అతను ఇంకో శుభవార్త చెప్పాడు. అతను ఓ పత్రిక ఆఫీసులో ఉద్యోగంలో చేరాడు. ముఖ్యంగా దినపత్రికలో సాహిత్యం డెస్క్‌లో పని. దానికి తోడు వారపత్రిక, మాసపత్రికల సంపాదక వర్గానికి సాయం చేయాలి. అంతవరకు చేసిన ఉద్యోగాలకన్నా ఆ ఉద్యోగం అతనికి బాగా నచ్చిందని అతని మాటలలో ప్రతిఫలిస్తున్న ఉత్సాహాన్ని బట్టే గీతకి అర్థమయింది. 'ఈ ఉద్యోగంలో సమస్యలేవీ రావని నాకు గట్టిగా నమ్మకం ఉంది...' అన్నాడు.

మోడరేషన్‌కి ఇదే మంచి తరుణం అనుకుంది గీత. 'అలా అయితే మంచిదే కాని అప్పుడప్పుడు నువ్వు అక్కరలేని సమస్యలని అవసరం లేకపోయినా ఆహ్వానిస్తావు!' అని అంది.

**యోగిని అర్థం చేసుకోవటం చాలా కష్టం అని గీతకి ప్రస్ఫుటంగా అర్థమయింది. బయటివారికి చిత్రం అనిపించవచ్చు గాని ఆమెకి అతని మీద కోపం మటుకు రాలేదు.**

'అలాగా!' అన్నాడు యోగి అతి సాదాగా. 'నీ విశ్లేషణ బాగానే ఉందిగాని ఓ ఉదాహరణ ఇవ్వు...'

గీత విజృంభించింది. 'రామర్ గురించి నీకు ఎందుకు? అది మా ప్రొఫెసర్ కాబట్టి, ఆయన మంచివాడు కాబట్టి సరిపోయింది... అదే నీ పేపర్లు దిద్దే ప్రొఫెసర్ అనుకో, ఆయన్ని అలాగే నిలదీస్తే ఆ కోపం మనసులో ఉంచుకుని నిన్ను చాలా రకాలుగా వేధించే అవకాశాలు ఉండేవి తెలుసా?'

యోగి పగలబడి నవ్వాడు. 'నీ విశ్లేషణ బాగుంది కాని దాని విస్తరణ అధ్వాన్నంగా ఉంది. రామర్ గురించి నేనెందుకు నిర్లిప్తంగా ఉండాలి? వినాయకుడు పాలు తాగుతున్నాడని క్యూలు కట్టిన ప్రజలు ఉన్న దేశం ఇది. ఆ అజ్ఞానంలోనే హాయి ఉంటుంది. శాంతి దొరుకుతుంది అని అనుకోవటం ఎంత ఘోరం! తెలిసిన వాళ్లు అయినా పూనుకుని అడ్డు పడకపోవటం తప్పు కదా? అది తప్పు అని తెలిశాక ఆ ప్రొఫెసర్ ఎవరు? మన కులమేనా? అన్న సంగతుల ఆధారంగా నిలదీయాలని నాకు తెలియదు. చేయాలి అనుకున్నాక పర్యవ

# బూట్లతో పాట్లు

కొంతమంది కాళ్ళు, పాదాలు చూసి వాళ్ళే రకమైన బూట్లు ధరిస్తున్నారో ఇట్టే చెప్పెయ్యొచ్చు. కాళ్ళ వేళ్ళ చివర బుడిపెలు, కాళ్లలో ఆనెలు ఉంటాయి. దీనికి కారణం బిగుతైన, పాడయిపోయిన, అడుగులు ఊడుతున్న బూట్లు వాడకమేనని ఆర్థోపెడిక్ నిపుణులు చెబుతున్నారు. మనం నడిచేటపుడు మన శరీరపు బరువు మూడు రెట్లు మన పాదాలమీద పడుతుంది. పరుగెత్తేటప్పుడు ఐదు శాతం బరువు పడుతుంది. సాధారణంగా నడిచేటప్పుడు, పరిగెత్తేటపుడు పాదాల రక్షణ కోసం మనం షూస్ వాడతాం. అయితే పూర్తిగా పాడయిపోయిన షూస్ వాడటం వలన రక్షణకి బదులు శిక్ష పడుతుంది. అరికాల్లో ఆనెలు, పుళ్ళు ఏర్పడతాయి. పాదాల అడుగు బల్లపరుపుగా మారుతుంది.



ఈ బాధల నుంచి నివారణ కోసం ప్రత్యేకమైన ఆర్థోపెడిక్ షూస్ వాడవచ్చు. అయితే అవి కూడా 350 నుండి 500 మైళ్ళు నడిచినా, పరుగెత్తినా తక్షణం మార్చాలని అమెరికన్ ఆర్థోపెడిక్ నిపుణులు సూచిస్తున్నారు. అంతే కాదండోయ్ అవకాశం ఉన్నప్పుడు షూస్ వేసుకోకుండా నడవటం వలన చీలమండ కండరాలకు, కాలివేళ్ళకు, అరికాలుకి సరైన రక్త ప్రసరణ అందుతుందని వారు సలహా ఇస్తున్నారు.

సానం ఏదన్నా ఎదుర్కునే ధైర్యం ఉండాలి... అవునా?'

గీత మాట్లాడలేదు.

'అందరికీ మనోధైర్యం ఇస్తున్న దేవుడిని నువ్వెందుకు కాదంటావు అని నాన్న కూడా అనేవాడు. ఈ రామర్ విషయమే తీసుకో. నేను యూనివర్సిటీలోనే కాదు, బయట కొన్ని రీసెర్చ్ లాబ్‌లలో సైంటిస్ట్‌లతో కూడా చర్చించాను. రామర్ వార్తలలోకి వస్తున్న మొదటి రోజులలో ఆ మూలికా పెట్రోలుని నమ్మినవారిలో హేతువాదులు లేరు. రేషనలిజం గొప్ప సుగుణం అని నేను ప్రచారం చేయబోవటంలేదు. కాని ఓ సంగతి ఆలోచించు. ఈ ప్రపంచంలో ఏదో ఒక అద్భుతం జరిగే అవకాశం ఉందని నువ్వు అనుకున్నాక రామర్ చేసినట్లు ఇంకో అద్భుతం కూడా పాజిబులే అన్న నిశ్చయానికి వస్తావు. మనిషి ఆలోచనా విధానాన్ని నమ్మకాలు అలా మలుస్తాయి. ఐన్‌స్టీన్ ఏమన్నాడో తెలుసా... మనిషి రెండు విధాలుగా బతకవచ్చుట. ఒకటి ఈ విశ్వంలో జరిగే ప్రతిదీ ఏదో అద్భుతం అని తలపోయటం. రెండోది మిరకిల్స్ జరగవు అని అనుకునే జీవన విధానం. మిరకిల్స్ జరగవు అనుకునే వాళ్లు రేషనలిస్ట్‌లు అయితే ప్రతిదీ అద్భుతమే అనుకునే వాళ్లు. బహుశా మునులు... యోగులు... ఇంకోరకంగా అంటే మిరకిల్సూ జరుగుతాయి, థర్మోడైనమిక్సూ నిజమే అని అనుకుని రెండు పడవలలో కాళ్లు ఉంచడం ఐన్‌స్టీన్ దృష్టిలో బతుకు కాదు...'

గీత నివ్వెరపోయి వినసాగింది. కొడు







కుకి ఒకలాగా, తండ్రికి ఇంకోలాగా ఐన్‌స్టీన్ అర్థమయ్యాడు! ఇక గీత ఏం మాట్లాడుతుంది? టక్కున టాపిక్ మార్చింది. 'రేపు రాత్రి తార, రాజా మన ఇంటికి వస్తున్నారు...'

ఆమె ఎత్తు ఫలించింది. అతని మాట తీరు మారింది.

★ ★ ★

ఆ మర్నాడు గీత తలుపు తీయగానే పూల బొకే ఆమె చేతిలో ఉంచి 'మెనీ హాపీ రిటర్న్స్ ఆఫ్ ది డే..' అంది తార.

తారని దగ్గరగా తీసుకుని 'థాంక్యూ!' అంది గీత.

గురుదక్షిణ అని చెప్పి దంపతులకి బట్టలు పెట్టారు తార, రాజా. 'ఇప్పుడు మీ రిద్దరూ జాయింట్‌గా కేకు కట్ చేయాలి...' అంది తార. బయటికి వెళ్లి కార్‌లో దాచిన కేక్ తెచ్చింది.

'తారా! మమ్మల్ని చాలా ఇబ్బంది పెడుతున్నావు...' ప్రొటెస్ట్ చేస్తున్నట్లు అంది గీత. 'నిజానికి యోగికి ఇలాంటివి సుతారాం ఇష్టం ఉండవు'

'చిన్న కరక్షన్... పెళ్లయ్యి ఏడాది అయ్యాక కూడా భార్యలు భర్తలని అర్థం చేసుకోవటంలో విఫలమవుతారని గీత నిరూపించింది' యోగి అన్నాడు.

'మ్యారేజ్ డే సెలబ్రేషన్‌కి యోగి అంత సులువుగా ఒప్పుకుంటాడని నేను అనుకోలేదు. అందుకనే మరీ ఆర్భాటంగా చేయదల్చుకోలేదు' గీత వివరించింది.

'మ్యారేజ్ డే అంటే ఎవరయినా ఓ ఇంపార్టెంట్ మైల్‌స్టోన్ అనుకుంటారు కదా...' తార అంది.

'నేనూ అలాగే అనుకుంటున్నాను' యోగి అన్నాడు. తన అభిప్రాయాన్ని గజిబిజిగా వ్యక్తం చేయాలని కాబోలు 'మైలు సంగతి సరిగ్గా తెలియదు కాని రాయి అని మాత్రం గట్టిగా నమ్ముతున్నాను' అని చేర్చాడు.

అందరూ నవ్వారు.

'అలా అంటే వీళ్లు భయపడుతారేమో...' అంది గీత. 'అవును ఇంతకీ ఎప్పుడు మీ పెళ్లి?'

తార నిట్టూర్చింది. 'ఇంకో ఏడాదికి కాని మా చదువు అవదు... ఆ తరువాత ఈయనగారికి చాలా యాంబిషియస్ ప్రోగ్రామ్ ఉంది...'

'ఏమిటంత గొప్ప ప్రణాళిక?'

'సారీ! ఇప్పుడు చెప్పను... మేం వచ్చింది మా చరిత్రలు, మా ఫ్యూచర్ ప్లాన్లు చెప్పటానికి కాదు... మీరు కేక్ కట్ చేస్తే చేతులు నెప్పి పుట్టేలా చప్పట్లు కొట్టటానికి...'

గీత ఊహించినట్లే యోగి అభ్యంతరం చెప్పకుండా తార కోరిక తీర్చాడు.

భోజనాలు అయ్యాక యోగి ఐస్‌క్రీమ్ తీస్తుంటే రాజా ప్లేట్లు అందించి సాయం చేస్తున్నాడు. ఆ ఇద్దరినీ దూరం నుంచి చూస్తూ తార అంది 'అక్కా! హౌ ఈజ్ దిస్ ఫస్ట్ యియర్?'

'వండ్రఫుల్' అంది గీత మనస్ఫూర్తిగా.

'అయితే నాకు ఒకటే రిగ్రెట్... మామయ్య మాతో ఉండకపోవటమే నాకు బాధగా అనిపిస్తుంటుంది...' ఆ విషయం ఆమె యోగితో కూడా ఎప్పుడూ అనలేదు. అసలే తండ్రి దూరం అవటానికి తనే కారణమేమో అన్న అపరాధభావం అతన్ని పీడిస్తూనే ఉండి ఉంటుంది... అటువంటప్పుడు ఆ మాట అనటం కొంత ఇబ్బందేగా? ఎవరికయినా చెప్పకుండా గుండెలలోనే దాచుకోవటం కూడా కష్టమేగా?

రంగారావు ఉంటున్న ఆశ్రమంలో ఫోన్ ఉందికాని 'ఇక్కడ ఒకటే ఫోన్ ఉంది... బయటి నుంచి పదే పదే ఫోన్లు వస్తే కాస్త ఇబ్బందిగా ఉంటుంది. అందుకని అవసరం అయితే తప్ప మీరు ఫోన్ చేయకండి. వీల

యినప్పుడు నేనే చేస్తాను...' అన్నాడు రంగారావు, మొదటిసారి అక్కడనుంచి మాట్లాడుతున్నప్పుడు. ఆ తరువాత ఆయన చాలా రెగ్యులర్‌గా ఉత్తరాలు రాసేవాడు. గీత మరిచిపోకుండా జవాబు పోస్ట్ చేసేది. ఆ ఉత్తరాలలో యోగి చేస్తున్న ఉద్యోగం గురించి తప్పకుండా రాసేది గీత. ఆయన భయపడినట్లుగా యోగి గాలికి తిరగటంలేదని రంగారావు గ్రహించాలని గీత తాపత్రయం. యోగి ఉద్యోగం మానేసిన సంగతి రాయకుండా ఆగి, అతను కొత్త ఉద్యోగంలో చేరాక ఆ సంగతి తెలియజేసేది.

'అక్కా! ఓ పని చేయండి... మీరే అక్కడికి వెళ్లి అంకుల్‌ని చూడండి...' అంది తార.

అవును... యోగి ఈ ఉద్యోగంలోనయినా స్థిరంగా ఓ ఆరు నెలలు ఉంటే సెలవు తీసుకుని వెళ్లాలి అనుకుంది గీత.

ఐస్‌క్రీమ్ తింటూ యోగి అడిగాడు... 'రాజా! మహత్తరమయిన భవిష్యత్తు ప్రణాళికేమిటో ఇప్పుడైనా చెబుతావా?'

'చెప్పడు...' అంది తార.

అదేమిటి అన్నట్లు అంతా తార వంక చూశారు.

తార నవ్వింది. 'ఎందుకంటే ఆ సంగతి నేను చెబితే బాగుంటుంది కాబట్టి... ఇప్పుడు మీకు ఈ అబ్బాయి చాలా సాధారణ స్టూడెంట్‌లాగా, బుద్ధిమంతుడిలాగా కనపడుతున్నాడు కాని ఇతని ఆశలు మాత్రం సాధారణమయినవి కావు... అబ్బో! ఇతగాడికి పెద్ద డైరెక్టరు అవాలని కోరిక... ఆ సంగతి నాతో చెప్పినప్పుడు నేనూ సంబరపడ్డాను... అతన్ని ఎంకరేజ్ చేయాలని ఎప్పటికయినా షారుఖ్‌తో నువ్వు సినిమా తీయాలి రాజా అన్నాను. ఈయనగారు ఏమన్నారో తెలుసా? ... షారుఖే స్వయంగా ఈయనకి ఫోన్ చేయాలిట... రాజా సాబ్! వరుసగా ఫ్లాపులు వస్తున్నాయి... మీరే ఓ హిట్ ఇచ్చి నన్ను రక్షించాలి అని ప్రాధేయపడాలిట... అప్పుడే షారుఖ్‌ని డైరెక్ట్ చేస్తాడుట...'



**షారుఖే స్వయంగా ఈయనికి ఫోన్ చేయాలిటి... రాజా సాబ్! వరుసగా ఫ్లాపులు వస్తున్నాయి... మీరే ఓ హిట్ ఇచ్చి నన్ను రక్షించాలి అని ప్రాధేయపడాలిట... అప్పుడే షారుఖ్‌ని డైరెక్ట్ చేస్తాడుట...'**



తార చెప్పిన విధానానికి గీత అయితే పడిపడి నవ్వింది. 'రాజా! నువ్వు సక్సీడ్ అయితే మా యోగి నీ శిష్యరికం చేస్తాడు... అతనికి కూడా ఒకప్పుడు సినిమాలలో పనిచేయాలని ఉండేదిట...' అంది గీత.

ఏదో గుర్తుకి వచ్చినట్లు యోగి లేచి బుక్‌షెల్ఫ్ దగ్గరకు వెళ్లాడు... అందులోంచి ది ఆర్ట్ ఆఫ్ స్క్రిప్ట్ రైటింగ్ పుస్తకాన్ని తీసి రాజాకి ఇస్తూ 'మా ఇద్దరి తరఫునా ఆల్ ది బెస్ట్ చెబుతూ ఈ పుస్తకం నీ కోసం...' అన్నాడు.

రాజా మొహం వెలిగిపోయింది... 'ఈ పుస్తకం గురించి విన్నాను... థాంక్యూ వెరీమచ్...' అన్నాడు సంబరపడుతూ.

'అయినా ఎంబీఏ చదివి సినీ రంగంవేపు వెళ్లటం ఏమిటి?' గీత అడిగింది.

'లేదక్కా! నేను డిగ్రీ చదవకుండా ఫిల్మ్ ఇనిస్టిట్యూట్‌లో చేరతానని అన్నాను... మా పేరెంట్స్ అస్సలు ఒప్పుకోలేదు... ఏదో వాళ్ల తృప్తికోసం తప్ప నాకు ఏమాత్రం ఇంట్రెస్ట్ లేదు...' రాజా అన్నాడు.

'మరి ఎప్పుడో ఒకప్పుడు చెప్పాలిగా? అప్పుడైనా వాళ్లు ఒప్పుకుంటారా?'

రాజా గమ్మత్తుగా భుజాలు ఎగరవే



శాడు 'అదే చాలా భయంకరమయిన ప్రశ్న... అందుకనే జవాబు గురించి ఆలోచించకుండా పోస్ట్‌పోన్ చేస్తుంటాను...'

'నువ్వేం వర్రీ అవకు... నేను జాబ్‌లో చేరి నిన్ను స్పాన్సర్ చేస్తాను అని చెబుతున్నాను...' తార అంది.

తార, రాజా వెళ్లిపోయారు. గీత, యోగి కలిసి మిగిలిన వంటకాలు ఫ్రిజ్‌లో అమరుస్తుంటే గీత అంది 'థాంక్ యూ యోగీ! ఇలాంటివి నీకు ఇష్టం ఉండవని నాకు తెలుసు. కాని నా కోసమని నీకు ఇష్టం లేని పని చేశావు... కాని ఆర్ యూ నాట్ హాపీ నౌ...? నాకయితే చాలా చాలా చాలా సంతోషంగా ఉంది... హేతువాదాన్ని మాత్రమే నమ్మితే జీవితంలో సంతోషం దొరకదని గ్రహించు...'

యోగి నవ్వాడు. 'సంతోషాలు చాలా రకాలు గీతా!' క్లుప్తంగా అన్నాడు.

అతను చాలా సాదాగా అన్నాడు కాని గీత ఎందుకో ఆనాటి సంతోషాన్ని సమీక్షించుకుంది. శుభాకాంక్షలు చెబుతూ రంగారావు నుంచి ఉత్తరం రెండు రోజుల క్రితమే వచ్చింది... కాని జయ, రాఘవ ఫోన్ కూడా చేయలేదు.

ఫ్రిజ్ తలుపు తీసిన గీత టప్పున తలుపు మూసి చేతిలో ఉన్న పెరుగు గిన్నె టేబుల్ పైన ఉంచింది. నిస్సత్తువగా కూర్చుండిపోయింది. 'యోగీ! అయితే ఒక లోటు ఉంది. అమ్మా నాన్న రాకపోవటం బాధగా ఉంది...'

యోగి ఆమెపక్కన నిలబడి భుజంపైన సుతారంగా తట్టాడు. అతని మోచేతి వంపులో తలానించి కళ్లు మూసుకుంది గీత.

'ఏదీ ఆశించకపోతే ఈ నిరాశ ఉండదు కదా? ' అన్నాడతను.

గీత చటుక్కున కళ్లు తెరిచింది. 'యోగి బాబూ! నీకు వేదాంతం కూడా తెలుసా? '

అతను నవ్వాడు. ఆమె చెంపలని స్పృశిస్తూ అన్నాడు. 'వేదాంతంలో ఉన్న కల్పనని తీసేస్తే మిగిలేది నాస్తికత్వం అని అంటారు...'

గీత తడుముకోలేదు. 'హేతువాదానికి సెంటిమెంట్స్ కలిపితే ఆధ్యాత్మికత అవుతుందిట...'

★ ★ ★

ఆ మర్నాడు పని ఉందని యోగి త్వరగా వెళ్లాడు... గీత లాబ్‌కి వెళ్లటానికి హడావిడి పడుతుంటే జయ వచ్చింది. తల్లిని చూడగానే గీతకి అంతులేని సంతోషం కలిగింది. నిన్న రాలేదేం? అని నిష్ఠూరంగా అనబోయి తమాయించుకుంది.

కూతురిని దగ్గరికి తీసుకుంది 'నిన్న రానందుకు ఎంత బాధపడ్డానో తెలుసా? ... వారంక్రితం ఆయనకి గుర్తు చేశాను... ఇద్దరం కలిసి సాయంకాలం వచ్చి నీకు, అల్లుడికి బట్టలు పెడితే బాగుంటుందని అన్నాను. ఆయన తల ఊపారు... నిన్న ఏమయిందో రానని మొండికేశారు... ఆ పోట్లాటలో నాకూ మూడ్ లేకపోయింది. ఏమనుకోకమ్మా... చివరికి ఫోన్ కూడా చేయబుద్ధి కాలేదు' జయ అంది.

తండ్రి ఎందుకిలా అవుతున్నాడో గీతకి అంతుపట్టలేదు. 'అమ్మా! ఈరోజు సెలవు తీసుకుంటాను... ఈరోజు ఇక్కడే ఉండిపో...' అంది గీత.

జయ ఒప్పుకుంది. భోజనం చేస్తూ జయ అడిగింది. 'ఏమిటీ ఇప్పుడప్పుడే పిల్లలు వద్దు అనుకుంటున్నారా? ' సరిగా సెటిల్ అవకుండా బాధ్యతలు పెంచుకోవటం అతనికి ఇష్టం లేదు. అందుకనే గీత జవాబు ఇవ్వకుండా నవ్వి ఊరుకుంది.

కబుర్లలో సమయమే తెలియలేదు ఇద్ద

రికీ. 'చాలా రోజుల తరువాత నీతో ఇంత సేపు మాట్లాడితే ఎంత ఆనందంగా ఉందో తెలుసా?' అంది జయ సాయం కాలం ఇంటికి వెడుతూ.

ఈరోజు యోగి చాలా ఆలస్యంగా వచ్చాడు. 'ఏమిటిది యోగిబాబూ! ఎన్నెన్నో విషయాలు నీతో ముచ్చటించాలని ఎప్పటినుంచో వెయిట్ చేస్తుంటే ఇప్పుడా రావటం?'

'దీపావళి ప్రత్యేక సంచిక తయారుచేయటంలో హడావిడి పడుతున్నాం... రేపు కూడా ఇలాగే పన్నెండు గంటలు పనిచేయాలి...' అన్నాడతను.

'అంటే రేపటి సంజాయిషీ కూడా ఇప్పుడే ఇచ్చేశావన్న మాట...' అంది గీత నవ్వుతూ.

కాఫీ తాగుతూ తల్లి రావటం గురించి చెబుతూ హఠాత్తుగా ఆగింది గీత. 'యోగీ! నీతో నిన్న ఇంకో విషయం ప్రస్తావించాలనుకుని మరిచిపోయాను... తార ఏమని అన్నదో తెలుసా?... మామయ్య దగ్గరకి మీరే వెళ్లచ్చు కదా అంది... ది బాల్ ఈజ్ ఇన్ యువర్ కోర్ట్... నువ్వు ఎప్పుడు సెలవు పెడతావో చెప్పు...'

అతను నవ్వాడు. 'మినిమమ్ పదిరోజులయినా సెలవు కావాలి కదా... బహుశా నాలుగైదు నెలల తరువాత ప్లాన్ చేద్దాం...' అన్నాడు.

అతను నాలుగైదు నెలలు అన్నాడు కాని ఇంకో ఎనిమిది నెలలు అదనంగా పట్టింది... నిజానికి గీత ప్లాన్ ప్రకారం రెండో మ్యారేజ్ యానివర్సరీని రంగారావుతో గడుపుతారు! టికెట్లు రిజర్వ్ చేసుకున్నారు... రంగారావుకి కూడా చెప్పారు. ఇంకో రెండు రోజులలో ప్రయాణం అనగా రంగారావు ఫోన్ చేశాడు. 'ఇక్కడ ఆశ్రమంలో ఉన్న కొంతమంది చార్‌ధామ్ యాత్రకి వెడుతున్నారు... మళ్లీ ఇలాంటి అవకాశం రాదు... ఇప్పుడేదో కాస్త ఓపిక ఉంది కదా... అందుకని నేను కూడా ఆ పుణ్యక్షేత్రాలని చూడాలని అనుకుంటున్నాను... రేపే ప్రయాణం... మొత్తం పది పదిహేను రోజులు పడుతుంది... ఆ తరువాత రండి' అన్నాడు.

యోగికి చెప్పలేనంత నిరుత్సాహం కలిగింది.

అయితే రెండో యానివర్సరీ రోజున మాత్రం ఓ మంచివార్త తెలిసింది. పొద్దున్నే జయ, రాఘవ వచ్చారు. స్వీట్లు, బట్టలు తెచ్చారు.

తండ్రి మొహంలో ఏదో తెలియని కాంతిని చూసి ఎందుకా అనుకుంది గీత.

రాఘవ, యోగి కబుర్లు చెప్పుకుంటుంటే జయ, గీత కిచెన్‌లోకి వెళ్లారు. 'గీతా! నీకో శుభవార్త! నాన్నగారు డ్రింక్స్ మానేశారు'

'నిజమా?' గీత విభ్రాంతితో అడిగింది. గీత కాఫీ కలుపుతుంటే జరిగిందేమిటో జయ చెప్పింది.



**తాగుడు మానేయాలని రాఘవ ఎప్పటినుంచో ప్రయత్నిస్తున్నాడు. వారం రోజులు సీసా ముట్టుకోకపోవటం, ఆ తరువాత నాలిక పీకుతుంటే మళ్లీ మొదలుపెట్టటం... ఇలా సాగింది.**



తాగుడు మానేయాలని రాఘవ ఎప్పటినుంచో ప్రయత్నిస్తున్నాడు. వారం రోజులు సీసా ముట్టుకోకపోవటం, ఆ తరువాత నాలిక పీకుతుంటే మళ్లీ మొదలుపెట్టటం... ఇలా సాగింది. చివరికి కూతురి మొదటి మ్యారేజ్ యానివర్సరీ సమయంలో ఇక మద్యంముట్టనని, కూతురికి ఇచ్చే బహుమతి అదే అని గట్టి నిర్ణయం తీసుకున్నాడు... కాని దురదృష్టవశాత్తు రెండు రోజుల ముందు ఆగలేక చిత్తుగా తాగాడు. దాంతో కూతురి మొహం



చూడలేక అతను క్రితం ఏడు రాలేదు. కాని ఓ సంవత్సరకాలం అతను శ్రమపడి మొత్తానికి ఆ దురలవాటుని దూరం చేసుకోగలిగాడు. ఇక ఆ వైపు చూడనని అతనికి దృఢంగా తెలిసిపోవటంతో ఇప్పుడు ధైర్యంగా వచ్చాడు.

అది విన్న గీత చలించిపోయింది. 'అమ్మా! కాఫీ సంగతి నువ్వు చూసుకో... ప్లీజ్!' అంటూ హాల్‌లోకి పరుగుతీసింది. రాఘవ కాళ్ల వద్ద కూర్చుని అతని ఒడిలో తలవాల్చింది. 'థాంక్‌యూ నాన్నా! థాంక్ యూ ఫర్ దిస్ నైస్ ప్రెజెంట్' అంది.

ఒకసారి వాయిదా పడ్డ కాశీ ప్రయాణానికి వరసగా ఏవేవో అడ్డంకులు వస్తూనే ఉన్నాయి...

ఒకసారి యోగికి పనుల ఒత్తిడి. ఇంకోసారి గీత ఒంట్లో కాస్త నలతగా ఉంది.

ఈలోగా గీతకి ప్రమోషన్ వచ్చి ఉద్యోగ బాధ్యతలు పెరిగాయి. తరువాత యోగికి ఓ సమస్య ఎదురయింది. అన్నదమ్ములు వాటాలు పంచుకోవటంతో దినపత్రిక అన్నకి వార, మాసపత్రికలు తమ్ముడికి దక్కాయి. ఏదో ఒకపక్షాన్నే ఎన్నుకోవలసి రావటంతో ఇబ్బందుల్లో పడ్డాడు.

అదే సమయంలో తెలుగులో కూడా ఇరవైనాలుగు గంటల ఛానెళ్లు రావటంతో యోగి దృష్టి అటు మళ్లింది.

తార, రాజా ఎంబీఏ పూర్తి చేశారు. తార ఉద్యోగంలో చేరింది. ఎంబీఏ అయ్యాక రాజా సినిమారంగానికి వెడతానంటే తల్లితండ్రులు ఒప్పుకోలేదు. రాజా వాళ్లతో బాగా గొడవ పడ్డాడు. ఇల్లు వదిలి పెట్టాడు. 'ఏడాది ఉద్యోగం చేసి వెనక వేసుకుంటాను... ఆ తరువాత నా గోల్ సినిమానే... రెండు మూడేళ్లు ప్రయత్నిస్తాను... ఫెయిలయితే ఏదో ఒక ఉద్యోగం దొరకక పోదు...' అని రాజా ప్రకటించాడు.

'మంచి ఆలోచన' అన్నారు గీత, యోగి.

'చూడు అక్కా! నేను డబ్బులు ఇస్తే తీసుకోడుట. ఉద్యోగంలో తను సంపాదించింది ఎన్ని రోజులు వస్తే అన్ని రోజులు సినిమా ఫీల్డ్‌లో ట్రై చేస్తూనే ఉంటాడుట. ఏం నేను జాబ్‌చేసి ఎర్న్ చేసేది ఎందుకు కాదనాలి?' తార ఫిర్యాదు చేసింది.

రాజా వివరించాడు. 'సినీ రంగంలో సక్సెస్‌ని చవిచూసిన వారి కథలన్నింట్లో స్పష్టంగా కనబడేది. ఒకరకమయిన కసి! ఇలా ఎవరో ఒకరు స్పాన్సర్ చేస్తుంటే ఎలాగైనా క్లిక్ అవాలన్న కసి ఉండదు.'

అతను చేసిన పొరపాటు ఏమిటంటే అలాంటి భవిష్యత్తు ప్రణాళికని ఫ్రాంక్‌గా తార తల్లితండ్రులకూ చెప్పాడు. 'ఇలాంటి పోరంబోకుతో తిరిగావంటే కాళ్లు విరగ్గొడతాను' అని తారని హెచ్చరించాడు తండ్రి. 'ఆ అబ్బాయికి ఏదో తిక్క ఉంది... లేకపోతే లక్షణమయిన చదువు చదివి జీవితంతో గాంబ్లింగ్ ఆడుతాడా? అలాంటి వాడిని అల్లుడిగా చేసుకోవటానికి మాకేం తిక్కలేదు' అని తల్లి అంది.

తార హతాశురాలయింది.

'అతను సినిమాలలో క్లిక్ అయితే సమస్య ఉండదు కదా!' సముదాయించే యత్నం చేసింది గీత.

10



**కా**లం పరుగుతీస్తూనే ఉంది...

ఓ రోజు టీవీలో ఛానెళ్ళు మారుస్తుంటే రాజా కనబడ్డాడు. ఏమిటా అని గీత, యోగి

ఆసక్తిగా చూశారు. ఓ సినిమాలో నటిస్తున్న ఓ వర్ధమాన నటి నిద్రమాత్రలు మింగి ఆత్మ హత్యాయత్నం చేసిందిట... ఆ యూనిట్‌లో అసిస్టెంట్ డైరెక్టర్‌గా పనిచేస్తున్న రాజా ఆమెని సమయానికి హాస్పిటల్‌లో చేర్పించా డుట. అతని నుంచి ఇంకా వివరాలు రాబ ట్టాలని టీవీ రిపోర్టర్లు శతధా ప్రయత్ని స్తుంటే రాజా అంటీ ముట్టనట్లు జవాబు ఇస్తున్నాడు.

మర్నాడు పేపరులో వార్త వివరంగా వచ్చింది. అర్ధరాత్రి ఆ సమయంలో రాజా అక్కడ ఉండటం ఎలా సంభవించిందన్న ప్రశ్నతో ఆ వార్త ముగిసింది. వెంటనే తార గుర్తుకొచ్చింది గీతకి. ఎంత కంగారుపడుతు న్నదో పిచ్చిపిల్ల అనుకుంది.

ఆమె లాబ్‌లో పనిచేసుకుంటుంటే ఎవరో విజిటర్ వచ్చారని ఫోన్ వచ్చింది. వెళ్లి విజి టర్స్ రూమ్‌లో చూస్తే తార ఉంది. గీతను పట్టుకుని ఏడవటం మొదలుపెట్టింది.

అదృష్టవశాత్తూ ఆ రూమ్‌లో వాళ్లిద్దరే ఉన్నారు. 'ఛా! ఏమిటిది తారా! మరీ చిన్న పిల్లలాగా ఏమిటా ఏడుపు? ' గీత అంది.

వెక్కుతూనే తార చెప్పింది. 'ఆ సినీ మాయ లోకంలోకి వెడితే చెడిపోవడం ఖాయం అని మేం ముందే చెప్పామా? ' అన్నాడుట ఆమె తండ్రి. 'అతడిని పెళ్లి చేసు కుంటే నేను ఆత్మహత్య చేసుకుంటాను' అందిట తల్లి. రాజా నుంచి ఏ కబురూ లేదుట. మధ్యలో తార నలిగిపోతోంది.

'నువ్వేం కంగారుపడకు... ఎలాగయినా ఎల్లుండి ఆదివారం సాయంకాలం రాజాని మా ఇంటికి తెచ్చే బాధ్యత యోగి పైన వేస్తాను. అతను సాధిస్తాడు అని నాకు నమ్మకం ఉంది. నువ్వు కూడా రా... ఇద్దరూ ముఖాముఖీ మాట్లాడుకుంటే అపా ర్థాలు కరిగిపోతాయి... నిజానిజాలు తెలు స్తాయి...' ధైర్యం చెప్పింది గీత.

తార కళ్లు ఆశతో మెరిశాయి. 'అక్కా! ఓ సాయం చేయాలి... ఆ రోజు నీ బర్త్‌డే అని మమ్మీ వింటుండగా నన్ను మీ ఇంటికి ఇన్వయిట్ చేయాలి... సరేనా? '

'నో ప్రాబ్లెమ్! ఏడాదిలో రెండు పుట్టిన రోజులు జరుపుకునే భాగ్యం అందరికీ వస్తుందా ఏమిటీ? ' అంది గీత నవ్వుతూ.

★ ★ ★

ఆదివారంనాడు యోగి ఓ ప్రొడ్యూసర్‌ని కలవాలని పొద్దున్నే వెళ్లాడు. ప్రతి ఆది వారం ఉదయం ఎనిమిది గంటల సమ యంలో ఇదీ... ఈ వారం అన్న వెరయిటీ ప్రోగ్రామ్ కాన్సెప్ట్ గురించి వివరించాలని అతని ప్రయత్నం. సాహిత్య, సంగీత, సినిమా, సైన్స్ రంగాలలో ఆ వారం యొక్క ప్రాధాన్యతని వర్ణిస్తూ వారంలో జరిగిన ముఖ్య విషయాలని, రచనలని స్పృశిస్తూ సాగే వినూత్న కార్యక్రమాన్ని జాగ్రత్తగా రూపొందించాడు యోగి. 'నాకయితే ఆయన ఇంప్రెస్ అవుతాడని నమ్మకం ఉంది. ఇది క్లిక్ అయితే...' అర్ధోక్తిలో ఆపి గీతకి బై చెప్పాడు యోగి.

మధ్యాహ్నం భోజన సమయానికి రావలసి నవాడు సాయంకాలమైనా రాలేదు.

చెప్పిన సమయానికన్నా అరగంట ముందుగా తార వచ్చింది.

'యోగి అతన్ని స్వయంగా కలిసి మాట్లా డాడుట. తప్పకుండా వస్తానని రాజా చెప్పా డుట. ఇక తన పాత్ర అయిపోయింది కదా అన్నట్లు యోగి పొద్దున్నే బయటికి వెళ్లాడు. మధ్యాహ్నం భోజనానికి కూడా రాలేదు. ఇప్పటికీ పత్తాలేదు. కాఫీ తాగుదామనుకుని కూడా కంపెనీ లేదని ఆగాను...' అంది గీత.

కాఫీ తాగి రాజా కోసం ఎదురుచూడసా గారు. పావుగంట... అరగంట... ముప్పావు గంట. రాజా రాలేదు. తార భరించలేని టెన్ష న్‌తో నలగసాగింది. గీత ఇంకోసారి కాఫీ





తెచ్చింది.

తార కప్పు కింద పెట్టిందో లేదో రాజా వచ్చాడు. తార లేచి నిలబడింది.. ఏదో అస్పష్టమయిన సంశయం ఆమెని కదలని య్యలేదు. రాజా అది గమనించినట్లు న్నాడు. ఆమెని సమీపించి భుజాన్ని సుతా రంగా తాకాడు. 'తారా! ఎలా ఉన్నావు?' అని మృదువుగా అడిగాడు.

తార బదులు ఇవ్వలేదు. గీత చెప్పింది 'విపరీతమయిన టెన్షన్‌లో ఉంది. ఆ గది లోకి వెళ్లి ఇద్దరూ మనసు విప్పి చెప్పు కోండి. ఈలోగా బహుశా యోగి కూడా వస్తాడు. ఇటు వంటకూడా అయిపో తుంది. భోజనంచేసి ఇళ్లకి వెళ్లిపోవచ్చు..'

రాజా ఏం చెప్పాడో కాని అరగంటలో తార మొహం కళకళలాడింది. కిచెన్‌లో ఇద్దరూ గీతకి సాయం చేయసాగారు.

'రాజా! ఎలా ఉంది పరిస్థితి?' గీత అడి గింది.

రాజా నవ్వాడు. 'చాలా ఫాసినేటింగ్ ఫీల్డ్ అది... కాని ఏ నిముషానికి ఎందుకు మనసు మార్చుకుంటారో చెప్పలేం. ఎదురుదెబ్బలు తింటూ ఎలా నిలదొక్కుకోవాలో నేర్చుకుంటున్నాను. సక్సీడ్ అవుతానని నమ్మకం ఉందికాని ఎప్పటికో చెప్పలేను. కాని నేను ముందుగా అనుకున్న దానికంటే ఎక్కువ కాలమే పట్టచ్చు'

'ఆల్ ది బెస్ట్' అంది గీత మనస్ఫూర్తిగా.

వంట అయింది.. అయినా యోగి రాలేదు.

ఇక యోగి గురించి మరిచిపోయి మనం తినేద్దామా అని గీత అంటుంటే కాలింగ్ బెల్ మోగింది.

పరుగున వెళ్లి గీత తలుపు తీసింది. ఎదురుగా నవ్వుతూ యోగి.

'ఏమిటిది యోగి! లంచ్‌టైమ్‌కి వస్తానని అన్నావు. ఇప్పుడా రావటం?! ఫోనయినా చేయవచ్చు కదా!'

ఎంత నిగ్రహించుకుందామన్నా అతను కనబడగానే అడగకుండా ఉండలేకపో యింది గీత.

'ఫోనా?! ఫోన్ చేయటానికి రెండు రూపాయలు కూడా జేబులో లేవు...' అన్నాడతను, లోపలికి అడుగు పెడుతూ.

రాజాని, తారని హలో అని పలకరించి సోఫాలో కూలబడ్డాడు తర్వాత.

గీత ఫ్రిజ్‌లోంచి నీళ్ల బాటిల్ తీసి అత నికి అందించింది. పొద్దున నాలుగు వందలు తీసుకువెళ్లాడు అతను. అందులో నలభయి అతనిమీద ఖర్చు చేసుకున్నా గీతకి ఆనందమే! అతను చెప్పింది నిజమే. అతని దగ్గర డబ్బు హాఫ్‌లైఫ్ ఐదు నిము షాలే! అందులో సందేహం లేదు.

'ఇల్లు కిలో మీటర్ దూరం ఉందనగా బండి చెడిపోయింది.. తోసుకుంటూ వచ్చే సరికి ఇంకా ఆలస్యం అయింది' యోగి అన్నాడు. ఎప్పుడో పదేళ్ల క్రితం కొన్న ఆ బైక్‌ని అతని కంటే అతని స్నేహితులే ఎక్కువ వాడేవారు. సహజంగానే అది బాగా పాడయ్యింది.

'ఇంతకీ మధ్యాహ్నం భోజనం చేశావా లేదా?' గీత అడిగింది.

'నువ్వేం దిగులు పడకు... తిన్నాను. అసలు ప్రశ్న అడగలేదేమిటి?' యోగి నవ్వుతూనే అడిగాడు.

'అసలు ప్రశ్న ఏమిటి?'

'పొద్దున్నే నేనేదో సాధించాలని వెళ్లాను...' తారకి, రాజాకి అర్థం కావా లనో, వివరించాలనో చెప్పాడు యోగి. 'ఆ సంగతి ఏమయిందో తెలుసుకోవాలన్న ఆసక్తి లేదా గీతా.. సరే! నేనే జవాబు ఇస్తాను. అసలు ఆయన దొరకటమే బాగా ఆలస్యం అయింది. నా కాన్సెప్ట్

చెప్పాను... శ్రద్ధగానే విన్నాడు. బాగుంది అన్నాడు. ఆ తరువాత కొత్త పితలాటకం పెట్టాడు. అనుకున్న ఫీచర్‌కి మధ్య మధ్యలో ఆ వారానికి ఒక్కొక్క రాశి ఫలాలు చెప్పిస్తే ఎలా ఉంటుంది అని అడిగాడు. ఆ రోజున పుట్టిన ఫలాన నటుడు రాణించటానికి ఆనాటి గ్రహస్థితులు ఎలా సాయం చేశాయో కూడా చెప్పుకుంటే అద్భుతంగా ఉంటుంది కదా అని కూడా అన్నాడు. అలా అడగటం డెమోక్రసిలాగా కనబడటానికే కాని అవి ఉంటేనే బాగుంటుందని ఎప్పుడో ఓ నిర్ణయానికి వచ్చేశాడు. నేను అవన్నీ నమ్మను. వద్దు అన్నాను. ఆ మాటలు, ఆ వాదనలు అంతటితో ఆగలేదు. ఎక్కడికో దారితీశాయి. ఏతావాతా చెప్పేదేమిటంటే ఆయన డ్రాప్ ఔట్ అయిపోయాడు. ఎందుకో ఇదీ క్లిక్ కాలేదు'

అతనే నవ్వుతూ చెప్పినప్పుడు తను ఎందుకు నవ్వకూడదని గీత కూడా నవ్వింది. ఆ వాదనలు ఎలా జరిగి ఉంటాయో ఆమె ఊహించుకోగలదు.

ఇలాంటి వాదనలలో ఎవరూ అతన్ని ఓడించలేరు. ఆవేశం వస్తే ఘాటుగా దులిపేస్తాడు.

అలా జరిగాక ఏ ప్రొడ్యూసరూ యోగితో నవ్వుతూ మాట్లాడలేదు. ఇక క్లిక్ అయ్యే ప్రశ్నే ఉండదు. స్థాపించినప్పటి నుంచి దాదాపు నలభై ఏళ్ళ వారఫలాలు ఇవ్వకుండా తన ప్రత్యేకతని నిలుపుకున్న హిందూ పత్రిక ఒక్కసారిగా మిగిలిన అన్ని పత్రికలలాగానే వారఫలాలూ, గోచార ఫలాలు ఇవ్వటం మొదలుపెట్టినప్పుడు యోగి ఎంత బాధ పడ్డాడో ప్రత్యక్షంగా చూసిన గీత అతను ఇంకోలాగా ప్రతిస్పందిస్తాడు అని అనుకోలేదు. 'నాకు తెలిసినంతవరకూ ఇక ఇలాంటి వారఫలాలు ఇవ్వని దినపత్రిక ఈ దేశంలో మన తెలుగు పత్రిక 'ఈనాడు' ఒక్కటే. రేపో మాపో అందులో కూడా మొదలయితే...' నిస్సహాయతతో ఆ రోజున అతని స్వరం కంపించటం ఇప్పటికీ గీత మరచిపోలేదు.

రాజా, తార కిటికీలోంచి బయటికి చూస్తూ ఉండడం గమనించింది గీత. వాళ్లని కూడా సంభాషణలోకి లాగాలని రాజాని అడిగింది. 'రాజా! సినిమా రంగంలో సెంటిమెంట్లు, చాదస్తాలు ఎక్కువ అంటారు. నీకు జ్యోతిషం పైన నమ్మకం ఉందా...? '

'అప్పుడప్పుడూ నమ్మాలనిపిస్తుంది. జ్యోతిషం నిజం అనుకోండి. నమ్మితే మంచిదే కదా! నిజం కాదనుకోండి. అయినా నమ్మితే ఏ నష్టం ఉండదు కదా? ' గోడమీద పిల్లిలాగా అన్నాడు రాజా.

యోగిని టీజ్ చేయాలని గీత నవ్వుతూ అంది 'యోగి! నీకు నమ్మకం లేకపోవచ్చు గాని ఎంతమంది ప్రతి రోజూ రాశి ఫలితాలు చూస్తారో తెలుసా? ఎంతమంది అవి చదివి మనశ్శాంతి పొందుతారో తెలుసా? అటువంటప్పుడు నీ వ్యక్తిగత అభిప్రాయాలని నలుగురి మీద రుద్దాలని ఎందుకు ప్రయత్నిస్తున్నావు? జ్యోతిషాన్ని నమ్మే ఆ మాత్రం స్వేచ్ఛ లేదా ప్రజలకి? ... నువ్వు బిగ్‌బ్రదర్ లాగా నిలబడి వాళ్ళని సరి అయిన దారిలో నడిపించాలా? ... చెప్పు...'

టీ పాయ్ మీద ఉన్న పేపర్ అందుకున్నాడు యోగి. 'దేశంలో ఉన్న వంద కోట్ల జనాభానో ప్రపంచంలోని ఆరేడు వందల కోట్ల మంది భవితను ఈ పన్నెండు రాశులకి కుదించి చెప్పటాన్ని బూటకం అని తప్ప ఇంకోలాగా ఎలా వర్ణించగలం? నిజం చెప్పాలంటే జ్యోతిషం, జాతకాలు





పెద్ద ట్రాష్' కచ్చితంగా అన్నాడు.

'ఇది టూ మచ్ యోగి!... నువ్వు నమ్మకపోయినంత మాత్రాన నీకు నచ్చకపోతే పోయినంత మాత్రాన దురుసుగా ట్రాష్ అన్న పదప్రయోగం చేయటం బాగా లేదు... పైగా జ్యోతిషంలో శాస్త్రీయత ఉందన్న విశ్వాసంతోనే కదా యుజిసి ఒకప్పుడు అందులో డిగ్రీ కోర్సులు, పిహెచ్‌డిలు మొదలుపెట్టాలి అని అనుకుంది'

'ట్రాష్ అన్న పదం దురుసుగా ఉందా?... ఒప్పుకుంటాను. కాని దానికి ఓ కారణం ఉంది. వివరంగా చెబుతాను. జ్యోతిషం ఏం అధ్యయనం చేయలేదు. అయినా అలాంటి కామెంట్ చేసే దుందుడుకు పని నేను ఎందుకు చేస్తున్నానో తెలుసా? ఆ ట్రాష్ అన్న పదప్రయోగం చేసింది స్వామి వివేకానంద కాబట్టి... క్షుణ్ణంగా అధ్యయనం చేయకుండా ఆయన అంతమాట అనడుకదా... అందుకనే సందేహించకుండా నేను కూడా ట్రాష్ అనటం మొదలు పెట్టాను. సరేనా?' యోగి నవ్వాడు. 'ఇందాక నువ్వు అన్నావే ఏవేవో కోర్సులు అని ఆ కోర్సులు ప్రవేశపెట్టాలనుకున్న పెద్ద మనుషులకి ఆరాధ్యుడు కదా వివేకానందుడు? వివేకానందుడు ఇంకా ఏమన్నాడో తెలుసా? హిందువుల అభివృద్ధికి అడ్డుగా నిలిచిన వాటిల్లో జ్యోతిష్యం కూడా ఉంది అన్నాడు. ఇకపోతే ఆ కోర్సులు ప్రవేశపెడుతుంటే సైన్స్‌లో పనిచేసే వాళ్ళు చాలామందే అది ఎంతటి దురదృష్టకర నిర్ణయమో గోల చేసి మరీ చెప్పారు. అసలయిన విషాదం ఏమిటంటే అలా అన్న వాళ్ళల్లో ఉన్నత పదవులలో ఉన్నవారు ఒక్కరూ లేకపోవటం... అంటే వాళ్ళందరికి పదవుల మీద ప్రేమ ఉండటమో రాజకీయవేత్తలకి కించిత్తు వ్యతిరేకంగా మాట్లాడితే ప్రమాదం అన్న పిరికితనం ఉండటమో, సైంటిఫిక్ టెంపర్ లేకపోవటమో, లేకపోతే మీ ప్రొఫెసర్ అన్నాడు చూడు సోషల్ టెంపర్ అని, ఆ సోషల్ టెంపర్ మరీ ఎక్కువగా ఉండటమో, కాకపోతే ఇవన్నీనో కారణం అయి ఉండాలి...' తాను కొంత ఆవేశంగా మాట్లాడుతున్నానని గ్రహించినట్లున్నాడు యోగి, కొంత ప్రయత్నం మీద తగ్గాడు.

సోషల్ టెంపర్ అంటున్నప్పుడు యోగి గొంతులో వినిపించిన వ్యతిరేకతని గీత పసికట్టింది.

తార, రాజా మంత్రముగ్ధులులాగా రెప్పార్పకుండా యోగినే చూస్తూ వింటున్నారు.

అతను కొనసాగించాడు 'ఇకపోతే మనశ్శాంతి కోసం అంటావా? చివరికి నా శత్రువు అయినా మనశ్శాంతి కోసం నేను జాతకాలను నమ్ముతున్నాను అంటే.. పిచ్చివాడా అంతకంటే మందు కొట్టు బెటర్ అని చెబుతాను... అది నా కన్విక్షన్. దానికి వ్యతిరేకంగా ఏ పనీ చేయకపోవటం నా నైజం... నువ్వు అది తప్పు అంటే పెళ్ళానివి కాబట్టి ఇంకోసారి నా ఆలోచనా సరళి తప్పో ఒప్పో క్షుణ్ణంగా బేరీజు వేస్తాను. చెప్పు... తప్పంటావా?'

సైన్సులో డాక్టరేట్ ఉన్నవాళ్ళు, రాహువు కేతువు లేరని తెలిసిన వాళ్ళు, సిద్ధాంతులు ఇప్పుడు ప్రామాణికంగా తీసుకునే గ్రహాల స్థానాలకి, అసలు స్థానాలకి ఎంతో తేడా ఉందని తెలిసిన వాళ్ళు... వీళ్ళందరూ.. పోనీలే, నమ్మితే నష్టం ఏమిటి అన్న ధోరణిలో ఉంటే యోగి రాజీపడని ధోరణి ప్రదర్శించటంతో తార మనసులోనే అతన్ని అభినందించింది... చాలా మందికి వెర్రితనంలా కనబడే ఆ గొప్పతనం మన ఆప్తులకి ఉంటే మటుకు భరించటం నిజంగా కష్టమే! అందుకనే గీత మీద కూడా తారకి గౌరవం పెరి

గింది.

గీత తప్పో ఒప్పో చెప్పలేదు. యోగిని మోడరేట్ చేసే ప్రయత్నాన్ని కొనసాగించింది. 'రాశి ఫలాలు చదవటానికి నమ్మకమే అక్కరలేదు. ఎంత సరదాగా ఉంటాయో తెలుసా? అంతదాకా ఎందుకు పొద్దున నువ్వు ఎంతకీ రాకపోయేటప్పటికి విసుగు వచ్చి ఏం తోచక ఆదివారం అనుబంధంలో దిస్ వీక్ ఫర్ యూ చదివాను... ఏం రాశారో తెలుసా?... ఆకస్మిక ధనలాభం... అతిథులతో విందు భోజనాలు... దూర ప్రయాణాలుట. ఎంత నిజం అయ్యాయో చూడు... అతిథులు, విందు భోజనాలు నిజమే కదా!... ఇక ఆకస్మిక ధన లాభం అంటే... ఇదుగో తార ఏం చేసిందో తెలుసా...' అంటూ తారకి మాత్రమే కనబడేటట్లు కన్ను గీటింది గీత. తార రావటంతోనే ఓ అయిదు వందల రూపాయల నోట్ ఇచ్చింది. ఏమిటి అని అడిగితే నేను ఎప్పుడో వాళ్ల ఇంట్లో ఓ పుస్తకం మరిచిపోయానుట. ఇవ్వాలి ఇవ్వాలి అనుకుంటూనే అలక్ష్యం చేసిందిట. తీరా ఈరోజు చూస్తే అందులో ఈ నోట్ ఉందిట... ఇకపోతే దూర ప్రయాణాలు అంటే...' అని గీత తడుముకోసాగింది.

సరదాగా పార్టీ మారి జ్యోతిషాన్ని సపోర్ట్ చేద్దామనుకున్నాడేమో యోగి చేయి ఎత్తాడు 'దూర ప్రయాణం అంటే నేను చెబుతాను... డాక్టర్ గీతకి ఏదన్నా సెమినార్‌కి ఆహ్వానం అందుతుందేమో!'

అందరూ నవ్వారు.

'మరిచిపోయాను... ఇంకో ప్రకటన... ఇందాక ఆ ప్రొడ్యూసర్ చేష్టలతో నాకు విసుగు పుట్టింది... ఓనెల రోజులపాటు ఏ ఉద్యోగం చేయకూడదు అనుకున్నాను... అంత మంచి నిర్ణయం తీసుకున్నందుకు నన్ను నేనే అభినందిస్తూ స్వీట్లు కూడా కొన్నాను...'



**'థాంక్యూ యోగీ! స్వీట్ లేకుండా భోజనం ఎలా పెట్టాలా అనుకుంటున్నాను' అంది గీత లేస్తూ. 'భోజనాలు వడ్డించనా?' 'అందరం కలిసి టేబుల్ అరేంజ్ చేద్దాం... సరేనా?' యోగి కూడా లేచాడు.**



'థాంక్యూ యోగీ! స్వీట్ లేకుండా భోజనం ఎలా పెట్టాలా అనుకుంటున్నాను' అంది గీత లేస్తూ. 'భోజనాలువడ్డించనా?'

'అందరం కలిసి టేబుల్ అరేంజ్ చేద్దాం... సరేనా?' యోగి కూడా లేచాడు.

భోజనానికి కూర్చోబోతూ తార అంది. మీ మొదటి యానివర్సరీని మాతో గడపటం నేను ఎప్పటికీ మరిచిపోలేను అక్కా!'

యోగి ఏదో చెప్పబోయాడు... ఈలోగా కాలింగ్‌బెల్ మోగింది. అతను లేచి 'మీరు మొదలు పెట్టండి... నేను చూస్తాను. పొరపాటున మా ప్రొడ్యూసర్ మనసు మార్చుకుని రాలేదు కదా? ఏ జ్యోతిష్యుడో ఈ రోజు నువ్వు అనుకున్న పని మార్పులు చేర్పులు లేకుండా కొనసాగిస్తే నీకు కలిసి వస్తుంది అని చెబితే తప్ప వాడి మనసు మామూలుగా మారదు' అంటూ తలుపు తీయటానికి వెళ్ళాడు.

కంచంలో ఉన్న స్వీట్ అందుకుని ఒక ముక్కచేసి నోటిలో ఉంచుకున్నాడు రాజా.

రెండు నిముషాల తరువాత యోగి లోపలికి వచ్చాడు. చేతిలో ఓ కాయితం ఉంది... రాజా, తార గమనించలేదు కాని



యోగి సన్నగా వణుకుతున్నాడు... అది పసికట్టిన గీత టక్కున లేచి నిలబడింది.

అతని చేతిలో ఆ కాయితం రెపరెపలాడుతున్నది... పది లైన్లకి పైగా ఉన్న ఆ టెలిగ్రాం మెసేజ్‌ని చదువుతూ యోగి సోఫాలో కూర్చున్నాడు... కళ్ళు మూసుకుని అర నిముషం తరువాత మెల్లగా తెరిచి అన్నాడు 'టెలిగ్రాం!... నాన్న పోయాడుట...' ఆ మాటలు స్థిరంగా అనటానికి అతనెంతో ప్రయత్నించాడు.

గబగబా వెళ్ళి గీత అతని పక్కన కూర్చుని భుజంమీద చేయి వేసింది.

రాజా స్వీట్ కంచలో పడేసి నుంచున్నాడు. తార గ్లాసు ఎత్తి గుటుక్కున నీళ్ల తాగింది.

'ఆయన పోయి మూడు రోజులయిందిట... ఆయన కోరినట్లే కర్మకాండలన్నీ జరిపి అంతా అయిపోయాక నాకు తెలియచేస్తున్నారుట!... ఇప్పుడు వచ్చి నన్ను ఆయనకి సంబంధించిన వస్తువులు కొన్ని తీసుకువెళ్ళమని ఆశ్రమంవాళ్లు టెలిగ్రాం ఇచ్చారు... పోగానే నాకు చెప్పవద్దని నాన్న కోరినట్లున్నాడు...' అతని ప్రయత్నం ఎంత మాత్రం ఫలించటం లేదు. గొంతులో వణుకు పెరుగుతోంది... తనని ఇంకా దగ్గరగా తీసుకుంటున్న గీతని చూస్తూ అన్నాడు యోగి, 'నువ్వు నన్ను పెళ్ళి చేసుకుంటానంటే నాన్న ఏమన్నాడో గుర్తు ఉందా? వీడు దేనికీ పనికి రాడమ్మా అన్నాడు... ఆయనకి తల కొరివి పెట్టటానికి కూడా పనికి రాననుకున్నాడన్నమాట!' భళ్ళున బద్దలయినట్లు ఏడ్చాడు. నిముషం సేపు మాట్లాడలేకపోయాడు. ఆ తరువాత ఏడుస్తూనే తన మనసులో కదలాడుతున్నవన్నీ త్వరగా బయట పెట్టాలి అన్నట్లు గబగబా చెప్పసాగాడు. 'పోనీలే! అలాంటివాటి మీద నాకు నమ్మకం లేదని ఆయనకి తెలుసు కదా! అందుకనే నా అవసరం లేదనుకున్నాడేమో?! ఆయనకి నామీద కోపం



ఉందని తెలుసుగాని ఇంత కోపం ఉందని అనుకోలేదు... చనిపోయిన మూడు రోజుల వరకూ నాకు తెలియకుండా దాచి వుంచమన్నాడుట... ఈ మూడు రోజులు నేను నవ్విన నవ్వులకి అర్థం ఏమిటి? ... ఆయన పోయిన రోజున మనం హోటల్ కి వెళ్లాం. అప్పుడు కడుపునిండా తిని వేసుకున్న కిళ్ళీకి అర్థం ఏమిటి? ... మూడు రోజులట... మూడు రోజుల పాటు నాకేం తెలియదు' ఆగాడు. ఇంకో రెండు నిముషాలు ఏడుస్తూనే ఉండిపోయాడు. తరువాత కొద్దిగా తేరుకుని 'నేనేం కసాయివాడిని, క్రూరుడుని కాదు... మహా అయితే పిచ్చి ముండావాడ్ని. అంతే! అంత దానికే ఆయన నన్ను కాదని దూరంగా ఆశ్రమానికి వెళ్ళిపోవాలా...? ఆ శిక్ష చాలదన్నట్లు ఇప్పుడిలా చేస్తాడా ఆయన? చెప్పు గీతా చెప్పు... కసాయి వాడు ఎవరు? నేనా..? ఆయనా..?' మళ్ళీ వలవలా ఏడవసాగాడు.

అతన్ని కంట్రోల్ చేయలేనని గీతకి తెలిసిపోయింది. యోగి భుజంమీద వాలిపోయింది.. నీళ్ళు నిండిన కళ్ళకి అంతా మసక మసకగా ఉంది. మొద్దుబారిన మెదడుకి అంతా గజిబిజిగా ఉంది.

రంగారావు నుండి ఉత్తరం పదిరోజుల క్రితమే వచ్చింది. కులాసాగానే ఉన్నానని రాశాడు. ఇప్పుడిలా హఠాన్మరణం చెందటం నిజంగానే షాక్! ఇక జీవితంలో సంబాళించుకోలేని విధంగా కొడుకును రంగారావు చివరిగా దెబ్బతీసిన విధానం గీతని ఇంకా కలచివేసింది. అశక్తురాలిలాగా కూర్చుండి పోయిందామె.

పది నిముషాల తరువాత లేచి మొహం కడుక్కుని వచ్చాడు యోగి. రాజాని చేయి పట్టుకుని టేబుల్ దగ్గరికి తీసుకువెళ్లాడు. తను కూర్చుంటూ అతన్ని కూడా కూర్చోమని సంజ్ఞ చేశాడు. 'ఆయన పోయి చాలా రోజులయింది. ఇప్పుడు



దానికోసం మనం భోజనాలు మానేయా ల్సిన పనిలేదు... తినండి రాజా.. రా తారా.. గీతా వచ్చి కూర్చో' అన్నాడు. చపాతీ తుంపి ఆ ముక్కతో కూరని తీసు కున్నాడు.

రాజా కదలలేదు. అలాగే ఉండిపో యాడు.

యోగి ఇంకోసారి 'తిను రాజా...' అన్నాడు.

గీత యోగి వెనుకగా నిలబడి అతని తలమీద చేయి వేసింది 'నటించడం నీకు రాదు యోగీ... ఎబ్బెట్టుగా ఉంది. పైగా రాజా ఇంకోలా అనుకునేవ్యక్తి కాదు... నీ యాక్షన్ చూసి మోసపోడు... యాక్షన్ ఆపెయ్యి...' అంది.

మళ్లీ ఏడుపు తన్నుకు వచ్చింది. చేతిలోని చపాతి ముక్క కంచంలో పారేసి కంచం తోసి టేబుల్ మీద వాలిపోయాడు యోగి. ఏడుస్తూనే రాజాతో అన్నాడు 'నేను ఏడవగ లనని నాకు మొదటిసారిగా తెలిసింది'

రాజా కర్చీఫ్‌తో కళ్ళు అద్దుకుంటూ అన్నాడు 'మీరు అదృష్టవంతులు యోగి! మీ కన్నీటికి ఓ అర్థం ఉంది. మీ తండ్రికి అశ్రువులతో నివాళి ఇస్తున్నారు. నా సంగతి చూడండి. అందరూ ఉన్నా అనా థలాగా బతుకుతున్నాను...' అతనికి తెలుసు తను అంటున్న మాటలు అప్రస్తు తమని. కాని అలా అసంగతమయిన మాటలే రగులుతున్న మనసులకి సాంత్వన చేకూరుస్తాయి.

గీత ఇంకో చేతితో రాజా తల మీద సుతి మెత్తగా తట్టింది.

'రేపు పొద్దున్నే ఏపీ ఉంది కదూ. అందులో వెడదామా?' అంది గీత కొద్ది సేపు తరువాత.

'నువ్వు కూడా వస్తావా?' అడిగాడు యోగి- 'ఎందుకు?'

'ఆయన ఉండగా ఏదో ఒక కారణం వల్ల ఆశ్రమాన్ని చూడలేదు. ఇన్నిరోజులు ఆయన ఎలాంటిచోట ఉన్నారో చూడాలని ఉంది. అది మొదటి కారణం. ఇకపోతే రెండో కారణం ఏమిటంటే...' అంటూ వాతావరణాన్ని తేలిక చేద్దామన్న ప్రయ త్నంతోనే, తన మనసుకి కూడా హ్యూమర్ కావాలన్న తపనతో చిన్నగా నవ్వి కొనసాగించింది గీత '...రెండో కారణం ఏమిటంటే దూరప్రయాణం అన్న రాశి ఫలాలని నిజం చేయాలని...'




**ఒ**క తెలుగాయన ఆ ఆశ్రమాన్ని స్థాపించాడు. కాశీకి మూడు కిలోమీటర్ల దూరంలో ఉన్న ఆ ఆశ్రమాన్ని మొదటి సారి చూసినప్పుడు ప్రశాంతంగా ఉంది అనుకుంది గీత. 'బాగుంది కదూ!' అని యోగితో అనబోయి చివరి క్షణంలో ఆగిపోయింది.

ఆశ్రమాన్ని ఆసక్తిగా చూశాడు యోగి. 'నాట్ ఏ బ్యాడ్ ప్లేస్..' అన్నాడు.

'ఆయన ఉండగా మనం ఇక్కడికి రాక పోవటం ఎంతో అసంతృప్తిగా ఉంది కాని ఈ ఆశ్రమం చూశాక మామయ్య ఎట్ లీస్ట్ మంచిచోట చివరి రోజులు గడిపాడు అనిపిస్తుంది...' అంది గీత.

అవును అన్నట్లు తల ఊపాడు యోగి. సెక్రటరీని కలిసి మాట్లాడారు.

'ప్లీజ్ యాక్సెప్ట్ అవర్ కండోలెన్సెస్...' అన్నాడు సెక్రటరీ. రంగారావుకి మాసివ్ హార్ట్ ఎటాక్ వచ్చిందిట... ఆరు నెలల క్రితమే ఇసిజి లాంటి పరీక్షలు చేయటం జరిగిందిట... అన్నీ బాగానే ఉన్నాయి అన్నారుట... మరి ఏమయిందో ఏమో మొదటి ఎటాక్‌నే రంగారావు తట్టుకోలేక పోయాడు!

తరువాత ఆయన కొన్ని వివరాలు చెప్పాడు. రంగారావు తన పేరిట ఉన్న మొత్తం అంతా దాదాపుగా ఆశ్రమం పేరిటే రాశాడు. తాను పోయాక యాభై వేల రూపాయలకి మాత్రం డ్రాఫ్ట్ చేసి తయారుగా ఉంచమన్నాడట. అది యోగికి అందచేయమని చెప్పాడుట. '...నా కొడుకుని నేను ఎలా తీర్చిదిద్దానో, ఎలా మలిచానో నాకు తెలియదు... తండ్రిగా నా నుండి అతనేదన్నా పొందాడో లేదో నాకు తెలియదు. అతనికి ఏమీ ఇవ్వకుండా పోవటం నాకు ఇష్టం లేదు... అందుకనే ఈ యాభైవేలు అతనికి అందచేయమని కోరుతున్నాను. పాతికవేలు అతని కోసం వాడుకొమ్మని, మిగిలిన పాతిక వేలు నా మనవడికో మనవరాలికో తాత ఇచ్చే బహుమతిగా అందచేయమన్నానని చెప్పండి...' అని రంగారావు రాసిన విజ్ఞాపనని ఆయన చదివి వినిపించాడు. 'డూ యూ వాంట్ టు నో ఎనీ థింగ్ ఎల్స్?' అడిగాడు సెక్రటరి.

'థాంక్ యూ... వియ్ వుడ్‌లైక్ టు స్పెండ్ సమ్ టైమ్ హియర్... మీకు అభ్యంతరం లేకపోతే ఈ రోజంతా ఆశ్రమంలో గడుపుతాం' అన్నాడు యోగి.

ఆయన తల ఊపాడు.

అప్పుడు యోగి సంశయిస్తూనే అడిగాడు, 'ఆయన నాకు ఏమన్నా ఉత్తరం రాశారా?'

సెక్రటరీ అర్థం చేసుకున్నాను అన్నట్లు తల ఊపి ఫైల్ తీసి కాయితాలు వెతకసాగాడు... యోగి ఊపిరి బిగపెట్టాడు.

'సారీ మిస్టర్ యోగి! హి డిడ్ నాట్ సీమ్ టు హావ్ రిటెన్ ఎనిథింగ్ ఎడ్రెసింగ్ యూ...'

యోగి తల దించుకున్నాడు.

గీత అతని భుజం మీద చేయివేసి తట్టింది.

మామయ్య యోగిని ఉద్దేశించి పర్సనల్‌గా ఒక ఉత్తరం కూడా రాయకపోవటం నిజంగా చాలా అన్యాయం అనుకుంది గీత.

ఆఫీసు రూంనుండి బయటికి వచ్చాక తల ఎత్తాడు యోగి, కళ్ళు పొడిగా కనిపిస్తున్నాయి కాబట్టి ఏడవటం లేదని అనుకోవాలని. కానీ అతను లోలోపల ఎంతగా రోదిస్తున్నాడో గీత అర్థం చేసుకోగలిగింది.

సెక్రటరి ఇచ్చిన డ్రాఫ్ట్ బరువు మోయలేనట్లు గీత చేతిలో పెట్టాడతను.

'యోగి! మామయ్య స్నేహితులతో మాట్లాడుదాం రా...' అంది గీత.

రంగారావుతో సన్నిహితంగా మెలిగిన వారితో మాట్లాడారు.

రంగారావు గురించి అందరూ మంచి మాటలే చెప్పారు.

'మాకు కుదరలేదు కానీ మీ అందరితో కలిసి ఆయన చార్‌ధామ్ యాత్ర చేయగలిగారు... మౌంట్ అబూ చూడగలిగారు...' అంది గీత.

రంగారావు స్నేహితుడు ఆశ్చర్యపోయాడు. 'ఆయన ఇక్కడికి వచ్చాక ఎక్కడికీ వెళ్లలేదు... ఆయన స్నేహితులు కూడా ఎవరూ యాత్రలకి వెళ్లలేదు...'

యోగి, గీత మొహాలు చూసుకున్నారు...యోగి కళ్లల్లో నీరు ఉబికి ఉబికి వస్తున్నది.





అబద్ధం చెప్పి, రావద్దన్నాడు ఆయన... అంతగా దూరం ఉంచాల్సిన అవసరం ఉందా?

తరువాత తండ్రి ప్రతిరోజూ చేసే పనుల గురించి వివరంగా తెలుసుకున్నాడు యోగి. ఆయన కిచెన్‌లో చేస్తాడని చెప్పిన అన్ని పనులని యోగి చేయటం మొదలుపెడితే గీత కూడా సాయం చేసింది. చాలావరకు యోగి మౌనంగానే ఉన్నాడు. పని మధ్యలో ఎవరో టీ అందించారు కాని కప్పుని పెదవికి చేర్చలేదు.

టీ అతని చేతిలోనే చల్లారిపోయింది... గీత మాట్లాడకుండా కప్పు తీసుకుంది.

తానే స్వయంగా యోగికి ఇష్టమయినట్లు టీ చేసి పొగలు కక్కుతున్న కప్పు అతనికి అందించింది.

యోగి కప్పు అందుకుని పక్కన పెట్టేశాడు. గీత రెండు చేతులని అందుకుని అరిచేతుల మధ్య మొహం ఉంచుకుని బావురుమని ఏడ్చాడు... తండ్రి తనకి రాయని ఉత్తరం గురించి అంతగా కుమిలిపోతున్నాడా? ... ఎన్ని రకాలుగా తండ్రి తనని విస్మరించి దూరంగా ఉంచాడో తలుచుకుని దుఃఖిస్తున్నాడా?

సాయంకాలం వరకూ యోగి అలాగే ఆశ్రమంలో గడిపాడు.

రాత్రి నిద్రకు ఉపక్రమిస్తూ లైట్ ఆపిన అయిదు నిముషాల తరువాత అతను ఒక్క ఉదుటున గీత వేపు దొర్లాడు.

రెండు చేతులతో ఆమెని కదుపుతూ 'గీతా! మనిషి తన వారికోసం బతకటం మాత్రమే సరి అయినదా?' అన్నాడు.

ఆమెకి ఏం జవాబు ఇవ్వాలో తెలియలేదు...ఎందుకంటే ఆ ప్రశ్న అర్థమవలేదు... కాని కలవరపడుతున్న యోగికి సాంత్వన ఇవ్వాలన్నట్లు అతనికి దగ్గరైంది.

అతనితోపాటు ఆమె కూడా పైన తిరుగుతున్న ఫ్యాన్‌ని చూస్తూ ఉండిపోయింది...

తిరుగు ప్రయాణంలో యోగి తేరుకున్నట్లు కనబడ్డాడు. గీత అమ్మయ్యా అనుకుంది.

యోగికి సిగరెట్ బాగా అలవాటు. ట్రైన్‌లో అతను తాగలేదు. సాధారణంగా అతను రూల్స్ పాటిస్తాడు. ట్రైన్‌లోనూ రైల్వేస్టేషన్‌లలోనూ నిషేధించారు కాబట్టి అతను తాగలేదు అనుకుంది గీత.



'నేను సిగరెట్ మానేశాను గీతా!' అని అతనే కబుర్లలో చెప్పాడు. 'సిగరెట్ అలవాటు మాన్పించాలని నాన్న ప్రయత్నించి విసిగెత్తిపోయాడు. చివరికి ఓ రోజున నేను చచ్చిపోయాకన్నా ఆ అలవాటు వదులుకుంటావా అని అన్నాడు... పాపం! ఇప్పుడు అదే నిజమయింది...' పంటికింద నలుగుతున్న పెదవి గీత కంట పడకూడదన్నట్లు యోగి మొహం తిప్పుకున్నాడు.

ఏ విధంగా అతన్ని సముదాయించాలో ఆమెకి అర్థం కాలేదు. అయినా ప్రయత్నించింది. 'అత్తయ్య నీ చిన్నతనంలోనే పోవటం దురదృష్టం యోగీ... మామయ్యకి నిన్ను ఎలా పెంచాలో తెలియక మేం లాబ్‌లో చేసినట్లు ప్రయోగాలు చేశారు.'

యోగికి కావలసిన ఓదార్పు లభించిందో లేదో తెలియదు కాని ఇప్పుడు పంటికింద పెదవి నలగటం లేదు.

కాళ్ళు ముందుకు చాపి, సీట్లో కిందకి జారి, ఆమె భుజం మీద తల వాల్చాడు.

రెండు నిముషాలు మౌనంగా ఉన్నాడు. తరవాత వెనక్కి వెళ్ళిపోతున్న చెట్లని కిటికీలోంచి చూస్తూ అన్నాడు '...సిగరెట్ మానేస్తే నెలకి ఎంత లేదన్నా వెయ్యి రూపాయలు ఆదా అవుతాయి... అందుకనే ఆశ్రమానికి నెలకి వెయ్యి పంపాలనుకుంటున్నాను...'

గీత అతన్ని పరీక్షగా చూసింది. అతను గంభీరంగా ఉన్నప్పుడు తండ్రి పోలికలు ప్రస్ఫుటంగా కనిపిస్తాయి... కాని నవ్వితే ఆ పోలికలు అన్నీ మాయమయినట్లవుతుంది.

★ ★ ★

హైదరాబాద్ వచ్చాక యోగి ప్రవర్తన చాలా మామూలుగానే ఉంది... అయితే ఇదీ అని సూచించలేని చిరు మార్పు ఏదో ఉన్నట్లు గీతకి తోచింది... ఏమిటది? గీత ఎంత ప్రయత్నించినా లాభం లేకపోయింది.

'గీతా! నేను కొన్ని రోజులు బ్రేక్ తీసుకుంటాను... ఎందుకనో ఏమీ చేయబుద్ధి అవటం లేదు...' అన్నాడు.





'అలాగే...' అంది గీత.

రెండో రోజున అన్నాడు 'నువ్వా బ్రేక్ తీసుకో గీతా...!' అని.

'అంటే...? ' అడిగింది గీత.

యోగి నవ్వాడు. 'నిన్ను లాబ్‌కి సెలవు పెట్టమని అనటంలేదు... నాకు ఎలాగూ పని లేదుకదా. నువ్వు కిచెన్‌లోకి రాకు... అదంతా నేను చూసుకుంటాను'

అతను చెప్పిన ప్రతిదానికి అంగీకరించటం మంచిది కదా అనుకుని సరే అంది గీత.

రెండు వారాలు అలాగే గడిచాయి... ఓరోజు గీత అంది 'యోగీ! నువ్వు నన్ను బాగా గారం చేస్తున్నావు... శనివారం, ఆదివారం కూడా నన్ను వంటింట్లోకి రానీయటం లేదు... ఇదేం బాగాలేదు...'

'నాకు ఇంకో పని ఏం ఉంది గీతా! అయామ్ ఎంజాయింగ్ దిస్... అయినా ఇంకో నెల తరువాత ఆ డ్యూటీ మన ఇద్దరిదీ... అంతవరకూ నీకు కిచెన్లో నో ఎంట్రీ... సరేనా? '

అతనేం చేస్తున్నాడో ఆమె అడగలేదు. అతనూ చెప్పలేదు. రకరకాల సినిమా కాసెట్లు చూస్తున్నాడని మాత్రం గమనించింది... ఏవేవో రాస్తున్నాడు అని చెత్తబుట్టలో కనబడుతున్న కాయితాల ముక్కలు చూస్తుంటే తెలిసిపోతున్నది... ఏమిటి అతని ఉద్దేశం?

ఏం చేస్తున్నాడో తెలియదు కాని గీత ఇంటికి వచ్చేసరికి మాత్రం అతను చక్కగా తయారయి ఆమె కోసం ఎదురుచూస్తూ ఉంటాడు. లాబ్ కబుర్లు అడుగుతాడు... ఏదన్నా నచ్చిన కవిత గురించో, రచన గురించో మాట్లాడాక టీవీలో వచ్చే ఏ రకమయిన సినిమా అయినా ఓ గంటసేపు చూడటం అలవాటుగా మారింది. ఆశ్చర్యమేమిటంటే అంతవరకూ అతను సినిమాలు చూడటానికి ఉత్సాహపడేవాడు కాదు. సినిమాలు చూస్తూ అతను ఆసక్తికరమయిన కామెంట్స్ చేసేవాడు... రకరకాల కథలు చెప్పేవాడు. డాన్ సినిమా చూస్తూ ఒకసారి అన్నాడు.

**'ఓ ప్రముఖ పత్రికలో సినిమా రివ్యూ రాస్తూ హీరో హీరోయిన్లు విలన్ బారి నుండి తప్పించుకుంటూ తిరగటం బాగా థ్రిల్లింగ్‌గా తీశారు కాని మధ్యలో ఓ పాటను అనవసరంగా ఇరికించి సాగదీశారు అని రాశారు...**

'హేమాహేమీలయిన విమర్శకులు కూడా ఎలా బోల్తా కొడతారో ఈ సినిమాలో పాట వల్ల తెలుస్తుంది. ముప్ఫయేళ్ల క్రితం ఈ సినిమా రిలీజ్ అయినప్పుడు బాంబేలో ఓ ప్రముఖ పత్రికలో సినిమా రివ్యూ రాస్తూ హీరో హీరోయిన్లు విలన్ బారినుండి తప్పించుకుంటూ తిరగటం బాగా థ్రిల్లింగ్‌గా తీశారుకాని మధ్యలో ఓ పాటను అనవసరంగా ఇరికించి సాగదీశారు అని రాశారు... ఆ పాట ఏమిటో తెలుసా? ... ఇప్పటికీ ఎవరూ మరచిపోని పాన్‌బనారస్ వాలా పాట...'

అంతగా ప్రజాదరణ పొందిన ఆ సినిమాను తిరిగి షారుఖ్‌తో తీయటాన్ని కూడా అతను సమర్థించాడు.

ఇంకోసారి బొబ్బిలి యుద్ధం సినిమా చూస్తున్నారు... మురిపించే అందాలే అన్న పాట మొదలు కాబోతుంటే యోగి, 'గీతా! ఈ పాట మొదట్లో సొగసు కీల్జడదాన, సోగకన్నులదానా అని సాగే సాకీ వస్తుంది. శ్రీనాథుడి పద్యం ఆధారంగా శ్రీశ్రీ దాన్ని రాశాడు' అని వివరించాడు. ఆ సీస పద్యాన్ని అతను తడుముకోకుండా వినిపించి అర్థం చెప్పాడు కూడా.

సినిమాల గురించి అతనికి అన్ని విషయాలు తెలియటం గీత ఊహకి అందలేదు. అతనే చెప్పినట్లు ఒకప్పుడు సినిమా పిచ్చి బాగా ఉండేది కాబోలు అనుకుంది. అన్ని సినిమాల్నీ అంత విశ్లేషణాత్మకంగా ఎందుకు చూస్తున్నాడు? తన చిన్నప్పటి కల అయిన సినిమాలలో పనిచేయటాన్ని ఇప్పుడు సీరియస్‌గా తీసుకుంటున్నాడా? నాలాంటి వాడు సినిమా ఫీల్డ్‌కి పనికిరాడని అతనే ఒకప్పుడు స్టేట్‌మెంట్ ఇచ్చాడు మరి! తన ఆలోచన ఏమిటి?

ఓ రోజున గీత అంది 'మామయ్య నిన్ను ఓ పాతిక వేలు తీసుకోమని అన్నారు... నీ కోసమని ఓ బైక్ కొనుక్కో కూడదా యోగి? '

అతని మొహంలో చిరునవ్వు మాయమయింది... కొన్ని క్షణాలు మాత్రమే! తరువాత నవ్వుతూ 'నేనూ ఎలాగో ఇంకొన్ని రోజులు బయటికి వెళ్లను... ఆ తరువాత నిజమే నాకు బైక్ అవసరం అవుతుంది... కొంటాను...' అన్నాడు.

ఇక గీత కుతూహలాన్ని ఆపుకోలేకపోయింది. 'యోగీ! ఏం చేయాలని అనుకుంటున్నావు? ' సూటిగా అడిగింది.

సమాధానం చెప్పటానికి అతను సంశయించినట్లు కనబడ్డాడు. చివరికి గొంతు విప్పాడు. 'నాన్న మరణం నన్ను నిజంగా అయోమయ స్థితిలో పడేసింది గీతా! ఆయన నా గురించి రకరకాలుగా చేసిన వ్యాఖ్యలు ప్రతి నిముషమూ గుర్తుకు వచ్చి సతాయిస్తున్నాయి. ఎలాగో కొత్త ఉద్యోగం వెతుక్కోవాలి కదా, ఏం చేయాలి అని అనుకుంటుంటే ఆయన నీతో అన్న మాటలు స్ఫురణకి వచ్చాయి. 'వీడు ఏ నిముషానికి ఏం చేస్తాడో చెప్పలేం. అయితే ఒక్కటి... పనికి వచ్చే పని మాత్రం చెయ్యడు... అది గ్యారంటీ...' అన్నాడు ఆయన. పనికి రావటం అంటే ఏమిటి అర్థం? ... బాగా డబ్బులు సంపాదించటమేగా? ... ఆ పని నేను చేయలేనా? నాన్న తప్పు అని నిరూపించలేనా? అన్న సవాలును స్వీకరించాను. నేను కూడా డబ్బులు సంపాదించగలనని నిరూపిస్తాను.'

'ఎవరికి నిరూపిస్తావు? ' గీత మెత్తగా అడిగింది.

అతను దెబ్బ తిన్నాడు. 'నిరూపించటం అంటే... నిరూపించటం అంటే...' అంటూ మాటలకి తడుముకున్నాడు.

'కెన్ యూ బి కంఫర్టబుల్ డూయింగ్ దట్? ' గీత అడిగింది. 'మామయ్యా లేరు... నీకా ఆత్మలపైనా, మరణానంతర జీవితం పైనా నమ్మకం లేదు... మనసుని చంపుకుంటూ ఎందుకు వచ్చిన ఈ వృధా శ్రమా? ... చక్కగా నీ మనసుకు నచ్చిన పని ఏదయినా చేయరాదా? ! డబ్బులు సంపాదించి మేడలు, మిద్దెలు కట్టాలని ఉందా నీకు చెప్పు...'

యోగి మొహం గంభీరంగా మారింది. 'లేదు గీతా! నేను చేసేది తప్పు కాదు... ప్రస్తుతం నేనున్న స్థితిలో అదే నాకు ఊరట ఇస్తుంది' దృఢంగా అన్నాడతను.

గీత ఇక వాదించలేదు... అతన్ని వారించి ప్రయోజనం లేదని ఆమెకి తెలుసు. వాదించి ఉపయోగం ఉండదని ఆమెకి తెలుసు.

తండ్రి ఇచ్చిన పాతిక వేలతో యోగి బైక్ కొన్నాడు. పొద్దున వెడితే రాత్రి ఎప్పుడో వచ్చేవాడు. ఓ సారి రాజాని తీసుకువచ్చాడు.

'తార ఎలా ఉంది? ' గీత అడిగింది.

రాజా తల దించుకున్నాడు. 'అక్కా! తనని కలిసి కొన్ని నెలలు అవుతున్నది...'

'ఏమయింది రాజా? ' గీత లాలనగా





అడిగింది.

'ఏం చేయాలి అక్కా? ఆ మధ్య కలుసుకున్నప్పుడల్లా షంటేసేది... ఈ సినిమాల పిచ్చి ఎపుడు పోతుంది అని నిలదీసేది. తనకి పేరెంట్స్ నుంచి ప్రెషర్ పెరిగిందిట... నువ్వు ఇలాగే తాత్సారం చేస్తే నాకు వేరెవరితోనో పెళ్ళి అయిపోతుంది కూడా అని అనేది. చివరికి నీకు నాకన్నా ఆ సినిమాలే ఎక్కువ కదా, నన్ను మరిచిపో అంటూ వెళ్ళిపోయింది.'

గీత యోగి వంక చూసింది. రాజా మాటలు చెవికి అసలు ఎక్కనట్లు అతను టీవీ చూస్తున్నాడు.

'మరి నువ్వేం అనుకుంటున్నావు?' గీత అడిగింది.

'నా గురించి, నా ఆశయం గురించి తారకి ఎప్పటినుంచో తెలుసు. ఇప్పుడు నేనో.. సినిమాలో.. ఏదో ఒకటే తేల్చుకో అని నిలదీయటం అన్యాయం కదా? ఇక్కడ అవకాశాలు రావటానికి కాస్త సమయం పడుతుంది. అది అర్థం చేసుకోకపోతే ఎలా?' తార పైనే తప్పు నెట్టి వేస్తూ అన్నాడు రాజా.

'పాపం వాళ్ళ పేరెంట్స్ ఈ లోగా పెళ్ళి చేస్తే?' అతన్ని పరీక్షగా చూస్తూ అంది గీత.

రాజా తడుముకోలేదు. 'తార గురించి నాకు నమ్మకం ఉంది... నా కోసం ఆగుతుంది...'

'అదీ సంగతి! ఆ అమ్మాయి పిచ్చిదాని లాగా ఈయనగారి కోసం నిరీక్షిస్తూ ఉండాల్సిందే కాని ఈయన సినిమా పిచ్చి మాత్రం వదిలించుకోడు...! బహుశా యోగికి కూడా అదే రకమయిన వెర్రి ఉందేమో!' అనుకుంది. ఈ సంభాషణ జరుగుతున్నప్పుడు యోగి చాలా ఇబ్బంది పడ్డాడు. అది గీత ఇట్టే గమనించింది.

'రాజా! ఇప్పుడు మీ ప్రోగ్రామ్ ఏమిటి?'

'ఏం లేదు అక్కా...! స్టోరీ డిస్కషన్‌లో ఉన్నాం...' రాజా అన్నాడు.

రాజా సక్సీడ్ అయితే యోగి అతని శిష్యరికం చేస్తాడు అని తను అనటం గుర్తుకి వచ్చింది గీతకి. ఎవరు ఎవరికి శిష్యరికం చేసినా తనకి అభ్యంతరం లేదు. కాని దాని వల్ల చివరికి అటు తారకి, ఇటు యోగికి సంతోషం లభిస్తే అంతకన్నా కావలసింది ఏముంది అనుకుంది గీత.

రాజాతో పాటు ఇంకొందరు అప్పుడప్పుడు వస్తుండేవాళ్ళు. యోగి ఉత్సాహంగా కనబడటం చూసి గీత స్థిమితపడింది. ఎంతయినా అతని చిన్ననాటి కోరిక సినిమాలలో పని చేయటం... సహజంగానే అతనికి సంబరంగా ఉంటుంది అనుకుంది గీత. అంతలోనే ఓ అనుమానం వచ్చింది. ఇప్పటి నా టెంపర్‌మెంట్‌కి సరిపోదు అని అన్న యోగి అడ్జస్ట్ అవగలడా... నచ్చని పని చేయటం అతనికి అస్సలు అలవాటు లేదు. పైగా శాశ్వతంగా దూరమయిన తండ్రిపైన కుపితుడయి చేసిన సవాలు అసంగతమయినదని అతను ఎప్పుడో ఒక్కప్పుడు గ్రహించకపోడు. అంతవరకు అతనికి ఈ తిప్పలు తప్పవనుకుంది గీత.

గీత ఉదయం లాబ్‌కి వెళ్లేంతవరకూ యోగి ఇంట్లోనే ఉంటున్నాడు. ఎప్పుడు వెడతాడో కాని రాత్రి తొమ్మిదికి ముందు ఇంటికి వచ్చేవాడు కాదు. 'ఏయ్! నువ్వు చాలా టూ మచ్ చేస్తున్నావు...' అని గీత విసుక్కునే స్థాయికి చేరేలోగానే అతను బుద్ధిమంతుడిలాగా సాయంకాలం అయిదింటికల్లా ఇంటికి వచ్చేసి లాబ్ నుంచి అలసి వచ్చిన గీతని నవ్వుతూ పలకరించేవాడు. 'ఈరోజు ఇలాచీ చాయ్ ఇస్తాను, త్వరగా స్నానం చేసి రా!' అని తువ్వాలు అందించేవాడు. అలాంటి సాయంకాలాలు

హాయిగా గడిచేవి. ఆ కబుర్లలోనే యోగి ఏం చేస్తున్నాడో గీతకి సూచనప్రాయంగా తెలుస్తుండేది.

'కాలేజిలో ఎవరికీ లైన్ వేయలేదు కాని ఇప్పుడు లైన్లు వేయటానికి ప్రయత్నిస్తున్నాను.' అని ఓసారి నవ్వుతూ చెప్పాడు యోగి. 'కంగారు పడకు... లైన్ అంటే సినీ పరిభాషలో కథాగమనం ఎలా ఉంటుందో ఓ క్రమంలో చెప్పటం అన్న మాట. కథారచనలో కంటే లైన్ చెప్పటంలో ఎక్కువ సృజనాత్మకత కావాలని నాకు అనిపిస్తోంది'.

అలా అయితే ఇబ్బందేనే అని గీత అనుకుంది.

ఆమె ఊహ నిజమే అన్నట్లు చాలా ఉదాహరణలు చెప్పేవాడు యోగి.

రెండు మూడు నెలల వరకూ యోగి, రాజా బృందం సృష్టించిన లైన్‌లని పరిశ్రమలో ఎవరన్నా మెచ్చుకున్న దాఖలాలు కనబడలేదు. యోగి లోలోపల ఏమన్నా ఘర్షణ పడుతున్నా పైకి మాత్రం మామూలుగానే కనిపిస్తున్నాడు.

కొన్ని రోజుల తరువాత రంగం మారింది... గోదావరి తీరాన, కృష్ణా తీరాన కథా చర్చలు అని వారం పదిరోజులపాటు వెళ్లేవాడు.

కొన్ని రోజుల తరువాత మాటల మధ్య చెప్పాడు. 'ఒకాయన లైన్ బాగుందన్నాడు. కాని కొన్ని మార్పులు చేర్పులు చేయాలిట...'

'కంగ్రాట్స్...!' అంది గీత చేయి ముందుకు సాచి. 'ఈ న్యూస్ ఇలా చప్పచప్పగా చెబుతావా... పార్టీ లేదా...'

యోగి జవాబు ఇవ్వలేదు. ఆమె చేయి అందుకోలేదు. తల దించుకోలేదు కాని ఆమె చేతివంక చూస్తూ ఉండిపోయాడు.

'ఏయ్! ఏమయ్యింది... నీకు సంతోషంగా లేదా?'

'సంతోషాలు చాలా రకాలు గీతా...' క్లుప్తంగా క్రిప్టిక్‌గా అన్నాడతను.

'సంతోషం వల్ల మొహం ముడుచుకుపోతుందని నాకు ఇప్పుడే తెలిసింది...' గీత టక్కున అంది. ఆ వ్యాఖ్యకి అతను దెబ్బ తిన్నట్లు కనబడటంతో గీత పశ్చాత్తాపపడింది. 'సారీ! ఏమయింది యోగీ...!'



**'కాలేజిలో ఎవరికీ లైన్ వేయలేదు కాని ఇప్పుడు లైన్లు వేయటానికి ప్రయత్నిస్తున్నాను.' అని ఓసారి నవ్వుతూ చెప్పాడు యోగి. 'కంగారు పడకు... లైన్ అంటే సినీ పరిభాషలో కథాగమనం ఎలా ఉంటుందో ఓ క్రమంలో చెప్పటం అన్నమాట.**



అతను చిన్నగా నవ్వాడు. 'సారీ నేను చెప్పాలి. అయినా ఈ రోజు ముఖేశ్ పుట్టినరోజు అనుకుంటా... ఏ ఛానెల్‌లో నయినా ఆ పాటలు వేస్తున్నారేమో విందాం...' అంటూ సంభాషణ దారి మళ్లించాడు.

ఈ సంఘటన అయిన పదిహేను రోజుల తరువాత అతను చాలా ఆనందంగా కనబడ్డాడు. 'గీతా! ఈ రోజు హోటల్‌లో డిన్నర్' అని ప్రకటించాడు.

'ఎనీ గుడ్‌న్యూస్?'

ఇప్పుడు కాదు... భోజనం చేస్తూ...' గమ్మత్తుగా కనురెప్ప మూశాడతను.

హోటల్‌లో చెప్పాడు 'నువ్వు అన్నది సెంట్ పెర్సంట్ కరక్ట్ గీతా! ఐ వజ్ నెవర్ కంఫర్టబుల్ డూయింగ్ దట్... కాని నేనూ డబ్బు సంపాదించగలను అని నిరూపించాలన్న పట్టుదల ఉండేది... డబ్బు సంపాదించటానికి సినిమాలకన్నా ఇంకో మంచి మార్గం ఏముంది...? సరే మొండిగా దూకాను... రాజా చాలా సాయం



చేశాడు... చాలా రోజులు ఓపికగా ఉన్నాను... నేను చేస్తున్నది తప్పే అని ఒప్పుకోవాలంటే చిన్నతనంగా అనిపించింది. పైగా రాజాకి ప్రామిస్ చేశాను. అందుకనే బింకంగా ఉన్నట్లు నటించాను. కాని నేను ఓడిపోయాను అని డిక్లేర్ చేస్తుంటే ఇప్పుడు ఆనందంగా ఉంది. నో! నేను దేనికయినా పనికివస్తానో లేదో నేను చెప్పలేను కానీ ఇలాంటి ఉద్యోగాలకి మాత్రం సందేహం లేకుండా పనికిరాను. కోట్లాది ప్రేక్షకులకి దగ్గరవటం అన్నది ఈ ఫీల్డ్ ద్వారానే సాధ్యం. ఇప్పుడు నీ ముందు ఒప్పుకుంటున్నాను. నాన్న మీద నాకు చెప్పలేనంత కసిగా ఉండేది. బహుశా ఆ కసివల్లనే నా విచక్షణాజ్ఞానం మాయమయింది. నేను చాలా తిక్కపనులు చేశాను.

'నిజం చెప్పనా... నువ్వు తిక్కన్నవి. అందుకనే తిక్కన్నర పనిచేశావు...'

గీతతోపాటు యోగి నవ్వాడు. ఆ జోక్ అతనికి నచ్చింది కాబట్టి నవ్వాడు... సరే మరి ఆ కళ్లల్లో మెరుపులు ఎందుకు అనుకుంది గీత.

ఆమె సందేహానికి సమాధానమిస్తున్నట్లు యోగి కొనసాగించాడు. మొన్నటితో రాజాతో నా కమిట్‌మెంట్ అయిపోయింది... అంటే నేను ఫ్రీ బర్డ్‌ని. ఇప్పుడు నాకు కావలసింది ఎన్నుకున్నాను. సివిల్స్‌లోనూ, మిగిలిన పోటీ పరీక్షలలోనూ నగర విద్యార్థుల్లో గ్రామీణ విద్యార్థులు... చివరికి జిల్లా ముఖ్యపట్టణాల్లో ఉన్న విద్యార్థులు రాణించలేకపోతున్నారు. సరైన శిక్షణ లేకపోవటమే దానికి కారణం. కొంతమంది యన్.ఆర్.ఐ.లు అందుకనే ఓ స్వచ్ఛంద సంస్థని స్థాపించారు. మొదటి మెట్టుగా పనికి నూరు నూటయాభయి కిలోమీటర్ల దూరంలో ఉన్న మూడు పట్టణాలని ఎన్నుకున్నారు. అక్కడ వారానికి మూడు రోజులు క్లాసులు తీసుకోవాలి. దాదాపుగా ఇది వలంటరీ వర్క్ లాంటిది. ఖర్చులు వాళ్లు ఇస్తారు కాని జీతం ఉండదు. డబ్బు రాదు. మనసుకు తృప్తి వస్తుందని ఆశ'.

'చాలా బాగుంది యోగి...' అంది గీత మనస్ఫూర్తిగా. ఏదన్నా ఇస్తుంటేనే అతనికి తృప్తి!

'అంతేకాదు మేడమ్... అప్పుడప్పుడు నీకు ఇలా డిన్నర్ ఇవ్వాలంటే నా పర్సులో ఎంతో కొంత ఉండాలిగా? ఆ ఏర్పాటు కూడా చూసుకున్నాను. వారంలో మిగిలిన రోజులు ఇక్కడ హైదరాబాద్‌లో టోఫెల్, జిఆర్ఇ రాసేవారికి ఇంగ్లీష్ కోచింగ్ ఇచ్చే ఉద్యోగం నా స్నేహితుడు ఆఫర్ చేశాడు... తృప్తి సంగతి తెలియదు కాని నేను చెప్పే విధానం బాగుందని అంటున్నారు కాబట్టి డబ్బులు వచ్చే ఉద్యోగం ఇది...'

గీత కళ్లు మెరిశాయి... 'తరుణ తమాల పల్లవ నీల లావణ్య
శిశిర సుధా నిబిడాశ్లేషమున
చంచల చంచలా వ్రతతీ యువతినై
మెరసిపోదునో విరిసిపోదునో...'

అంటూ కృష్ణశాస్త్రిని గుర్తుచేసుకుని సంబరపడింది. మధుర కవితలని అనుభవిస్తూ కొనసాగిన విందు అద్భుతంగా మారింది.




ఇద్దరూ ఇంటికి వెళ్లేసరికి అక్కడ రాజా వెయిట్ చేస్తున్నాడు.

'సారీ యోగి! నిన్నటితో చేతులు కడుక్కున్నానని డిక్లేర్ చేశావు కాని ఎట్ లీస్ట్ మూడు గంటలు స్పేర్ చేయాలి...!'

మూడు గంటలు అన్నాడు కాని దాదాపు రాత్రంతా వాళ్లు ఏదో చర్చిస్తూనే ఉన్నారు. 'నో! అలా అయితే హీరో ఎంట్రన్స్ చాలా పూర్‌గా ఉంటుంది...'

'ఇదిమటుకు గ్యారంటీ! ఈ సీన్ తరువాత సాంగ్ ఉండాల్సిందే' లాంటి కామెంట్స్ లీలగా వినబడుతుంటే గీత నిద్రలోకి జారుకుంది.

పొద్దున గీత తలుపుకి వేలాడదీసిన సంచిలో పాలపాకెట్లు తీస్తుంటే బైక్ కనబడలేదు. యోగిని అడిగింది. 'రాజాకి కావాలిట... తీసుకువెళ్లాడు...' అన్నాడు.

ఆ తరువాత అతనిలో నూతనోత్సాహం వచ్చింది. చేస్తున్న రెండు ఉద్యోగాలని బాగా అభిమానించసాగాడు. అతన్ని అంత సంతోషంగా ఎప్పుడూ చూడలేదు గీత. ఇంతకన్నా కావలసింది ఏముంది అనుకుంది గీత.

బైక్ తీసుకువెళ్లిన రాజా దాన్ని తిరిగి ఇవ్వకపోవటం మాత్రం గీతకి నచ్చలేదు. యోగిని రెండు మూడుసార్లు అడిగింది.

'పాపం అతను అటూ ఇటూ తిరగాలి కదా... బాగా అవసరమట...' అన్నాడు ఒకసారి.

'అతనికి ఏదో మంచి బ్రేక్ వచ్చేటట్లు ఉందిట. మీ బైక్ నాకు బాగా అచ్చివచ్చింది. ఇంకొన్ని రోజులు ఉంచుకుంటాను అన్నాడు... సరే అన్నాను...' అని చెప్పాడు ఇంకోసారి.

అచ్చిరావటమా...? యోగీ! నీ సైంటిఫిక్ టెంపర్ ఏమయింది? అనుకుంది గీత... అయితే ఒకటి అది సినిమా రంగం... అక్కడ సెంటిమెంట్లు, అన్ని రకాల నమ్మకాలు ఉంటాయి అని యోగి అర్థం చేసుకున్నాడు అన్నమాట... అతను ఇలా సైంటిఫిక్ టెంపర్ మరిచిపోవటమో లేకపోతే సోషల్ టెంపర్‌ని అలవర్చుకోవటమో చేస్తుంటే తను ఆనందిస్తుందా? బాధపడుతుందా? గీత తేల్చుకోలేకపోయింది.

అయినా ఆ విషయంలో యోగితో పోట్లాటకి ఇంకోసారి తయారయ్యింది.

ఓ రోజున అతను ఖండితంగా చెప్పాడు, 'ప్లీజ్ గీతా! నేను రాజాని అడగను... నువ్వూ అడగవు కదా... ఇక మన మధ్య ఆ టాపిక్ రాకూడదు...'

గీత మూతి ముడిచింది. అంతలో ఆ రోజు అతను ఊరు వెడతాడని గుర్తు వచ్చింది. మూడ్ మార్చుకుని అతనితో నవ్వుతూ గడిపింది. అతను ఆటో ఎక్కి చేయి ఊపుతుంటే 'యోగీ! నేను బై... బై... అంటున్నాను... బైక్... బైక్... అనటం లేదు...' అంది.

ఆటో అలా కదిలింది ఇంకో ఆటోలో తార హుషారుగా వచ్చింది. 'అక్కా' గుడ్ న్యూస్ రాజా మంచి బేనర్‌లో సినిమా డైరెక్ట్ చేస్తున్నాడు... అతను కథ చెప్పిన విధానం చాలా బాగుందని అతని చురుకుదనాన్ని మెచ్చుకున్న నిర్మాత అతనికి ఆ అవకాశం ఇచ్చాడు...' అని సంబరంగా చెప్పింది.

'గుడ్! కంగ్రాట్స్...' అంది గీత, తార బుగ్గలకి సుతారంగా పెదవులని ఆనిస్తూ.

'అక్కా! నా మనసులో ఏముందో తెలుసా...' అంది తార.

'ఈ సినిమా ఫ్లాప్ అయితే బాగుండు...' అని పైకి తలతిప్పి కళ్లు మూసుకుని ప్రార్థించింది.

'అదేమిటి?' అంది గీత ఆశ్చర్యంగా.

'హిట్ కొట్టేంత టాలెంట్ రాజాలో లేదు కదా... ఫ్లాప్ అయితే ఆ మొట్టికాయ దెబ్బకి ఇక సినిమాల సంగతి ఎత్తకుండా ఏదో ఒక ఉద్యోగం చూసుకుం





టాడు... యావరేజ్‌గా పోయిందనుకో అటూ ఇటూ కాకుండా అవుతుంది అతని పరిస్థితి... దాంతో నేనెవరినో పెళ్లిచేసుకోవాల్సి వస్తుంది... కాబట్టి ఫ్లాప్ అవ్వాలని దేవుడ్ని ప్రార్థిస్తున్నాను...' అంది తార.

ఆ రాత్రి రాజా వచ్చాడు. స్వీట్లు, యాపిల్స్ పట్టుకు వచ్చాడు. 'అక్కా! రేపే ముహూర్తం! మీరు, యోగి తప్పకుండా రావాలి...' అన్నాడు.

'యోగి మహబూబ్‌నగర్‌లో ఉన్నాడు... రాలేడు... నా సంగతి చెప్పలేను' అంది గీత.

'నో! రాకపోతే నేను ఊరుకోను... ప్లీజ్... ప్లీజ్... ప్లీజ్!...' అన్నాడు రాజా ప్రాధేయపడుతూ. గీత ఒప్పుకుంది.

రాజా గుడ్‌నైట్ చెప్పి బైక్ మీద వెళ్లిపోయాడు. యోగి ఆ బైక్ గురించి మరిచిపోవటానికి కారణం ఏమిటి? తండ్రి ఇచ్చిన డబ్బుతో కొన్నది కాబట్టి అతనికి ఆ బైక్ అంటే ఇష్టం లేదా?

మర్నాడు ఆమె తయారవుతుంటే తార వచ్చింది. 'అక్కా, నిన్ను తీసుకువచ్చే బాధ్యత నాపైన పెట్టాడు రాజా...' అంది.

మొదటిసారి షూటింగ్ చూస్తుంటే గీతకి గమ్మత్తుగా అనిపించింది. 'ముహూర్తం షాట్ కదా అక్కా! అందుకనే తీసింది తక్కువ, ఆర్భాటం ఎక్కువలాగా కనబడుతుంది. రొటీన్ షూటింగ్ ఇలా ఉండదు...' అన్నాడు రాజా. 'మా అమ్మా నాన్నలకి ఇప్పటికి కోపం పోయింది...' అని నవ్వుతూ వాళ్లని పరిచయం చేశాడు.



**ఓ రహస్యాన్ని యోగి అన్నిరోజులు తననుంచి దాయగలడని గీత అనుకోలేదు. ఎనిమిది నెలలు కాదు... కాదు... దాదాపుగా ఏడాది పాటు ఇంత పెద్ద విషయాన్ని యోగి గోప్యంగా ఉంచాడా?**



ముహూర్తం అయ్యాక గీతని లాబ్ వరకు ఆటోలో తీసుకువెళ్లింది తార. 'అదేదో కార్టూన్‌లో లాగా క్లాప్ కొడుతుంటే నాకు ఫ్లాప్ లాగా వినబడింది అక్కా!' అంది తార.

'అలా అంటే రాజా పాపం చాలా బాధపడతాడు...' అంది గీత నవ్వుతూ.

'ఏమో బాబూ... నాకయితే ఆ వెలుగు జిలుగుల వాతావరణంలో ఊపిరి ఆడ లేదు... ఫ్లాప్ అయితే నాకూ బాధగానే ఉంటుంది అక్కా!... కాని ఆ ఫీల్డ్ అంటే భయంగా కూడా ఉంది... సినిమా ఎప్పుడు రిలీజ్ అవుతుందో...' ఆగలేనట్లు అంది తార.

శరవేగంతో తయారవుతున్న చిత్రం అని సినిమా కబుర్లలో రాస్తారు కాని తార అసహనాన్ని పెంచుతూ రాజా తీస్తున్న సినిమా మెల్లగా తయారయింది.

అది రిలీజ్ అయ్యే రోజున తార పొద్దున్నే గీత ఇంటికి వచ్చింది. 'గుడికి వెళ్లి స్ట్రయిట్‌గా ఇటు వస్తున్నాను అక్కా!'

'ఏమని మొక్కుకున్నావు?' గీత నవ్వుతూ అడిగింది.

'మొక్కు కాని మొక్కు మొక్కాను అక్కా!'

'నాకు అర్థం కాలేదు' గీత అయోమయంగా అంది.

'మొన్న ఆ సినిమా ప్రివ్యూ చూశాను...'

'ఎలా ఉంది?' ఆత్రుతగా అడిగింది గీత.

'నాకయితే ఏం నచ్చలేదు... ఆ సంగతే రాజాతో అంటే నువ్వు బాగున్నాయి అన్న సినిమాలు రెండు వారాలలోనే ఢాం అని పేలాయి కదా అన్నాడు... ఇది ఫ్లాప్

అయితే నా పట్టుదల పెరుగుతుంది అన్నాడు... నా గుండె ఢాం అంది... ఇన్నాళ్లూ సినిమా ఫ్లాప్ అవ్వాలని ప్రార్థించాను కదా! ఇప్పుడు ఏ మొహం పెట్టుకుని హిట్ అవ్వాలని దేవుడ్ని అడగను? అందుకనే దేవుడా నాకు అయోమయంగా ఉంది. నీ ఇష్టం వచ్చినట్లు చెయ్యి నాయనా అని ప్రార్థించి కొబ్బరికాయ కొట్టాను...'

గీత పగలబడి నవ్వింది. 'ఆయన అభీష్ట ప్రకారమే చేయమని పర్మిషన్ ఇచ్చావన్నమాట... బాగుంది...'

'కాని రాజా చేసిందే బాగాలేదు అక్కా!' తార టక్కున టాపిక్ మార్చింది. 'హీరోయిన్‌ని ఎంత అందంగా చూపించాడో నేను చెప్పలేను...' తార గొంతు స్థాయి తగ్గింది. 'మొగాళ్లు అంటుంటారే అలా సెక్సీగా కూడా చూపించాడు... చూస్తుంటే నాకే సిగ్గు వేసింది... ఏమిటి బాబూ ఇది అని అడిగితే ఇది సినిమా తల్లీ! లక్షలతో వ్యాపారం అంటున్నాడు.'

తార స్థిమితంగా ఉండలేకపోయింది. కాఫీ కూడా అటూ ఇటూ నడుస్తూనే తాగింది. 'అక్కా! సినిమా సంగతి తేలేంత వరకూ ఈ రెండు మూడ్రోజులు నేను నీ బ్రెయిన్ తినటానికి అనుమతి ఇవ్వాలి... ప్లీజ్...! మా ఇంట్లో ఉంటే నా మతిపోతుంది.. బావగారు ఎలాగూ ఎల్లుండికి కాని రారు కదా... నేను ఇక్కడే ఉంటాను...' అంది.

రెండో రోజుకి తార టెన్షన్ మాయమయింది. చిన్న తారలతో తీసిన ఆ సినిమా అనూహ్యంగా హిట్ అయింది.

దూరంగా ఉన్నా యోగి కూడా ఆ సినిమా గురించి తెలుసుకున్నాడు కాబోలు. ఫోన్ చేశాడు. 'గీతా! రాజా నా కోసం ఫోన్ చేసినప్పుడు క్లాసులో ఉన్నాను. అతనికి కంగ్రాట్స్ చెప్పు... సినిమాకి ఇక్కడ కూడా మంచి హిట్ టాక్ వచ్చింది...' అన్నాడు.

తార అయితే ఆకాశంలో విహరిస్తున్నది. ఎప్పుడన్నా భూమిపైకి వచ్చినప్పుడు రాజాని మెత్తగా తిడుతున్నది. 'చూడు అక్కా! నాతో సెలబ్రేట్ చేసుకోవటానికి టైమ్ లేదంటున్నాడు. నిన్నయితే హోటల్‌లో అరగంటసేపు ముళ్లమీద కూర్చున్నట్లు భోజనం చేశాడు. బిల్లు వస్తుంటే వెయ్యిరూపాయల నోట్ నా చేతిలో పెట్టి బిల్లు కట్టి యాభయి టిప్‌గా ఇచ్చి మిగిలింది నన్ను తీసుకోమని చెప్పి వెళ్లిపోయాడు. టైమ్ లేదుట.. టైమ్... ఈసారి కనబడినప్పుడు మిగిలిన ఆ రెండు వందల ఇరవయి ఆరు రూపాయలు రాజా మొహాన కొట్టాలని ఉంది... అందులో ఓ రూపాయి బిళ్ల, మూడు అయిదు రూపాయల బిళ్లలూ ఉన్నాయి. దెబ్బ వాటంగా తగిలితే తిక్క తగ్గుతుంది!'

సినిమా సక్సెస్ మీట్‌కి రమ్మనమని పిలవటానికి రాజా వచ్చినప్పుడు యోగి ఇంట్లో ఉన్నాడు. రాజా పొంగిపోయాడు. 'యోగీ! ముహూర్తం రోజున లేరు. రిలీజ్ డేట్ నాడు లేరు. ఇప్పుడు తప్పకుండా రావాలి... బైది వే ఆ బైక్ మాత్రం వాపస్ ఇవ్వను... ఇట్స్ మై లక్కీ బైక్!' అన్నాడు.

'నో ప్రాబ్లెమ్...' అన్నాడు నవ్వుతూ.

ఎంత వారించినా వినకుండా గీతకి, యోగికి పాదప్రణామం చేసి మరీ వెళ్లాడు రాజా...

ఓ రహస్యాన్ని యోగి అన్నిరోజులు తననుంచి దాయగలడని గీత అనుకోలేదు. ఎనిమిది నెలలు కాదు... కాదు... దాదాపుగా ఏడాదిపాటు ఇంత పెద్ద విషయాన్ని యోగి గోప్యంగా ఉంచాడా?... యోగి వంక ఎర్రగా చూసింది గీత.







అదేమీ పట్టనట్లు సినిమా గురించి తరువాతి వక్త చెబుతున్న మాటలు శ్రద్ధగా వినసాగాడు యోగి. గీతకి చాలా అసహనంగా ఉంది. యోగిని నిలదీసి చివాట్లు పెట్టాలి అన్నంత కోపం ఉందికాని ఇది విజయోత్సవ సభ. చప్పట్లు తప్ప చివాట్లకి ఇక్కడ చోటు ఉండదు కదా!

సినిమా ఎందుకు బాగుందో వివరిస్తూ ఓ ప్రముఖ నిర్మాత కథని వివరంగా చెప్పటంతో వచ్చింది తంటా... చాలా రోజుల క్రితం ఆబిడ్స్ తాజ్‌లో యోగి మొదటిసారిగా తన సినిమా అభిరుచి గురించి ప్రస్తావించాడు. ఆస్తి కోల్పోయిన ప్రేయసికి హీరో తిరిగి ఆ ఆస్తిని సంపాదించి ఇవ్వటం అని అప్పుడు ఓ కథ కూడా చెప్పాడు. దానికే ఇంకా ముస్తాబు చేసి ఇప్పుడు ఈ సినిమా తీశారు. అయినా గీతకి ఆ సంగతి ఇసుమంత కూడా తెలియదు. ఎంత ఘోరం! గీత ఇక ఆగలేకపోయింది. యోగి వంక వాలింది. 'దిసీజ్ టూ మచ్! ఆస్తి పోయింది అన్న కహానీని మొదటగా చెప్పిన ఒరిజినల్ బ్రెయిన్ నాది. దాన్ని కథగా మార్చినప్పుడు నా అనుమతి ఎందుకు తీసుకోలేదు?' కోపం తీరక అతన్ని మెత్తగా గిల్లింది కూడా.

యోగి నవ్వాడు. అతను ఏదో చెప్పబోయాడు కాని ఈలోగా స్టేజ్‌పైన రాజా మైకు అందుకున్నాడు. పేరు పేరునా అందరికీ కృతజ్ఞతలు చెప్పాడు. చివరిలో అన్నాడు. నిజానికి ఈ కథ ఇంత బాగా రావటానికి ఓ అజ్ఞాత వ్యక్తి కారణం... పేరు చెప్పుకోవటం ఇష్టంలేని ఆ వ్యక్తి నిజంగా ఓ యోగి... ఆయన ప్రోత్సాహ సహకారాలు లేకపోతే నేను బహుశా ఈ కథని ఇంత బాగా చెప్పలేకపోయేవాడినేమో! ఆయనకి నేను ఆజన్మాంతం రుణపడి ఉంటాను...' అన్నాడు.

ఫంక్షన్ అయ్యాక డిన్నర్ సమయంలో రాజా అన్నాడు. 'అక్కా! దివాళా తీశామని చెప్పి నువ్వు యోగిని ఎలా టీజ్ చేశావో ఆయన నాకు వివరంగా చెప్పారు. అసలు ఆ తరహాలో కథ అల్లాలనుకున్నాను అని కూడా ఆయన చెప్పారు. అప్పుడు ఆ లైన్‌నే డెవలప్ చేస్తే ఎలా ఉంటుంది అన్న అయిడియా ఇద్దరికీ ఒకేసారి వచ్చింది. నిజంగా యోగి చాలా కష్టపడ్డారు.'

తనకి నచ్చని వాతావరణంతో అన్ని నెలలు యోగి ఎలా సహజీవనం చేశాడో తారకి అర్థమయింది. ఆ కథాంశంతో అతనికి ఓ ఎటాచ్‌మెంట్ ఉంది... ఒక అనుబంధం ఉంది. తార తల్లిదండ్రులని రాజా, రాజా తల్లిదండ్రులను తారా పరిచయం చేశారు.

'తారా! ఇది విన్నావా? అతనికి చాలా సినిమా ఆఫర్లు వస్తున్నాయట... అరకోటి వరకూ ఇస్తామంటున్నారుట. ఇందాక మీ మామగారు చెప్పారు' అంది తార తల్లి.

'నా మామగారేమిటి? ...' మొహం చిట్లించింది తార. 'లేదమ్మా! మీరు చెప్పింది అక్షరాలా నిజం. ఫీల్డ్‌లో మనుషులు చెడిపోతారు... రాజా చూడు ఎంతమంది అమ్మాయిలతో మాట్లాడుతున్నాడో... ఉద్యోగం చేస్తేనే పెళ్ళి చేసుకుంటానని నేను ఇందాక రాజాతో కచ్చితంగా చెప్పాను. అతను సినిమాలే అంటున్నాడు. నాకు వేరే ఏదన్నా సంబంధం చూడండి.'

ఆవిడ నిర్ఘాంతపోయింది. 'నీకు మతిపోయిందా? ... ఇంత మంచి సంబంధం ఎక్కడనుంచి వస్తుంది? ... అతను కోట్లు సంపాదిస్తాడు తెలుసా? ...'

'నాకు బైక్‌మీద తిప్పే మొగుడు చాలు... కోట్లు వద్దు... ఇప్పుడు ఇక్కడ సీన్ చేయకండి. నా నిర్ణయం మాత్రం మారదు...' తార కుండ బద్దలుకొట్టినట్లు చెప్పింది.

మొగుడికి చెప్పటానికి ఆవిడ నసు

గుతూ వెళ్లింది.

'ఏమిటిది తారా?' గీత అడిగింది. 'ఎప్పుడు వచ్చింది ఈ కొత్త ఆలోచన'

తార పకపకా నవ్వసాగింది. 'అక్కా! ఎలా ఉంది డోస్? రాజాని మరిచిపొమ్మని నన్ను షంటిన వీళ్లే ఇప్పుడు అతన్ని చేసుకోవటం నా అదృష్టం అంటున్నారు. నన్ను మూడేళ్లు బాధ పెట్టారు. నెల రోజులు వీళ్లని సతాయించి కాని నిజం చెప్పను' అంది తార. 'ఇంత గొప్ప రహస్యం నీకు చెప్పాను కదా... నువ్వు నాకో సాయం చేయాలి... నువ్వు, బావ గారు ఇలా అటుపక్కకి గప్‌చుప్‌గా రండి. ఓకే...? థాంక్‌యూ...'

తార, రాజా కలిసి యోగి, గీతలకి ఓ కవరు అందించారు. 'ప్లీజ్ యాక్సెప్ట్...' అంటూ ఇంకోసారి కాళ్లకి దండం పెట్టారు.

ఇంటికి వెళ్లాక కవరు విప్పింది గీత... కథా సహకారానికి కృతజ్ఞతలు అన్న కాయితంలో రెండు లక్షల రూపాయల చెక్ ఉంది... యోగి ఏమంటాడా అన్నట్లు అతనికి చూపించింది గీత.

చెక్ చూసిన మరుక్షణం రెండు రెళ్లు నాలుగు అన్నంత సులభంగా యోగి అన్నాడు. 'లక్ష ఆశ్రమానికి పంపిద్దాం. ఇంకో లక్ష ఫిక్సెడ్ డిపాజిట్ చేసి ప్రతి ఏడూ మీలాబ్‌లో రీసెర్చ్‌లో ఫెలోకి నాన్న పేరుతో ఒక అవార్డ్ ఇద్దాం... ఏమంటావు?'

'యూ ఆర్ వండ్రఫుల్ యోగి' అంది గీత అతన్ని హత్తుకుంటూ. పిల్లల గురించి మాట్లాడటానికి ఇది మంచి తరుణమేమో అన్న ఆలోచన వచ్చింది ఆమెకి.

'నాకు ఓ ఆలోచన వస్తున్నది గీతా!... కొడుకుగా అయామే బిగ్ ఫెయిల్యూర్...'

'యోగీ!' విసుగ్గా అంది గీత. కుటుంబ నియంత్రణకి బైబై చెబుదామా అని అడగబోతుంటే ఇలా మూడ్ చెడగొట్టే టాపికా? ఇలాంటి మంచి సందర్భంలో ఏమిటా వైరాగ్యం?'

యోగి నవ్వాడు. ఆమె చెంపని సుతారంగా తట్టాడు. 'వైరాగ్యం కాదు... రొమాంటిక్ ఆలోచనే మేడమ్! కాని పూర్తిగా వినాలి. కొడుకుగా ఫ్లాప్ అయ్యాను కదా. ఎట్‌లీస్ట్ తండ్రిగా హిట్ అవ్వాలని ఉంది. కరుణిస్తావా?'

'దీసీజ్ టూ మచ్ యోగీ! నా మనసుని అలా చదివేస్తే ఎలా...' అనుకుంది గీత.

©

**చతుర సమీక్ష** | **ఆగస్టు నవల 'జీవనశోధన'**

సమీక్షకుని/సమీక్షకురాలి పేరు: ________

చిరునామా: ________

(ఆగస్టు 25వ తేదీలోపు సమీక్షలు మాకు అందాలి)



వ్యంగ్య శీర్షిక

# ఆర్ట్ ఆఫ్ లీవింగ్

వారణాసి రామకృష్ణ

ఆర్ట్ ఆఫ్ లివింగ్ అంటే జీవనకళ-ఇక ఆర్ట్ ఆఫ్ లీవింగ్ అనగా జీవన వల! రెంటికీ కాన్సెప్టులోనే బోల్డంత తేడా వుంది కనక కన్‌ఫ్యూజ్ కాకుండా 'సదువు'కోవాలి! చిన్న పిల్లాడు బొమ్మ కారు చూసి తెగ మోజుపడి మదర్ని విసిగించి ఫాదర్ని సతాయించి బొమ్మ కారు కొనిపిస్తాడు. ఆనక గ్రాండ్ ఫాదర్ వీపెక్కి! కాలొత్తొంది - పాయ్-పా పోయ్! పక్కకి జరగండి! అంటూ ఆడుతూ పక్కనే అన్నో చెల్లో బొమ్మ తుపాకీతో ఆట్టంచూసి ఏడుస్తూ నాకు తుపాకి కావాలీ.. కాలొద్దూ అంటూ కారుబొమ్మని లీవింగ్! అనగా వదిలేసి తుపాకి బొమ్మ లాక్కుంటాడు. అనగా ఎప్పుడు దేన్ని పట్టుకోవాలో, దేన్ని కళాత్మకంగా వదిలెయ్యాలో ఛైల్డ్‌హుడ్‌లోనే బోల్డు ట్రైనింగ్ దొరుకుతుంది. ఈ పిల్లాడే పెద్దయ్యాక కాలేజీలో చేరి బుక్స్ వది లేసి చేతిలో సిన్మా టిక్కెట్లు పట్టుకుంటాడు. బతుకులో అవసరమైన దాన్ని వాడుకుని మిగిలిన వాటిని చేతికి చమురంటకుండా వదిలించుకోవటం గొప్ప టెక్నిక్కు! ఈ టక్కుటమార ట్రిక్కుల్ని బుర్ర అడుగంటా ఎక్కించుకోవటమే- ఆర్ట్ ఆఫ్ లీవింగ్! ఈ టెక్నాలజీ చదివిన కొందరు డిగ్రీలు, మాస్టరేట్లు తెగ సంపాయిస్తూంటే ఇంకొందరు రెచ్చిపోయి పిహెచ్‌డీలు చేసేస్తున్నారు. పిహెచ్‌డీ అంటే ఏంటో అనుకునేరు- మరేంలేదు పీ అంటే ప్రజల్ని హెచ్ అంటే హుక్కేసి, డీ అంటే దండుకోవటం. అనగా-ప్రజల్ని హుక్కేసి దండుకోవటం!

లీవింగ్ టెక్నాలజీ ఒక్కోదశలో, ఒక్కో టైపులో బైటికొస్తుంది! ఎక్కువ వడ్డీ దొరుకుతుందని జనాలంతా సొమ్ముల్ని కోపరేటివ్ బ్యాంకుల్లో దాస్తారు. బ్యాంకు డైరెక్టర్లలో కొందరు ఆర్ట్ ఆఫ్ లీవింగ్‌లో పిహెచ్‌డీలు చేసినవాళ్ళన్న సంగతి గ్రహించరు. ఈ డైరెక్టర్లంతాపాపం ఎంతో చక్కగా కోపరేటివ్‌గా ఉంటూ జనాల సొమ్ముల్ని జ్యుడీసియస్‌గా జూస్ చేస్కుని తాగేసి మంచి మూర్తం చూస్కుని లీవింగ్.. అనగా వదిలేసిపోతారు. అన్నేళ్ళుగా టెక్నాలజీ అంతుబట్టని జనాలికి ఒక్కసారిగా బుర్రతిరిగి పోతుంది. కర్రలు చ్చుకుని బయల్దేరతారు. ఆవేశంగా బల్లలు, కుర్చీలు విరగ్గొడతారు. చిరంజీవి బాలకృష్ణల టైపులో కొందరు రెచ్చిపోతారు. మరికొందరు దక్కిందే బొక్కుదల పాయింటు పట్టుకుని కోపరేటివ్ ఆఫీసుల్లోని గుండు సూదులు, పేపర్ వెయిట్లు ఇతరత్రా 'సిన్నసిన్న' పీసుల్ని పట్టుకుపోతారు. ఇంకొందరు ఇందిరా పార్కులో మీటింగెట్టి

ఏందిరా అన్నాయమని వాపోతే మరి కొందరు ఎన్టీఆర్ గార్డెన్లో చొక్కాలిప్పేసి ఎమ్టీగా అర్ధనగ్న ప్రదర్శనలకు దిగుతారు. లీవింగ్ టెక్నాలజీలో నిపుణులయిన కన్నింగ్‌గాళ్ళని రన్నింగ్‌చేసి మీరు క్యాచింగ్ చెయ్యాలని తెగ బర్నింగ్ అవుతారు. కానీ పోలీసు మామలొచ్చి లాఠీల్లో కుళ్ళబొడిచి వార్నింగ్‌లిచ్చి మరి పిటీలీవింగ్ అనగా జాలిపడి వదిలేస్తారు. ఆర్ట్ ఆఫ్ లీవింగ్ బుక్కులతో ఇలాంటివి బోలెడు దొరుకుతాయి!

క్రికెట్ మైదానంలో దూసుకుపోయే బాల్‌ని ఎగిసిపట్టుకోవటం పెద్ద 'కత కాదు'. మైదానం బైట కరెన్సీని.. కొండొకచో యాడ్స్‌నీ వొడిసి పట్టుకుని బాల్‌ని హిందీ బాలంత అనగా వెంట్రుక ముక్కంత తేలికగా వదిలిపెట్టడమే ఆర్ట్ ఆఫ్ లీవింగ్‌లోకి వస్తుంది! పైగా ఎప్పుడైనా పిచ్‌మీద పగుళ్ళు ఉన్నాయన్న నిజం గ్రహించగానే మోకాలి చిప్పల్లో పగుళ్ళు అన్న స్టేట్‌మెంట్లు బైటికొస్తాయి. ఫిజియోథెరపిస్టు సైతం 'అవున్నిజమే! పాపం మోకాలిచిప్పలో పగుళ్ళ మూలానే మెదడు చురుగ్గా పనిచెయ్యక ఫీల్డింగ్ లోపాలొచ్చాయని' బిజీ సమావేశంలో ఈజీగా నవ్వేస్తాడు.

అభ్యాసం కూసు విద్య అన్నారు కానీ పాపం 'సునాయాసం కాసు విద్య' అని కొందరికింకా తెలీదు. ఆర్ట్ ఆఫ్ లీవింగ్ బుక్కులో 'హౌటు ఎడ్యుకేట్ అవర్ సెల్ఫ్' అన్న అంకంలో చదువు 'కొనటం' ఎలా అనేది ఏడో చాప్టర్‌లో వివరంగా రాశారు. కానీ తిరగతిప్పి సదువుకోవటం చాతకావాలి! దాని పెకారంగా - సుబ్బరంగా బుక్కులు ముందేసుకుని పబ్లిగ్గా పబ్లిక్కు పరీచ్చలు రాయటం ఎట్లాగో తెలిసిపోతుంది. ఇన్విజిలేటర్లని ఇన్విజిబుల్‌గా అంటే కంటికి కనిపించకుండా ఎలా 'లీవింగ్' చెయ్యొచ్చో తెలుస్తుంది. కాపీలు కొట్టి కొట్టి పాపం చెమటతో టోపీలు తెగ తడిసిపోతున్నాయనీ






మరో టెక్నాలజీని డెవలప్ చేశారు. బలాదూర్‌గా తిరిగినా బహదూర్ వర్సిటీ నుంచి ఏ డిగ్రీ కావాలంటే ఆ డిగ్రీ సర్టిఫికెటు దొరుకుతుంది. కాకపోతే ఇంత పెద్ద యూనివర్స్‌లో ఈ యూనివర్సిటీ ఎక్కడుందా అని మనం అడక్కూడదు!

మన హైద్రాబ్యాడ్‌లో హెల్మెట్ లేని తలల్ని 'వలేసి' పట్టుకుని ఫైవేసే ట్రైనింగ్ టెక్నాలజీని ఆరంభించారు. కత్రినాకైఫ్ బుగ్గలంతా నున్నగా రోడ్లు ముస్తాబు చేస్తామని గద్దెలెక్కిన గాంధీ వారసులు గజానికో కందకం కనిపిస్తున్నా, స్పీడ్‌బ్రేకర్ల పాలిటపడి జనం ప్రాణాలు బ్రేకయిపోతున్నా ట్రాక్ తప్పిన ట్రాఫిక్‌లైట్లు, వెలగని వీధి దీపాలెన్ని ఉన్నా గాంధారిలా గంతలు కట్టుకుని పిహెచ్‌డీ గారడీ విద్యల్ని ప్రదర్శిస్తున్నారు. నెత్తిమీద పోలీస్‌కి టోపీ లేకపోయినా రూల్స్‌కేమీ ఆటంకం లేదుగానీ రోడ్డు మీదికొచ్చిన ప్రతి అమాయకుడి నెత్తిన నరకానికి తొలిమెట్టు అనగా 'హెల్‌మెట్టు' లేకపోతే మాత్రం నెత్తి బొప్పికట్టేలా జరిమానాలుంటాయి. ఇంతాచేసీ వీళ్ళకేమైనా జనాల మీద లవ్వా అంటే అంత సీనులేదు.. ఏ కోర్టో మొట్టికాయ వేస్తే కదలడమేతప్ప మాకేం పూచీ.. నీతో ఇంకేం పేచీ? వందో యాభయ్యో పడేసి పొమ్మని వదిలేస్తారు!' ఇదీ ఆర్ట్ ఆఫ్ లీవింగ్ బుక్కులో దారినబోయే దానయ్యల్ని దొంగదెబ్బ తియ్యటమెలా? అనే మూడో అధ్యాయం రెండో పేరాలో స్పష్టంగా రాసిన వైనం!

ఇక ఎలెచ్చన్ టైంలో 'విలచ్చనంగా మద్యం షాపులు మూసేస్తామని చెప్తారుకానీ గెలిచాక బార్లు బార్లా తెరిచి జనాల్ని చుక్కమత్తులో బొక్కబోర్లా పడేస్తారు! బెల్టు పెట్టుకున్న పెతి మగాడికీ బెల్టు షాపుకెళ్ళి మందుగొట్టేలా సకల సౌకర్యాలు సమకూరుస్తారు! ఇదేం మాయరోగమని ఏ అమాయకుడైనా వాపోతే- 'జనం సీపుగా రోడ్లమ్మట నిలబడి తాక్కుండా మద్యం షాపులు ఎత్తేస్తాం! ఎంచక్కా ఏసి బార్లో కూకుని సుక్కేసుకునే సౌకర్యాలు చేసేస్తాం! ఇదంతా ప్రజల ప్రగతి కోసమే' నంటూ ఉపన్యాసం దంచేస్తారు. ఈ వైనాలన్నీ ఆర్ట్ ఆఫ్ లీవింగ్ బుక్కులో డ్రింకింగ్ అండ్ సింకింగ్ ద పీపుల్ అధ్యాయంలో సీసపద్యాలతో సీసాల్ని వర్ణిస్తూ లిఖించారు. తాక్కుండా తొణక్కుండా చదివితేనే ఈ ఎపిసోడు అర్థం అయ్యేది!

మన్దేశానికి సొతంత్రమొచ్చి అరవైఏళ్లు పూర్తయింది! సొతంత్ర పోరాటంలో పాల్గొని నేటికీ జీవిస్తున్న వారి వయస్సు 80 నుండి 90 ఏళ్లనేది అందరికీ తెలిసిందే. తమాషా ఏమంటే 50-60 ఏళ్ళ వాళ్ళూ సొతంత్ర సమరయోధులుగా చలామణి అవుతూ రైల్వేటిక్కెట్లు, పెన్షన్లు, వ్యవసాయభూములు, ఇళ్ళ స్థలాలు, పెట్రోలు బంకులైసెన్సులు మాకివ్వాల్సిందే, మేమూ సంగ్రామంలో పాల్గొన్నామంటూ గట్టిగా అరవడం. కొంచెం బుర్రపెట్టి ఆలోచించిన వాడెవడైనా- సొతంత్ర సమరం నాటికి నువ్వింకా నిక్కర్ల స్టేజిలో వున్నావు గదా అని లాజిక్ చెప్పబోతే- రార్! కాదు! ఆ రోజుల్లో మా తాతయ్య బ్రిటీష్ పోలీస్ ఠాణా పక్కనున్న మార్కెట్లో కూరగాయలు కొంటుండగా సాహసంగా ఠాణా గోడ తడిపాను! బ్రిటీష్‌వాడికి ఎదురొడ్డి పోరాడానంటూ మన చెవుల్లో కాలీఫ్లవర్లు పెడుతున్నారు. అసలు స్వాతంత్ర్య యోధులు ఈ పరిస్థితుల్ని చూళ్ళేక ఖద్దరు లాల్చీలు కన్నీళ్ళతో తడుపుకుంటున్నారు. లీవింగ్‌టెక్నిక్స్ నేర్చుకున్న నేతలు మాత్రం దేన్ని పట్టుకోవాలో, దేన్ని వదిలెయ్యాలో అన్న ఆర్ట్ ఆఫ్ లీవింగ్ సూత్రాల్ని పాటిస్తున్నారు. ఇదీ నేటిదుస్థితి!! ©

చతుర కత

# జర్నేల్ సింగూ - జంఘూల శాస్త్రీ



**జం**ఘాల శాస్త్రి కంగారుగా రైలెక్కి, చుట్టూచూసి వాళ్ల మామ్మ ఇచ్చిన పెద్ద ఆవకాయజాడీని పైబల్లమీద పెట్టబోయాడు. కానీ జాడీ ఎక్కువ బరువూ, తను ఎక్కువ తేలికా కావటం వలన ఎంత ప్రయత్నించినా అంత ఎత్తు ఎత్తలేకపోయాడు. రెండు మూడుసార్లు అతను కొంచెం ఎత్తు ఎత్తటం, బరువెక్కువై జాడీని కింద పెట్టటం గమనించాడు అక్కడే కూచుని వున్న జర్నేల్‌సింగ్. చివరకు నవ్వుతూ లేచి నుంచుని అలవోకగా ఆ జాడీని తీసి పైబల్లమీదికి ఎక్కించాడు.

ఎక్కించి 'తెలుగువాడివా?' అన్నాడు చేతులు దులుపుకుంటూ.

అవునన్నట్లు తల వూపాడు జంఘాల శాస్త్రి.

"నువ్వు ఎప్పుడూ ఆవకాయా, అన్నం తింటావు. నీకు బలం ఎక్కడినించి వస్తుంది? అప్పుడప్పుడు పరోఠాలు కూడా తింటూ ఉండు కండ పెరుగుతుంది" అన్నాడు జర్నేల్ ఒకింత దర్పంగా.

జంఘాల శాస్త్రి కొంతసేపు మాట్లాడకుండా ఊరుకున్నాడు. తరువాత ఎదురుగా ఉన్న అలారం చెయిన్ దగ్గరకి వెళ్లి అది లాగేడు. గట్టిగా లాగుతున్నట్లు, ఎంత లాగినా గొలుసు కిందికి రానట్లు నటించాడు. జర్నేల్‌సింగ్ అది చూసి చిరునవ్వుతో వెళ్లి గొలుసు పట్టుకుని ఒక్క లాగు లాగేడు.

ఇంకేముంది? రైలు ఆగటం, గార్డు వచ్చి గొలుసు ఎవరు లాగేరో తెల్సుకోటం, జర్నేల్‌సింగ్ దగ్గర జరిమానా వసూలు చేయటం, తిరిగి రైలు బయలుదేరటం అంతా నిముషాల మీద జరిగిపోయింది.

జరిగింది తల్చుకుంటూ ఇంకా ఆశ్చర్యం నుంచి తేరుకోని జర్నేల్‌ని చూసి జంఘాల శాస్త్రి "నువ్వు పంజాబీవాడివి కదా! ఎప్పుడూ పరోఠాలు తింటావు. అప్పుడప్పుడు ఆవకాయ, అన్నం కూడా తిను మరి, బుర్ర పెరుగుతుంది" అన్నాడు సీరియస్‌గా.

–బద్దిగం పాండురంగారెడ్డి



# అంతా మనమంచికే

## హెచ్. జి. వెల్స్

లండన్ శివార్లలోని పేదల బస్తీలో ఒక నాడో చిన్న ప్రమాదం జరిగింది. ఒకర్నొకరు తోసుకుంటూ పిల్లలందరూ ఆడుకుంటున్నప్పుడు ఒక పెద్ద కుర్రాడు, బక్కపల్చగా ఉన్న మరో కుర్రాణ్ణి రెండు చేతులా లేపి దూరంగా విసిరేశాడు. ఇంకేముంది? ఆ కుర్రాడి కాలు పుటుక్కున విరిగింది. ఆ కుర్రాడి పేరు బెర్టీ.

పంధొమ్మిదో శతాబ్దంలో వైద్య సదుపాయాలు ఇప్పటిలా లేవు. పైగా నిరుపేదలకు డాక్టర్లెప్పుడూ అందుబాటులో ఉండరు. కాలికో బరువు తగిలించుకుని బెర్టీ నెలల తరబడి మంచం మీదినుంచి కదలలేదు. కాల్షియం లోపమో ఏమో తెలియదు గాని, ఎన్నాళ్లాయినా ఎముకలు అతకలేదు. కాలు విరిచి మళ్లీ కట్టుకట్టారు. మత్తుమందు అప్పటికి అందుబాటులో లేదు. కనుక ఆ కుర్రాడు గిలగిలా కొట్టుకుని, ఏడ్చి, మొత్తుకున్నాడని ఇక్కడ రాయటం అనవసరం.

మొత్తం మీద కాలు బ్రేక్ కావటం అతడి తొలి "లక్కీ బ్రేక్" అనుకోవచ్చు. ఏడాదికి పైగా మంచం దిగని బెర్టీ చేతి కందిన ప్రతి పుస్తకమూ చదివాడు. సైన్సు, చరిత్ర, సాహిత్యం, తత్వశాస్త్రం ప్రాచీన గ్రంథాలు ఒక్కటేమిటి ఏది దొరికితే అదే.

అతడి తండ్రి పింగాణీ వస్తువుల వర్తకుడు. చిన్న వ్యాపారి. ఆ ఆదాయం సరిపోక అప్పుడప్పుడూ క్రికెట్ ఆడి కొంత సంపాదించాడు. ఎంత చేసినా ఇంటి అవసరాలు తీరలేదు. అసలే దిగువ మధ్యతరగతి సంసారం. తల్లి కూడా ఇరుగు పొరుగుల ఇళ్లలో పనిమనిషిగా చేరింది. కాలు విరిగిన స్థితిలో ఇవన్నీ బెర్టీ మనసుమీద గాఢమైన ముద్ర వేశాయి. చివరికి, పదమూడో ఏట, మరో కొట్లో తను కూడా గుమాస్తాగా చేరాడు.

# తెర తీయగ రాదా!

ఉదయం అయిదింటికి లేచి, ఊడ్చి, చలి నుండి కాచుకోవటానికి పొయ్యి వెలిగించి పద్నాలుగు గంటలు నిర్విరామంగా పనిచేయాలి. కాని కూలీల కష్టాన్ని మెచ్చుకునే యజమానులెక్కడా ఉండరు. నెల తిరక్కుండానే ఉద్యోగం ఊడింది.

మరోచోట మరో నెల. రెండు మూడు సార్లు అలా ఉద్యోగాలు మారిన తర్వాత ఒక కొట్లో కాస్త తీరిక దొరికింది. నిజాకది తీరిక కాదు. కష్టమర్లెవరూ లేనప్పుడు, స్టోర్‌రూంలో దాగి ప్రసిద్ధ తాత్వికుడు హెర్బర్ట్ స్పెన్సర్‌ను చదివాడు బెర్టీ.

ఒకవైపు పఠనాసక్తి దహించి వేస్తోంది, కాని చదివే అవకాశం లేదు. ఇలాంటి బతుక్కన్న ఆత్మహత్యే మేలు. చివరి ప్రయత్నంగా తాను చిన్నప్పుడు చదువుకున్న స్కూల్ టీచర్‌తో కష్టాలన్నీ మొరపెట్టుకున్నాడు. చదవనా? చావనా?

మరోసారి అదృష్టం కలిసొచ్చింది. స్కూల్లో పాఠాలు చెప్పమని జవాబు వచ్చింది. ఇక్కడితో కథ సుఖాంతం కావాలి, కాని బెర్టీని మృత్యువు మరోసారి పలకరించింది. ఒకనాడు ఫుట్‌బాల్ ఆడుతుంటే ప్రత్యర్థి దాడి చేశాడు. ఛాతీ చీరుకుపోయింది. ఊపిరితిత్తికి రంధ్రం పడింది. మూత్రపిండం నుజ్జు నుజ్జయింది. ఏమి చేసినా రక్తస్రావం ఆగలేదు. డాక్టర్లు పెదవి విరిచారు. ఒకటి రెండురోజుల కన్నా ఎక్కువ బతకడన్నారు. లేచి నడవ గలిగే అవకాశం మాత్రం లేదన్నారు మరి కొన్నాళ్లకు.

ఆ తర్వాత పన్నెండేళ్లు 'మరణం నా నేస్తం' అనుకుంటూనే బతికాడు బెర్టీ. ఇక చెయ్యగలిగిందేమీ లేక నిస్సహాయంగా తను చెయ్యగలిగిన ఒకే ఒక్కపని, రచనా వ్యాసంగం ప్రారంభించాడు. ఆ మృత్యుంజయుడే రెండు తరాల ప్రపంచ మేధావులను ప్రభావితం చేసిన రచయిత హెచ్. జి. వెల్స్ (1866-1946). తనింకా ఎక్కువ కాలం బతకననుకున్న వెల్స్ ఓ యంత్రంలాగ పుస్తకాలు రాశాడు. సంవత్సరానికి రెండు, మూడు చొప్పున. బాల్యంలో కడుపుకు మాడిన కుర్రాడు ఫ్రెంచి రివియెరాలో భవ్య హర్మ్యాలను కొన్నాడు. కోటీశ్వరులు, ప్రధానమంత్రులు, దేశాధ్యక్షులు ఆయన ఇంటర్వ్యూల కోసం నిరీక్షించారు. సైన్సుఫిక్షన్ రచయితగా, సోషలిస్టు మేధావిగా, "ది ఔట్‌లైన్ ఆఫ్ హిస్టరీ" రాసిన చరిత్రకారునిగా ఇరవయ్యవ శతాబ్ది చరిత్రలో సుస్థిర స్థానం సంపాదించుకున్నాడు వెల్స్.

—స్వప్న

**ఉదయం అయిదింటికి లేచి, ఊడ్చి, చలి నుండి కాచుకోవటానికి పొయ్యి వెలిగించి పద్నాలుగు గంటలు నిర్విరామంగా పనిచేయాలి. కాని కూలీల కష్టాన్ని మెచ్చుకునే యజమానులెక్కడా ఉండరు. నెల తిరక్కుండానే ఉద్యోగం ఊడింది.**

## జూన్ చతుర నవల 'పడమటిగది' పై

## పాఠకుల సమీక్షలు

### తీరని సమస్య

రూ. 100/- పొందిన సమీక్ష




నేటి పోటీ ప్రపంచంలో బిడ్డ కడుపులో పడ్డప్పట్నుంచే పోటీ ఆరంభమవుతుందంటే అతిశయోక్తి కాదు. తమ పిల్లలు ఇతరులకంటే వెనుకబడకూడదనీ, వారికి మంచి భవిష్యత్తు కలుగజేయాలనీ తల్లిదండ్రులుపడే ఆరాటం ఇంతా అంతా కాదు. అది సహజం కూడాను! వారి ఆత్రుతను వ్యాపారంగా మార్చుకుంటోంది విద్యారంగం.

ఆ యజ్ఞంలో పిల్లలు సమిథలు కావడం శోచనీయం. లేత ప్రాయంలో ఇటు తల్లిదండ్రులు, అటు విద్యాసంస్థలూ తమపై తెచ్చే ఒత్తిళ్లకు తట్టుకోలేక చిన్నారులు శారీరకంగా, మానసికంగా అలసిపోతున్నారు. చదువుపట్ల విరక్తిపుట్టే పరిస్థితి ఏర్పడుతోంది. ఈ నేపథ్యంలో తల్లిదండ్రులు తమ పిల్లల అభిరుచులను తెలుసుకుని, శక్తిసామర్థ్యాలను అంచనా వేసి అడుగు ముందుకువేస్తే బావుంటుంది, అవసరం కూడాను. 'ఆరో తరగతి నుంచే ఎమ్సెట్ పరీక్షకు కోచింగ్' అంటూ ఇటీవల ప్రభుత్వం చేసిన నిర్ణయం- మరెన్ని దుష్పరిణామాలకు దారి తీస్తుందో... తలచుకుంటేనే భయం కలుగుతుంది. పడమటి గది' నవలలో నిత్యపరిస్థితి కూడా అదే. మూర్ఖంగా సవాల్ చేసిన తల్లి, తనకు ఎమ్సెట్‌లో ర్యాంక్ రాకపోతే చనిపోతుందన్న భయంతో, ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయి, మానసిక ఒత్తిడికి లొంగి, అసలు పరీక్షే రాయకపోతే సమస్యే ఉండదని నిర్ణయించుకుంది ఆ పిల్ల. ఆ నిర్ణయంలో భాగంగానే లేని దయ్యాన్ని సృష్టించి, తనకు తోచిన పద్ధతిలో ఆ సంకట స్థితి నుంచి తప్పించుకోవాలని ప్రయత్నించింది.

ఇది నవల కనుక హిప్నాటిజం ద్వారా నిజం బయటపడడమూ, కథ సుఖాంతం కావడమూ జరిగింది. కాని, నిజజీవితంలో వసంతలు, నిత్యలు కోకొల్లలు. వారి కథలకు ముగింపేమిటి!? బంగారు ప్రాయపు ఆటపాటలు, అనుభూతులతో సహజంగా ఎదగవలసిన పిల్లలు- పోటీ చదువుల పేరిట యంత్రాలలా మారిపోతే ఈ దేశపు భవిష్యత్తు ఏమిటి? ?... ఇది తీరని సమస్య! సమాజమూ, ప్రభుత్వమూ దీని గురించి సీరియస్‌గా ఆలోచించవలసిన అగత్యం ఎంతైనా ఉంది. పల్లెలోని నిత్య అనుభూతులు, వాతావరణ చిత్రీకరణ హృద్యంగా ఉంది.

– పి.వి.వి.సత్యనారాయణ,
సికింద్రాబాద్.

### నిలువెత్తు ప్రతిబింబం

రూ. 75/- పొందిన సమీక్ష

సరోజా సింధూరి నవల 'పడమటిగది' కథావస్తువు సమకాలీన సమస్యకు నిలువెత్తు ప్రతిబింబం. నేటి సమాజంలో చాలా కుటుంబాల్లో పిల్లలు 'నిత్య' అంత తీవ్రత లేకపోయినా ఎంతో కొంత 'చదువు' పట్ల 'నిరసన' పసితనం నుంచే పెంచుకుంటూ, ఆ భావాన్ని వ్యక్తం చేయలేక 'అల్లరి' ద్వారా అయిష్టతను పరోక్షంగా ప్రదర్శిస్తున్నారు. రచయిత్రి తన సామాజిక బాధ్యతను గుర్తించి విద్యార్థుల పక్షాన

ఆలోచించి తల్లిదండ్రులకు ఒక 'హెచ్చరిక' చేసినట్లుగా ఈ నవల రాసినతీరు హృద్యంగా ఉంది. 'వసంత'లాంటి తల్లులు నేటి కార్పొరేట్ కాలేజీల మాయాజాలంలో పడి, మార్కుల, ర్యాంకుల ప్రదర్శనా, ప్రలోభాలకు లోబడి 'నిత్య' లాంటి అనేక మంది పిల్లలను ఒత్తిడికి గురిచేయడమే కాకుండా చివరకు వారి జీవితాలనే బలితీసుకునే విషాద సంఘటనలు ఈ సీజన్‌లో మనకు అడపాదడపా ఎదురవుతూనే ఉంటాయి. అలాంటి తల్లులు చివరకు రాజీపడి సరైన నిర్ణయం తీసుకోవడం ముదావహం.

ముఖ్యంగా రచయిత్రి ఈ నవలలో కుటుంబ సంబంధాలను, పల్లె వాతావరణాన్ని వర్ణించిన తీరు బాగుంది. 'సమస్య' చుట్టూనే కథను తిప్పే ప్రక్రియలో అనవసరంగా నిడివిని పెంచినట్లు అనిపించింది. మొత్తం మీద ఈ నవల ఒక సామాజిక ప్రయోజనాన్ని ఉద్దేశించి రాసిందనడానికి సందేహంలేదు. ఇది చదివిన కొద్దిమంది తల్లుల్లోనయినా మార్పు రావాలని ఆశిద్దాం.

– జి.కృష్ణవేణి, హైదరాబాద్.

## పిల్లలకు స్వేచ్ఛ

రూ. 50/– పొందిన సమీక్ష

ఎప్పటిలాగానే ఒక సమస్య- దాని పరిష్కారం సూచించే నవలలని ప్రోత్సహిస్తున్న 'చతుర' ఈ నెల చక్కటిసందేశాత్మకమైన, నేడు ఎంతోమంది పిల్లలు ఎదుర్కొంటున్న సమస్యను మనముందుంచింది. తల్లిదండ్రులను, కాలేజ్ యాజమాన్యాలను పరోక్షంగా హెచ్చరించారు రచయిత్రి సరోజా సింధూరి.

టీవీ సీరియల్స్, ప్రతిధ్వనిలాంటి చర్చా కార్యక్రమాల్లోను, కథల్లోను ఈ సమస్య గురించి వింటున్నాం. చదువుతున్నాం. అయితే సమస్య తీవ్రమైనప్పుడు, దాని పరిణామమేంటో కూడా ఈ నవల తెలియజేసి, హెచ్చరిస్తుంది. పిల్లల మనసుకి నచ్చిన పాఠ్యాంశాన్ని వారిని ఎన్నుకోనివ్వాలి. ఆ స్వేచ్ఛ వారికిస్తూనే, అదే సమయంలో మంచి సలహాలు వారికి నచ్చిన విధంగా తెలియజేయాలి. నిత్యకిష్టంలేని 'ఎమ్‌సెట్'ని అంటగట్టి, ఊపిరి కూడా పీల్చుకోనివ్వకుండా చదువుకోమని తల్లి వేధిస్తున్నప్పుడు, ఒద్దికగా, సఖ్యతగా పెరిగిన ఆ పిల్లలో తిరుగుబాటుతనానికి శరీరం సహకరించకపోవడంతో, మానసికంగా ఎదురుతిరగటమే కథాంశం. నిత్య మావయ్య నందూకి సందేహం కల్గినపుడే ఇదంతా నిత్యే చేస్తుందని పాఠకులకి కూడా అన్పిస్తుంది. అయితే సస్పెన్స్ ప్రధాన అంశం కాదు కదా! నిత్య చేసిన, చేయని పనులన్నిటికీ వివరణ పూర్తిగా లేదు. కథాంశం క్లిష్టమైన సమస్య కావడంవల్ల ఇది లోపంగా కన్పించదు. సరోజ సింధూరి గార్కి, చతురకు మా హృదయపూర్వక కృతజ్ఞతలు.

– **ఉషారాణి**, సిరిపూర్ కాగజ్‌నగర్.

## జీవన వికాసం

రూ. 50/– పొందిన సమీక్ష

నేటి కార్పొరేట్ చదువులూ; కాలేజీలు విద్యాసంస్థల విధానాలూ; ర్యాంకుల కోసం వేలంవెర్రిగా సాగుతున్న పోటీ; తల్లిదండ్రుల పాట్లూ; విద్యార్థుల అగచాట్లూ- వెరసి, ఇప్పుడు తయారు చేయబడుతున్న ఒక జనరేషన్. ఇలా ఒకే అంశానికి చెందిన అనేక పార్శ్వాలను స్పృశిస్తూ- అందర్నీ ఆలోచింపజేయగల నవల 'పడ

మటి గది'. మంచి మనో వైజ్ఞానిక కథా వస్తువు. మంచి సందేశం. జీవన వికాసానికి కావలసిన స్వేచ్ఛ, ఆలోచనలూ, ఇష్టాలూ, సంతోషాలూ, అనుబంధాలూ- వీటన్నిటినీ కలబోసిన రచనావిధానం బాగుంది. అయితే నిత్య అవలంబించిన మార్గం- అందరికీ అన్వయించడానికి సమంజసం అనిపించదు గానీ, నవల ద్వారా చెప్పదలచుకున్న సందేశానికి దోహదపడింది. ఇష్టమైన వాతావరణం, మనో వికాసానికి తగిన స్వేచ్ఛ. కావలసినదాన్ని ఎంచుకొని అందులోనే అనుకున్నది సాధించడం. పిల్లలకు ఈ అవకాశం కల్పించడం అవసరం. తల్లిదండ్రుల ఆలోచనలలో కూడా మార్పు రావాలి. పిల్లల ఇష్టాయిష్టాలను కూడా గమనిస్తూ వుండాలి. పోటీ ప్రపంచంలో అయినా కూడా సంతోషంగానూ, పాజిటివ్‌గానూ ముందుకు సాగే అవకాశం ఇవ్వాలి. ప్రతి ఒక్కరికీ అవసరం అయిన మంచి సందేశాన్ని అందించిందీ నవల.

–వి. వీరభద్రరావు, హైదరాబాద్.

## చదువే జీవితం కాదు

రూ. 50/– పొందిన సమీక్ష

పిల్లల చదువుల పట్ల పెద్దలు అతిగా పెంచుకొంటున్న 'ఆశ'ను చర్చిస్తూ చక్కని నవలికను అందించారు సరోజా సింధూరి. ఇది తల్లిదండ్రుల మనోభావాలకు పిల్లల ఆలోచనా సరళిని అద్దం పడుతోంది.

పిల్లల ఆలోచనలేమిటో, వాళ్ల ఆసక్తి, ఆశయాలేమిటో తెల్సుకొని వాటికి తగ్గట్టుగా చేయూత నందించి వాళ్లని అభివృద్ధి పథంలో పయనించే విధంగా తల్లిదండ్రులు తీర్చిదిద్దాలి. అమ్మ తనపై పెట్టుకున్న నమ్మకాన్ని నిజం చెయ్యగలనో లేనో అన్నది ఒక ఆలోచన. నిత్యను ఎన్నో రకాలుగా మానసిక ఆందోళనకు గురి చేసింది. అక్కణ్ణుంచి ఎన్నో ఎత్తులు వేసి పరీక్షకు హాజరు కాకుండా ఉండేలా పరిస్థితుల్ని సృష్టించింది. అవన్నీ వమ్ము కావడంతో అమ్మ దూరం కావడం భరించలేని ఆ చిన్నారి తనే ఈ లోకాన్ని వదిలే ప్రయత్నం చేసింది. పిల్లలకిష్టమయిన దాన్ని వాళ్లు ఎంపిక చేసుకోవడంలో తల్లిదండ్రులు సహాయపడాలి కాని, తమ భావాల్ని వాళ్లపై రుద్దడం తగదు.

పిల్లల మనసు తెలుసుకోవడానికి ప్రయత్నించని తల్లిదండ్రులకో గుణపాఠం 'పడమటిగది'. చదువే జీవితం కాదని, ఆటలు, పాటలు లౌకిక అనుబంధాలు, ఆప్యాయతలు, ప్రేమానురాగాలు నేటి బాలలు ఆశిస్తున్నారన్న సత్యాన్ని నేటి సమాజం ముందుంచారు రచయిత్రి. కళ్లు తెరిచి కనగలిగితే పిల్లల భవిష్యత్తుకు బంగారు బాటలు వేయడం ఎంతో సులభతరం అవుతుందని సహేతుకంగా నిరూపించారామె.

– సువర్ణ జ్యోతి, తణుకు.

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.

# నర్సింగ్ అడ్మిషన్లు

**...ild your career as you rebuild other's lives!**



MPHW (F) Nsg

## సెయింట్ లూక్స్ కాలేజ్ ఆఫ్ నర్సింగ్ (మహిళలు)

(ఆం.ప్ర ప్రభుత్వం, ఎ.పి.ఎన్.ఎం.సి & ఇండియన్ నర్సింగ్ కౌన్సిల్‌చే గుర్తింపు పొందిన సంస్థ)

(డా॥ ఎన్.టి.ఆర్. ఆరోగ్య విశ్వవిద్యాలయం అనుబంధ సంస్థ)

**అందిస్తున్న కోర్సు** : నాలుగు సం॥ల బియస్సీ నర్సింగ్,

**అర్హత** : 50% తో ఇంటర్ 10+2 (సైన్స్) MPHW Vocational

**వయోపరిమితి** : 17-35 సం॥లు

## సెయింట్ లూక్స్ స్కూల్ ఆఫ్ నర్సింగ్ (మహిళలు)



GNM Nsg

(ఆం.ప్ర ప్రభుత్వం ఎ.పి.ఎన్.ఎం.సి. & ఇండియన్ నర్సింగ్ కౌన్సిల్, న్యూఢిల్లీచే గుర్తింపు పొందిన సంస్థ)

...న్న కోర్సు : 3 1/2 సం॥ల జనరల్ నర్సింగ్ & మిడ్ వైఫరీ

**అర్హత** : 45% తో ఇంటర్ 10+2 (ఏదేని గ్రూపు) పాస్

**...యోపరిమితి** : 17 - 35 సం॥లు



BSc Nsg

## సెయింట్ లూక్స్ ఎం.పి.హెచ్. డబ్ల్యు ( స్త్రీ ) ట్రైనింగ్ సెంటర్

(ఆం. ప్ర ప్రభుత్వం చే గుర్తింపు పొందిన ఎ.పి.ఎన్.ఎం.సి హైదరాబాద్‌చే అనుమతి పొందిన సంస్థ)

**అందిస్తున్న కోర్సు** : 18 నెలల మల్టీపర్పస్ హెల్త్ వర్కర్స్ (స్త్రీ) శిక్షణ

**అర్హత** : 10వ తరగతి, మెట్రిక్యులేషన్

**వయోపరిమితి** : 16-35 సం॥లు

BORA ADS VSP

**వివరములకు:**




ది సెక్రటరీ & కరస్పాండెంట్
నెం. 49, దసపల్లా హిల్స్, విశాఖపట్నం-530 003
ఫోన్: 0891-2565364, సెల్: 9848199414,
ఫ్యాక్స్: 0891-6616414
www.stlukes.ac.in www.stlukesindia.org
E-mail: admin@stlukesindia.org

